కంచి పరమాచార్య

# అమృతవాణి

ద్వితీయ భాగము

# నమో నమః



అనువక్త :

దేవరకొండ శేషగిరిరావు

# నమోః నమః

## కంచి పరమాచార్య అమృతవాణి

## ద్వితీయ భాగము

అనువక్త:

దేవరకొండ శేషగిరిరావు

ప్రకాశకులు

విజ్ఞాన మంజూష

హైదరాబాద్

నమోః నమః

అమృతవాణి ద్వితీయ భాగము

---

అనువక్త: దేవరకొండ శేషగిరిరావు

ప్రథమ ముద్రణ : డిసెంబర్ 2011

ప్రకాశకులు : మహావిద్యా పీఠం,
ఎయిర్‌ఫోర్స్ అకాడమీ రోడ్, దుండిగల్,
హైదరాబాద్-500 043, సెల్: 98854 44428

© : Publishers

వెల : రూ. 100/-

ప్రతులకు : నవోదయ పబ్లిషర్స్, కాచిగూడ మరియు
అన్ని ముఖ్యమైన పుస్తక విక్రయ కేంద్రాలు

టైటిల్ డిజైన్ : కె. రామకృష్ణ

ప్రింటింగ్ :



## శ్రీ వావిలాల సోమయాజులు

## 1918-1992

పితృదేవులు శ్రీ వావిలాల సోమయాజులు గారి జ్ఞాపకార్థము.
ప్రచురింపబడినది. వారికి కైవల్య ప్రాప్తి సిద్ధించుగాక!
పుత్రులు: వావిలాల బృహస్పతి, వావిలాల ఉమాపతి, వావిలాల గౌరీపతి

227

# ఓం జగద్గురుం ప్రణమామ్యహం

జయ జయ జయ జగద్గురుం ప్రణమామ్యహం
శ్రీ చంద్రశేఖర సద్గురుం ప్రణమ్యాహం
చంద్రశేఖర గురుం వందే శుద్ధ సత్వ స్వరూపిణం
కామ కోటి పీఠాధిప సద్గురుం ప్రణమామ్యహం

ఆదిశంకర నమోతేజం అదికారణ కారణం
ధర్మరక్షణ రూపిణం, వేదరక్షణ కారణం
గో రక్షణ దీక్షణం ప్రేమవీక్షణ వీక్షణం
జగత్కుటుంబినీయ సార్థకం జగద్గురుం ప్రణమామ్యహం

శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖర మహాస్వామి, కంచి పీఠాధిపతులు, జగద్గురువులు, బ్రహ్మభూతులు, సర్వదేశకాలవస్తు పరిచ్ఛేదరహిత స్వరూపులు. వారు శుద్ధ సత్య స్వరూపులు. వారి తేజస్సులో సాక్షాత్తు ఆదిశంకరులు. వారు ధర్మరక్షణ, వేదరక్షణ, గో రక్షణ కోసం అవతరించిన శ్రీమన్నారాయణ స్వరూపులు. వారి వీక్షణం పరిపూర్ణమైన ప్రేమవీక్షణం. వసుధైక కుటుంబం అనే ఉపనిషత్ వాక్యం వారిపట్ల సంపూర్ణ సార్థకం. అటువంటి జగద్గురువులకు మా ప్రణామాలు.

భరతభూమి పుణ్యభూమి, కర్మభూమి. ఎందరో మహనీయుల జన్మకు కారణమై సామాన్య ప్రజానీకాన్ని సన్మార్గంలో నడపటానికి కృషి చేసిన ఆదిశంకరులు, విద్యారణ్యుల కోవకి చెందినవారు 68వ కంచి పీఠాధిపతి శ్రీ పరమాచార్య వారు ప్రాతఃస్మరణీయులు. వారి బోధలు, వారి ఉపదేశాలు - ఆచరణీయములు. అనుసరణీయములు. భక్తుల జన్మకర్మల విధివిధానాలను సరిదిద్దుకునేటువంటి సూచికగా, ప్రత్యక్ష ధర్మనిధిగా సత్యవేద సారమైన, సకల ఉపనిషత్, సకల శాస్త్రముల సారము నుండి నిబిడీకృతమైనది ఈ అమృతవాణి.

ఈ అమృతవాణి ద్వితీయభాగము - నమోః నమః తెలుగులోకి అనువదించిన దేవరకొండ శేషగిరిరావు గారిని, ముద్రించి ఆంధ్ర పాఠకలోకానికి అందించిన మహావిద్యాపీఠ నిర్వాహక మండలి వారికి స్వామివారి అనుగ్రహం ప్రసాదించాలని ప్రార్థిస్తూ....

**-జి. గోపాలకృష్ణ హనుమత్ ప్రసాద్**

గుడివాడ

# అనుగ్రహం

నడిచే దేవునిగా కీర్తింపబడిన కంచి మహాస్వామి, శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు తమిళంలో ప్రసంగించగా దైవత్తిన్ కురల్ పేరిట సంకలనం చేసిన మహాభాగులు శ్రీ రా. గణపతిగారు. శ్రీ తిరునవుక్కరసుగారు వీటిని ప్రచురించారు. Call of Jagadguru పేరున ఆంగ్లంలో చెన్నైవారు (కొన్నిటిని) అందించారని విన్నాను. భారతీయ విద్యాభవన్‌వారు Hindu Dharma అనే పేరుతో ఒక బృహత్ సంపుటాన్ని వెలువరించారు. వారే Guru Tradition; Kanchi Mahaswami on poets and poetry అనే పుస్తకాలను ప్రచురించారు.

శ్రీ కంచి మహాస్వామి పీఠారోహణ శతాబ్ది మహోత్సవ ట్రస్టు, ముంబైవారు ఆంగ్లంలో సుమారు ఆరువేల పుటలు పైబడియున్న ఏడు సంపుటాలను 2006లో ప్రచురించారు.

ఇక తెలుగులో సాధన గ్రంథమండలి, తెనాలివారు జగద్గురు బోధలలో కొన్నిటిని పది సంపుటాలుగా ప్రకటించి మహోపకారం చేసారు. పూజ్యులగు శ్రీ చల్లా విశ్వనాథశాస్త్రిగారు సనాతన ధర్మము - వేదములు, ధర్మాకృతి పేరున స్వామివారి వాణిని వెలువరించారు.

ముద్రించవలసినవి ఎన్నో ఉన్నాయనే తలంపుతో ఇంతవరకు ప్రకటింపబడని వాటిని, లేదా అసమగ్రంగా నున్న వాటిని సమగ్రంగానూ తెలిగించి అందించాలని సంకల్పంతో ఉండగా సనాతన ధర్మం పట్ల ఆసక్తి కలిగిన సహృదయులైన శ్రీ వావిలాల ఉమాపతి C.A. గారు స్వామివారి 'అద్వైత సాధన'గా అనువదించవలసిందని ఆదేశించారు. అట్టి అనేక విషయాలు Voice of Godలో ఉన్నాయి. అద్వైతసాధన, గురుసంప్రదాయం, (భారతీయ విద్యాభవన్‌వారు ప్రచురించిన Guru Traditionకి నా అనువాదం). 3 సంపుటాలలో నాల్గువందల పుటలతో కూడిన అద్వైతాన్ని (అద్వైతం-అమృతవాణి-1) అనువదించగా శ్రీ ఉమాపతిగారే వెలుగులోకి తీసుకొని వచ్చారు.

శ్రీవారి అమృతవాణిలో ఇది రెండవ గ్రంథం. సంస్కృతి; కవులు - కావ్యాలు; నమోనమః; వేయి సంవత్సరముల వెనుక పంచాయితీ ఎన్నికలు మొదలైన విషయాలుంటాయి. వీటిని ఆంగ్ల మాతృక ఒకటి, మూడు, నాల్గు, ఏడవ సంపుటాలలో ఉంటుంది.

ఒకటి, మూడు, ఏడు సంపుటాలను ఆంగ్లంలోకి అనువదించిన పుణ్యాత్ములు, శ్రీ వి. కృష్ణమాచారి గారు. నాల్గవ సంపుటాన్ని శ్రీమతి MRF గారందించారు.

ఈ రచనకు వారి ఆంగ్లానువాదం ఆధారం. నా అనువాదంలో చేర్పులు, మార్పుల గురించి వివరిస్తాను.

సనాతన ధర్మంలో సమూహ విషయాల శీర్షికలో ఏడు పుటలున్నాయి. అందువల్ల సంఘం శీర్షిక నంతటినీ అనువదించాను.

శ్రీ శాస్త్రిగారు వ్రాసిన ధర్మాకృతిలో కుట్టికవి గురించి విపులంగా ఉంది. కవులు - కావ్యాల శీర్షికలో Voice of God లో ఉన్నది ఉన్నట్లు వ్రాసాను.

జగద్గురు బోధలలో కంచిమఠం - శ్రీహర్షుడనే విషయం ఉన్నా, నా అనువాదంలో శ్రీహర్షుని చరిత్ర; కంచి నగర మహారాజును దమయంతికి పరిచయం చేసే శ్లోకం యొక్క మొత్తం తాత్పర్యమూ ఉంటుంది.

"అందున్న అక్షరాలను తొలగిస్తే చిత్రమైన మార్పులనే విషయానికి అనుబంధంగా కొంత విషయముండుట వల్ల Poets and Poetry లోని విషయాలను చేర్చాను. ఈ ఆంగ్లగ్రంథం ఆధారంగా తమిళ కవుల శీర్షికను చేర్చాను.

జగద్గురు బోధలలో యజ్ఞంలో అహింసయనే విషయమున్నా నా అనువాదంలో స్వామివారి సమర్ధనలు అధికంగా ఉన్నాయి. ఒక వెబ్‌సైట్ ఆధారంగా నా అనువాదం సాగింది. ప్రాచీన శాస్త్రాలను రక్షించండనే వ్యాసం, బోధలలో ఉన్నా ఇందలి విశేషాన్ని గమనించండి.

కవులు - కావ్యాల శీర్షికలో జగద్గురు బోధలలో మూకకవి, మాఘ

కవి, వాల్మీకి, భవ భూతుల ప్రస్తావన ఉండడం వల్ల వాటిని తెలిగించలేదు. భోజకాళిదాసుల సంభాషణ కూడా ఆంగ్ల గ్రంథంలో లేకపోవడం వల్ల తెలిగించలేదు. అప్పయ్య దీక్షితుల వారి రెండు శ్లోకాలు, బోధలలో ఉండడం వల్ల వాటిని తెనిగించక కేవలం వారి జీవితాన్ని క్లుప్తంగా ఉన్నదానిని పేర్కొన్నాను. ఇందలి వాటిని ఎవరైనా వ్యాసరూపంలో అందించి యుండవచ్చు. నేను వాటిని చూడలేదు.

అమృతవాణి - నాల్గు భాగాలను ప్రచురించిన శ్రీ ఉమాపతిగారికి హృదయపూర్వక అభినందనములర్పిస్తున్నాను.

ఇంతవరకూ తెలుగులో రాని విషయాలెన్నో ఉన్నాయి. అనువదించాలని సంకల్పం. స్వామివారు అనుగ్రహం చూపిస్తారని నాకొక వెఱ్ఱి నమ్మకం.

పూజా సామాగ్రిని సేకరించడం, పూజ కాకపోయినా పరోక్షంగా ఉపకరిస్తోంది. అట్లాగే నేను చేసే కృషి కూడా. ఈ జన్మకిది చాలు.

మహాస్వామి వారు, కార్తికమాసంలో వెలిగించే ఆకాశదీపం వంటివారు. అంతేకాదు; అన్ని మాసాలలోనూ వెలిగే అఖండజ్యోతి. ఆ కాంతులు నల్గడలా ప్రసరించుగాక.

ఇట్లు

ఈ సంస్కృతికి ఒక అర్చకుడు

**దేవరకొండ శేషగిరిరావు**

# విషయ సూచిక

## సంస్కృతి



## కవులు - కావ్యాలు



## నమోనమః

## ప్రాచీన కాలంలో ఎన్నికలు

**రాజ్యం - మతం**

**యువకులకు హితోపదేశం**



**సంఘం**

# సంస్కృతి

## జ్ఞానానికి ఏదీ అడ్డురాదు

ఎందరో జనకులున్నారు. నిమి వంశానికి చెందిన వారిని జనకు లంటారు. వారు మిథిలా నగరాన్ని రాజధానిగా చేసుకొని విదేహ రాజ్యాన్ని పరిపాలిస్తూ ఉండేవారు. సీత తండ్రి పేరు సీరధ్వజుడు. కుటుంబనామంతో కలిసి సీరధ్వజుడయ్యాడు. సీరం అంటే నాగలి. నాగలి గుర్తు ధ్వజంపై ఉన్నవాడు కనుక అతడట్లా పిలవబడ్డాడు. నాగేటి చాలులో లభించింది కనుక సీత అయింది.

మిథిలా రాజ్యంలో కేశిధ్వజ జనకుడని, ఖాండిక్య జనకుడని ఇద్దరుండేవారు. వారు అన్నదమ్ములు పిల్లలు. వారి తాత ధర్మధ్వజుడు. కీర్తి ధ్వజుని కుమారుడు కేశిధ్వజుడు. అమృతధ్వజుని కుమారుడు ఖాండిక్యుడు. ధర్మమే లక్ష్యంగా ఉండేవాడు కనుక ధర్మధ్వజుడు. ఈ పదానికి రానురాను మోసగాడనే అర్థం వచ్చింది. ధర్మాచరణ ఉన్నట్లు నటించేవాడేగాని ఆచరించేవాడు కాడనే అర్థంలో వాడబడింది. (ఈ మాట మనుస్మృతిలోనూ ఉంది) కాని మన కథలోనివాడు మాత్రం మోసగాడు కాడు.

సాధారణంగా రాజ్యం పెద్దవానికే చెందుతుంది. చిన్నవానికి కూడా రాజ్యంలో కొంత భాగం ఈయడం కద్దు. చిన్నవాడు పరాక్రమం చూపించి తండ్రికే అందించేవాడు. రాజ్యం అక్కరలేదని తన సోదరుడు ఏలుతూ ఉంటే సంతోషించాడు రాముడు. ఆ రాముడే చివరకాలంలో కోసల రాజ్యాన్ని రెండుగా విభజించి కుశలవులకు అప్పజెప్పాడు. కోసల రాజ్యానికి బైట ఉన్న ప్రాంతాన్ని లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల సంతానానికి పంచి పెట్టాడు.

పై కేశిధ్వజుడు, ఖాండిక్యుల తండ్రులు భిన్నమైన స్వతంత్ర రాజ్యాలకు రాజులయ్యారు. తండ్రుల తరువాత రాజ్యాలు విడివిడిగా కొడుకులకు దక్కాయి.

పూర్వకాలంలో క్షాత్రధర్మాన్ని అనుసరించి రాజ్యాలను పరిపాలిస్తూ, రాజ్యాలను విస్తరిస్తూ ఉండేవారు. వారు కర్మమార్గంలో ఉన్నా వారిలో వేదాంత జ్ఞానం అనుస్యూతంగా ఉంటూ ఉండేది. పిల్లలు యుక్తవయస్సులో వచ్చేసరికి వారిని పట్టాభిషిక్తులను చేసి తపోమార్గంలో కాలాన్ని గడిపేవారు. తామరాకు మీద నీటిబొట్టులా అంటకుండా కాలం గడుపుతూ ఉండేవారు. తత్త్వ విచారం ఒక మూల సాగుతూనే ఉండేది. అట్టి ఒక్క జనకుని గూర్చి బృహదారణ్యక ఉపనిషత్తు వివరించినది.

## కేశిధ్వజుడు

పై అన్న దమ్ముల పిల్లలలో ఖాండిక్యుని కంటె కేశిధ్వజుడు వేదాంతంలో దిట్ట. వారెంత వేదాంతులైనా నేటివారి మాదిరిగా కర్మకాండలను వదిలి పెట్టేవారు కారు. ఆత్మజ్ఞానం ఈశ్వరానుగ్రహం వల్ల ఏ కొంతమందికో దక్కుతుంది. మిగిలినవారు గత జన్మ కర్మ ఫలాలను పోగొట్టుకోవడం కోసం కర్మ, భక్తులను తప్పక ఆచరిస్తూ ఉండేవారు. కర్మకాండ తరువాత జ్ఞాన కాండలను అనుష్ఠించుట వారి జీవనంలో కనబడేది. తత్త్వవేత్తయైన కేశిధ్వజుడు యజ్ఞాది అనుష్ఠానాలను నిర్వహించేవాడు.

## అద్వైత జ్ఞానులు - ప్రపంచ వ్యవహారములు

ఆత్మానుభూతిని పొందినా రాజ్యాన్ని ఏలిన జనకుని గురించి చెప్పాం కదా! ప్రపంచాన్ని మాయగా భావించే అద్వైతులెన్నో ఘనకార్యాలు చేసారు, ప్రపంచాన్ని సత్యంగా భావించే ద్వైతుల కంటె కూడా. 32 సంవత్సరాలు

బ్రతికిన ఆది శంకరులెన్ని ఘనకార్యాలు చేసారో తెలుసు కదా! విజయనగర స్థాపకుడైన విద్యారణ్యుడు, శివాజీ మహారాజునకు మార్గదర్శకుడైన సమర్థ రామదాస స్వామి తంజావూరులో ముగ్గురు నాయక రాజులకు మంత్రిగా పనిచేసిన గోవింద దీక్షితులు ప్రముఖ అద్వైతులే కదా! మాయా సిద్ధాంతం వల్ల ఈ దేశం పాడైపోయిందనేవారికి పై ఉదాహరణలు చాలు.

ఈ మాయా ప్రపంచంలో ఈ అద్వైత జ్ఞానులెట్లా సాధించారంటే అది ఒక చిక్కు ప్రశ్నయైనా అద్వైత జ్ఞానమే వారికట్టి బలం ఇచ్చిందని చెప్పవచ్చు. ప్రపంచం, శరీరం, మనస్సు అంతా మాయయేనని, సత్యమైనట్లు కన్పిస్తున్నాయని ఈ సిద్ధాంతం అంటోంది. ఈ కన్పించడాన్ని ఒక క్రమపద్ధతిలో ఉంచగలిగితే అనగా కర్మానుష్ఠానం సాగితే తరువాత జ్ఞానమార్గం వైపు మళ్ళుతాడు. ఈ ప్రపంచం సత్యంగా కన్పిస్తోంది కాని సత్యం కాదనే భావన దృఢంగా ఉన్నపుడు ప్రపంచ వ్యవహారాలలో జ్ఞాని తాదాత్మ్యాన్ని చెందకుండా నిస్సంగుడై ఆచరిస్తాడు. సంగంతో ఉన్నవాడు దీనిని ఉద్ధరించాలని లక్ష్యాన్ని చేరుకోవాలనే తపన ఉంటుంది. అందువల్ల నిస్సంగుని మాదిరిగా చక్కని ప్రణాళికను సిద్ధం చేయలేడు. శరీరం, మనస్సుపై ఆధారపడింది కదా! సంగం వల్ల మనస్సు తన నైతికశక్తిని కోల్పోతుంది. అందువల్ల శారీరక శక్తి, మానసిక శక్తి తగ్గుతూ ఉంటాయి. కాని అద్వైతికి ఈ చిక్కు ఉండదు. అతడు ప్రపంచ వ్యవహారాలలో మునిగి తేలుతూ ఉన్నట్లు ఇతరులకు కనబడినా అతని మనస్సు వీటితో అంటుకొని యుండదు. సాక్షిగానే ఉండి తొట్రుపాటు లేకుండా సాంఘిక కార్యక్రమాలను చక్కగా నిర్వహించగలడు. అప్పుడతనికి మానసిక బలం, చక్కని యోచన తటస్థిస్తాయి. అందువల్లనే కేశిధ్వజుడు ఖాండిక్యుని కంటె రాణించాడు. ఐహికాముష్మికాలను రెంటినీ సాధించాడు.

## ఖాండిక్యుడు

ఇతనికి వేదాంతం పట్ల మోజులేదు. కర్మానుష్ఠానపరుడు. బ్రహ్మవిద్యలో కేశిధ్వజుడెంత గట్టివాడో కర్మకాండ విషయంలో ఖాండిక్యుడూ అంతటి గట్టివాడే. పూర్వకాలంలో ఇతర రాజులపై రాజ్యాలపై దండెత్తడం ఆచారం. ఈ ధోరణిలో ఖాండిక్యుడు, కేశిధ్వజుని రాజ్యాన్ని కబళించబోయాడు. కాని కేశిధ్వజుడే జయించాడు. ఖాండిక్యుడు మంత్రులతో, పరివార వర్గంతో అడవుల పాలయ్యాడు. ఇద్దరూ తమ తమ ప్రాంతాలలో యజ్ఞాలు నిర్వహిస్తూ ఉండేవారు.

కేశిధ్వజుడు యజ్ఞం చేస్తూ ఉండగా హోమధేనువును పులి చంపేసింది. ఇది ఇచ్చే హోమ ద్రవ్యాలతో దేవతారాధన జరుగుతూ ఉండేది. మధ్యలో ఇట్లా జరిగిందేమిటని కేశిధ్వజుడు కంగారు పడలేదు. అతడు సహజంగా జ్ఞాని కదా!

అయితే మధ్యలో ఈ ఆవు చనిపోవడం యజ్ఞానికి విఘ్నంగా భావించారు పెద్దలు. దానికి ప్రాయశ్చిత్తమేమిటని అడిగాడు రాజు.

అన్నీ తమకే తెలుసని పూర్వులు భావించేవారు కాదు. వారు వినయ సంపన్నులు కదా! తెలియని దానిని తెలుసుకోవడం కోసం ఎందరి దగ్గరకో వెళ్ళి తెలిసి కొన్నట్లు వేద, ఇతిహాస పురాణాలలో అనేక కథలున్నాయి. కశేరువనే బ్రాహ్మణునకు ఈ ప్రాయశ్చిత్త విధానం తెలుసు, అడిగి తెలిసికో అని రాజుతో అన్నారు పెద్దలు. అతడు తనకు తెలియదనగా భార్గవుని దగ్గరకు వెళ్ళమన్నాడు. అంతేనే కాని తెలిసీ తెలియని పద్ధతిని చెప్పలేదని గుర్తించండి. అతడు శునకుని దగ్గరకు వెళ్ళమన్నాడు. కర్మకాండలో ఏదైనా లోపం జరిగితే గోవింద యని మూడుసార్లు ఉచ్చరిస్తే అదే ప్రాయశ్చిత్తమని మనవంటివారు భావిస్తారు. అంతటితో తృప్తి పడేవాడు కాదు రాజు.

గోవింద అనడంలో తప్పులేదు. తీవ్రమైన మందును ముందే వేయం కదా! అంతమాత్రంచే సరియైన ప్రాయశ్చిత్తవిధిని తెలిసికోవడంలో నిర్లక్ష్యమూ పనికిరాదు.

మనమాకలితో ఇంటికి వెళ్ళామనుకోండి, స్నానం చేసి కడుపు నిండా తినాలి. అయితే ఇంట్లోవాళ్ళు గోవింద అంటే స్నానం చేసినట్లే కదా అని అంటే మనమా మాటలను విని ఊరుకోగలమా! కాని నామం త్రికరణ శుద్ధిగా ఉచ్చరిస్తే వేరే స్నానం అక్కరలేదు. అదే ప్రాయశ్చిత్త విధి. పై శునకుడు తనకు తెలియదని ఖాండిక్యుని దగ్గరకు వెళ్ళమని అన్నారు.

శత్రువైన రాజును ఎట్లా అడుగుతాడు? అడిగినా అతడు చెబుతాడా? జపం చేసి సరిపెట్టుకోవాలని అందరూ సలహా ఇస్తారు కదా! కాని కేశిధ్వజుడు శత్రువు దగ్గరకే వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

అతడు నాపట్ల శత్రుత్వం వహిస్తే వహించనీ, అతడు చెప్పినా చెప్పకపోయినా, నన్ను నిందించినా ఫరవాలేదని బయలుదేరాడు.

సమస్త రాజలాంఛనాలతో వెడితే అతణ్ణి బంధించడానికి వచ్చానని భావించవచ్చని ఒంటరిగానే వెళ్ళాడు. ఒంటరిగా వెడితే అతడు చంపినా యజ్ఞ ఫలమూ దక్కుతుందని, ఒకవేళ ప్రాయశ్చిత్తం చెబితే అంతకంటె కావలసిందేముందని బయలుదేరాడు.

మరణం సంభవించినా మేలే అని అతడు భావించడంలో అతని కర్మానుష్ఠానమెట్టిదో భావించవచ్చు. శత్రువు నుండి కూడా జ్ఞానాన్ని పొందాలనే వినయ భావాన్ని గుర్తించండి. మనకంటె తక్కువవాని దగ్గరకు వెళ్ళడానికి సాధారణంగా ఇష్టపడం. జ్ఞానం ఎవరినుండైనా గ్రహించాలని తిరువళ్లువర్ అంటాడు.

యజ్ఞ దీక్షలో ఉన్నాడు కదా! అవభృథ స్నానం వరకూ దీక్షను కొనసాగించవలసిందే. ఒంటికి దురద పెట్టినా కొమ్ములతోనే గోకుకోవాలి. క్షురకర్మ పనికి రాదు. అట్లా మాసిన గడ్డాలతో బయలుదేరాడు.

భరతుడు రాముని దగ్గరకు వచ్చినపుడు లక్ష్మణుడు కోపగించుకొన్నట్లు ఇతడు పరివారంతో వెళ్ళకపోయినా ఖాండిక్యుడు ఇతనిపై అగ్గిపై గుగ్గిలమయ్యాడు. చంపడానికి వచ్చాడని ఉగ్రుడయ్యాడు.

ఈ మాయ వేషంతో వచ్చావని, బాణాలతో చంపుతానని ధనుస్సునెత్తాడు ఖాండిక్యుడు. లేడి చర్మాన్ని ధరించి వచ్చినా నిన్ను చంపవచ్చని గర్జించాడు.

తొందర పడవద్దని, చంపడానికి రాలేదని ఒక ధర్మశాస్త్ర విషయం అడగడం కోసమే వచ్చానని విజ్ఞాన భిక్ష పెట్టమని అర్థించాడు. ఖాండిక్యుడు శాంతించాడు.

ఇదీ భారతీయ సంస్కృతి. మనలను ద్వేషించే వారినుండి కూడా జ్ఞానాన్ని పొందాలని మన ప్రాణానికి ముప్పు వచ్చినా జ్ఞాన సంపాదనకై సిద్ధపడాలని చెబుతోంది. ఈ సంస్కృతి జ్ఞానంపై ఆధారపడింది! అర్హులకు జ్ఞానదానం చేయాలని అనర్హులకు ప్రాణం పోయినా జ్ఞానాన్ని ప్రసాదించరాదని విధించాయి శాస్త్రాలు.

## గురు దక్షిణ

ఖాండిక్యుడు జ్ఞాన దానాన్ని చేయడాన్ని అతని మంత్రులంగీకరించలేదు. నీ రాజ్యాన్ని కబళించి ఒంటరిగా వచ్చిన రాజునెదుర్కొని నీ రాజ్యాన్ని తిరిగి పొందవలసిందిగా సలహాలిచ్చారు.

ఖాండిక్యుడు వారితో ఇట్లా అన్నాడు. మీ సలహాను పాటించి నేనతణ్ణి చంపితే ఇహలోక సౌఖ్యాన్ని మాత్రమే పొందగలను. కాని జ్ఞానం కోసం

వచ్చి తన ప్రాణాన్ని పోగొట్టుకొన్న కేశిధ్వజునకు పరలోక సౌఖ్యం లభిస్తుంది. జ్ఞానం తలుపులు మూసిన నాకు పరలోక సౌఖ్యం లభిస్తుందా అని మంత్రులతో అన్నాడు.

సందేహామేమిటనగా కేశిధ్వజుడు పూస గుచ్చినట్లు చెప్పాడు. ప్రాయశ్చిత్తవిధిని గ్రహించి కేశిధ్వజుడు తిరిగి వచ్చి యజ్ఞాన్ని పూర్తిచేసాడు. మంత్రధనలోపం లేకుండా యజ్ఞాన్ని పూర్తిచేసినా ఖాండిక్యునకు యజ్ఞ దక్షిణ నీయలేక పోయానని చింతించి, శత్రువైనా గురువుగానున్నాడు కనుక మరల ఖాండిక్యుని దగ్గరకు బయలుదేరాడు. ఇట్టి దక్షిణనీయడం మన సంప్రదాయం.

అతడింత ఈయాలని బయలుదేరలేదు. ఖాండిక్యుడు ఎంత అడిగినా, తుదకు రాజ్య మడిగినా ఈయడానికి నిశ్చయించుకొన్నాడు. ఇంతకుముందు ఒక దీక్షితునిగా వెళ్ళాడు. ఇప్పుడేమో పరివారంతో వెళ్ళాడు. ఇంతకుముందు సాత్త్విక వేషంతో వచ్చాడు, ఇప్పుడేమో నన్ను చంపడానికి సైన్యంతో వచ్చాడని ఖాండిక్యుడు అపోహ పడ్డాడు. ధనుర్బాణాలను సంధించాడు.

నేను నిన్ను చంపడానికి రాలేదు, గురు దక్షిణ నీయడానికి వచ్చానని వినయంతో కేశిధ్వజుడన్నాడు. ప్రేమ, భక్తి భావాలు తొణికిసలాడుతూ పల్కాడు.

ఖాండిక్యుడు మంత్రులను పిలిచి సలహా అడుగగా, నీ రాజ్యం నీవడుగుమని కొందరు, కేశధ్వజుని రాజ్యం కూడా అడుగుమని కొందరు సలహాలిచ్చారు.

ఖాండిక్యుడిట్లా ఆలోచించాడు. ప్రాణం పోతుందని శంకలేకుండా ప్రాయశ్చిత్తాన్ని తెలుసుకోవడానికి ఇంతకుముందు వచ్చాడు, ఇప్పుడేమో దక్షిణ నీయడానికి వచ్చాడు, ఏమి అధ్యాత్మ శాస్త్ర ప్రభావం? శాస్త్రాన్ని

ఆచరణలో పెట్టినవాడు కేశధ్వజుడని, అందువల్లనే నిర్లిప్తంగా రాజ్యమేలుతున్నాడని ఇట్టి రాజునుండి రాజ్యాన్ని కోరకుండా ఇట్లా విన్నవించాడు.

తిరిగి రాజ్యాన్ని ఎప్పుడైనా సంపాదించాలని ఇన్నాళ్ళూ అడవిలో గడిపాను. ఇప్పుడా ఆశలేదు., ఆత్మోపదేశాన్ని ప్రసాదించు. అదే నీవిచ్చే దక్షిణయని వివేక పూర్వకమైన మాటలు పల్కాడు.

నీ రాజ్యం నీవు తీసుకో, ఇదే తగిన సమయం, ఆలోచించని కేశిధ్వజుడన్నాడు.

నా రాజ్యం తీసుకొని నా బాధలనుండి విముక్తుణ్ణి చేసావు. క్షాత్రధర్మాన్ని అనుసరించి సంపద కోరాలని ఉన్నా నాకు విద్యాదానాన్నే ప్రసాదించమని వినయంతో అడిగాడు ఖాండిక్యుడు.

ఇట్టి పరమేశ్వరానుగ్రహాన్ని ఊహించగలమా? చిత్తశుద్ధికోసం ఖాండిక్యుడు చేసే కర్మానుష్ఠానం ఇపుడు సిద్ధించలేదా? ప్రాయశ్చిత్త విధిని తెలిసికోవడం కోసం, ప్రాణాన్ని తెగించి వెళ్ళిన కేశిధ్వజుని జ్ఞానమార్గం పరిపక్వం కాలేదా?

ఖాండిక్యుని పరిణత బుద్ధిని కేశిధ్వజుడు ప్రశంసించాడు. ఆత్మశాస్త్రం తెలుసుకొని ఆత్మసాధనకే జీవితాన్నంతా గడపవలసిన నేను స్వధర్మానుష్ఠానాన్ని కొనసాగిస్తున్నా. ఎందుకంటావా? నాలోని కామక్రోధాలు మొలకెత్తకుండా ఉండడానికే. ఈ కర్మానుష్ఠానం వల్ల గతజన్మ కర్మల పాపఫలం పోతుంది. అట్లాగే గత పుణ్యమూ బాధించదు. అపుడాత్మలో లీనం కాగలం. అందుకే శరీరాన్ని కష్టపెట్టైనా కర్మానుష్ఠానం చేస్తున్నా మానసికంగా రాజ్యభోగాలను త్యజించి పుణ్య ఫలాన్ని గెంటివేస్తున్నా. ఇట్లా కొంతకాలం గడపాలి. నేను నీకు వేదాంత జ్ఞానాన్ని కల్గిస్తానని శాస్త్రప్రకారంగా ఉపదేశించాడు.

కేశిధ్వజుడు, ఖాండిక్యుణ్ణి కులనందన అని సంబోధించినట్లు విష్ణుపురాణం చెబుతోంది. అనగా వంశానికి ఆనందం కలిగించేవాడని అర్థం.

ఇట్లా ఆత్మజ్ఞానం విషయంలో భారతదేశం గర్వకారణమైంది. శత్రువులే గురువులైనారు.

ఇంకా ఏమి కావాలని అడిగాడు కేశిధ్వజుడు. అనంతమైన ఆత్మ స్వరూపాన్ని నీ దయవల్ల చూడగలిగాను. ఇంతకంటే ఏమి కావాలని ఖాండిక్యుడన్నాడు. ఇట్లా ఇద్దరూ ముక్తులయ్యారు.

విష్ణుపురాణం ఇచ్చే సందేశమిది: ఆత్మానుభూతి కావాలంటే ఎవరి ధర్మాన్ని వారు నిరంతరం ఆచరించాలని, భక్తి శ్రద్ధలతో అనుష్ఠించాలని, జ్ఞానానికై ప్రాణాలనైనా అర్పించుటకు సిద్ధపడాలని, శత్రువు నుండైనా తత్త్వాన్ని తెలిసికోవాలని, అతడూ ప్రేమతో అందీయాలని చెప్పడం.

## గీత, బైబిల్, కురల్ సందేశం ఒక్కటే

గీతలో భగవానుడు పరమయోగి గురించి చెప్పాడు. యోగం అంటే ప్రాణాయామమని, ఏదో గుహలో కూర్చొని సాధన చేయడమని, ఆసనాలు వేయడమని, ఉపవాసాలతో కృశించడమని అనుకుంటారు. కాని అట్టి దానికి ప్రాధాన్యమీయలేదు గీత.

**ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున**

**సుఖం వా యది వా దుఃఖం సయోగీ పరమోమతః**

తనకు సుఖదుఃఖాలు వచ్చినపుడు తానెట్లా భావిస్తాడో అట్లా ఇతరులూ భావిస్తారని తనతో ఇతరులును భావించి నడవడమే పరమ యోగమని అన్నాడు.

ఆత్మోపమ్యేన అనేమాటను గుర్తించండి. తనతో పోలిక అనేమాట బైబిల్‌లో Do unto others as thow wilt be done ఉంది. అంటే ఇతరులు మనకేమి చేయాలని అనుకొంటున్నారో అట్టివాటినే ఇతరులకు చేయమని అర్థం.

మనమేమనుకొంటాం? మన బాధలను ఇతరులు పోగొట్టాలని భావిస్తాం. అది రోగమైనా, దరిద్రమైనా సరే! అట్టిది ఇతరులకు ప్రాప్తించినపుడు వారి బాధలను పోగొట్టడమే పరమార్థం. అదే ఆత్మోపమ్యం. ఇతరులను ప్రేమించకుండా మనలను, మనమే ప్రేమిస్తున్నపుడు వచ్చేవి చిక్కులు. తిరువళ్ళువర్ ఏమంటాడంటే అందరూ నావారే, అంతా నాదే ఎముకలు కూడా అని అంటాడు. దధీచి దేవతలకు వెన్నెముకనే దానం చేసి ఇతరులపట్ల ప్రేమ చూపించాడు కదా!

ఇట్లా సమభావం ఉంటే తనమాదిరిగా ఇతరులను భావించగలిగితే ఈ కొట్లాటలు, పోట్లాటలూ ఉంటాయా? ఇట్లా భావించేవాడు లోక సంగ్రహ నిమిత్తమై సత్కార్యాలు చేస్తాడు. అందుకై తనకోసం కాకపోయినా జ్ఞానులు మొత్తం సంఘ శ్రేయస్సుకై కర్మలను చేయాలని భగవానుడన్నాడు గీతలో.

ఇట్లా సమదృష్టితో చూసినపుడు సుఖ దుఃఖాలు సమంగానే కన్పిస్తాయి. సుఖదుఃఖాలతో సంబంధం లేని జ్ఞాని కూడా సంఘం సంతోషిస్తూ ఉంటే తానూ సంతోషపడతాడు. శరీరాన్ని త్యజించడానికీ సిద్ధపడతాడు.

## శ్రీ హర్షుడు - కంచి మఠం

**పుణ్యశ్లోకో నలోరాజా పుణ్యశ్లోకో యుధిష్ఠిరః**

**పుణ్యశ్లోకా చ వైదేహి పుణ్యశ్లోకో జనార్దనః**

ఈ శ్లోకాన్ని వినే ఉంటారు, లేచీ లేవగానే ప్రాతః స్మరణీయులకు నమస్కారం పెట్టడం మన సంప్రదాయం. మహాత్ములను స్మరించడం వల్ల

వారిలో నున్న సత్యం, ధర్మం, త్యాగం, సత్ప్రవర్తన మనలో సంప్రాప్తించాలనే భావనతో స్మరిస్తాం.

ఆ పుణ్యశ్లోకులలో నలుడు మొదటివాడు. తరువాత ధర్మరాజు, సీత, జనార్దనుని స్మరిస్తాం.

వీరందరూ జీవితంలో అనేక సమస్యల నెదుర్కొన్నారు. చివరకు అందరూ విజయాన్ని సాధించారు. అట్లాగే మనం వారిని లేచీ లేవగానే స్మరిస్తే మన బుద్ధి సత్క్రమ మార్గంలో పయనిస్తుంది.

నలుని కథ సుప్రసిద్ధం. నలోపాఖ్యానంగా భారతంలో ప్రసిద్ధి పొందిన కథను శ్రీహర్షుడు నైషధంగా వ్రాసాడు. ఇది విద్వాంసులకే ఔషధమనే మాట ప్రసిద్ధంగా ఉంది. నైషధం విద్వదౌషధం. ఇది సామాన్యులకు కొరుకుడు పడదు.

శ్రీహర్షుడు మహాకవి, మహావిద్వాంసుడవడానికి ఒక కథ లోకంలో ప్రచారంలో ఉంది.

ఇతని తండ్రి ఒక ఆస్థానంలో ఆస్థాన విద్వాంసుడు. మరొక ప్రాంతం నుండి ఒక విద్వాంసుడు వచ్చి ఇతణ్ణి ఓడించాడు. బాధతో ఇతడు మరణించాడు.

అపుడు శ్రీహర్షునికి చిన్నవయస్సు. తల్లి మామల్లదేవి. ఇతణ్ణి సాకింది. భర్త మరణాన్ని చూసి చలించిపోయి తన కొడుకును మహావిద్వాంసునిగా తీర్చిదిద్దాలని సంకల్పించింది. లోగడ ఆమె భర్త, ఈమెకు చింతామణి మంత్రాన్ని ఉపదేశించాడు. దీనిని సరిగా పఠిస్తే సరస్వతి యొక్క అనుగ్రహం తప్పనిసరి. పిల్లవానికి నూరిపోసింది. అయినా మంత్రం శీఘ్రంగా ఫలించాలంటే అది శవం మీద కూర్చొని పఠిస్తే వెంటనే ఫలిస్తుంది. అందుకే శ్మశానంలో పఠిస్తూ ఉంటారు. తాను శయ్యమీద పడుకొని తనమీద పిల్లవాణ్ణి

ఉంచి జపం గట్టిగా చేయమంది. తాను ప్రాణాన్ని విడిచింది. శవంపై పఠిస్తూనే ఉన్నాడు. మంత్రం సిద్ధించింది. ఈ కథ, క్రూరభావాన్ని ప్రేరేపిస్తున్నా తల్లి యొక్క త్యాగాన్ని గుర్తించండి.

పిల్లవానికై తల్లి ఎంతైనా త్యాగం చేస్తుందనడానికి మరొక ఉదాహరణ చెబుతా. తమిళనాడులో ఒక రాజు కళ్ళు ఎప్పుడూ ఎర్రగా ఉండేవి. దానికి కారణం అతని తల్లే. ప్రసవించే సమయంలో ఫలానా ముహూర్తంలో బిడ్డను కంటే గొప్పవాడవుతాడని ఒక జ్యోతిష్కుడు చెప్పాడు. తన కొడుకు చక్రవర్తి కావాలని తల్లి నొప్పులు భరించింది. తనను తలక్రిందులుగా పడుకోబెట్టండని, ముహూర్తం వచ్చే వరకూ కనకుండా తల్లి ఉండిపోయింది. అందువల్ల పిల్లవాని కళ్ళల్లో బాగా రక్తప్రసారం జరిగి ఎర్రని కళ్ళతో పుట్టాడు శిశువు.

సరే అసలు కథలోకి వద్దాం. కథలో దమయంతి స్వయంవరం వచ్చింది. దమయంతిని వివాహమాడాలని నలుడు వస్తూ ఉండగా ఇంద్రాది దేవతలు తమను వరించునట్లుగా దమయంతితో చెప్పవలసిందని వారడగడం మొదలైన కథ మీకు తెలిసిందే కదా! ఒక్కొక్క రాజునే పరిచయం చేసింది సరస్వతి.

ఇక్కడే చంద్రమౌళీశ్వర ప్రస్తావన వస్తుంది. ఎందరో రాజులు నానాదేశాలనుండి వచ్చారు. తమిళనాడునుండి కూడా ఒక రాజు వచ్చాడు. అతణ్ణిట్లా పరిచయం చేసింది సరస్వతి.

సింధోర్జైత్రమయం పవిత్రమసృజత్తత్కీర్తి పూర్తాద్భుతం
యత్రస్నాంతి జగంతి సంతి కవయః కేవా నవాచం యమాః
యద్బిందు శ్రియమిందు రంచతి జలంచావిశ్య దృశ్యేతరో
యస్యాఽ సౌ జలదేవతాస్ఫటిక భూర్జాగర్తి యోగేశ్వరః

(ఈ శ్లోకానికి విపులమైన వ్యాఖ్యను విద్వాంసులు వ్రాసారు. దానిని ముందు వివరిస్తాను - అనువాదకుడు)

తా: ఈ కాంచీ ప్రభువు సముద్రాన్ని జయించే కీర్తిగల తటాకాన్ని నిర్మించాడు. దానియందు మూడులోకాలూ జలకాలాడుచున్నాయి. చంద్రుడు ఈ నీటిలో ప్రవేశించి నీటితో సమానమైన కాంతిగల వాడగుటచే అదృశ్యుడై జలదేవతారూపమై స్ఫటికమునందు పుట్టిన యోగేశ్వరుడైన శివునిగా ఉన్నాడు. లేదా ఆ చంద్రుడు ఈ తటాకజలంలో ప్రవేశించి మన కన్నులకు కనబడని స్ఫటికభూమితో కూడిన కైలాసంలో యోగేశ్వరుడై అనగా స్ఫటిక శోభతో ఉండే శివలింగ రూపం కలవాడై జలదేవతగా ప్రకాశిస్తున్నాడు.

సముద్రము పర్వదినాలలోనే పవిత్రము. దానికంటె ఈ కీర్తి తటాకం అధికం. సముద్రం భూలోక వాసులకే అందుబాటులో ఉంటుంది. కాని ఇది ముల్లోకాలకు అందుబాటులో ఉంటుంది. సముద్రానికి చంద్రుడే సర్వస్వం. ఈ కీర్తి తటాకమునకు ఆ చంద్రుడు బిందు రూపంలో ఉంటాడు. సముద్రంలో విష్ణు రూపమైన జలదేవత నిద్రిస్తూ ఉంటుంది. ఈ కీర్తి తటాకంలో యోగేశ్వర రూపంలో శివుడు మేల్కొని యుంటాడు. ఈ విధంగా కీర్తి తటాకం సముద్రాన్ని మించింది. కనుక ఈ రాజును వరించు.

(స్వామివారు సులభశైలిలో దీని సారాంశాన్ని ఇలా అందించారు)

ఈ కంచి ప్రభువు సముద్రం వంటి పెద్ద సరస్సును నిర్మించాడు. ఇందలి నీరు పవిత్రం, స్వచ్ఛమైనది కూడా. కవులు దీనిని వర్ణించలేరు. ఇందలి ఒక నీటిచుక్క చంద్రుడైంది. యోగేశ్వరుడైన స్వామికి ఈ నీటితో అభిషేకం చేస్తే కనబడకుండా ఉంటాడు. నీరు మాదిరిగా స్ఫటికానికి రంగులేదు. కనుక ఈ స్ఫటికం నీటిలో మునిగినపుడు విడిగా నున్నట్లు కనబడదు. అట్లాగే స్ఫటికలింగంలోనున్న యోగేశ్వరునకు అభిషేకం చేస్తే ఆ లింగం మన కంటికి కనబడకుండా ఉంటుంది.

కంచీపురంలోని యోగేశ్వరుడైన స్ఫటిక లింగం ఏమిటి? మనమఠంలో ఉన్న చంద్రమౌళీశ్వరుడే. శంకరులు ఐదు లింగాలను ప్రతిష్ఠించారు కదా! బదరిలో ముక్తిలింగం, నేపాల్‌లో నీలకంఠక్షేత్రంలో వరలింగం, చిదంబరంలో మోక్షలింగం, శృంగేరిలో భోగలింగం, కంచిలో యోగలింగం.

శ్రీహర్షుడు కంచిమఠంలోని స్ఫటిక లింగంగా ఉన్న యోగేశ్వరుణ్ణే పేర్కొన్నాడు. ఈ మూర్తికి అభిషేకం చేసే నీరు ఈ ప్రభువు త్రవ్వించిన తటాకం నుండే గ్రహించేవారని పరోక్షంగా సూచిస్తున్నాడు కవి.

శ్లోకంలో చివరి పదం యోగేశ్వర అని ఉంది. తాటాకు ప్రతులు వ్రాసేవారు దీనిని యాగేశ్వరగా దిద్దేసారు. కాని కంచిలో యాగేశ్వరుడెన్నడూ లేడు. వ్యాఖ్యానకర్తయైన మల్లినాథ సూరి యోగేశ్వరుడనే పేర్కొన్నాడు. "స్ఫటికలింగం **యోగేశ్వర** ఇతి ప్రసిద్ధిః" అని మహామహోపాధ్యాయ శ్రీ గోపీనాథ కవిరాజుగారు కూడా యోగేశ్వర పాఠాన్నే గ్రహించారు. కనుక శ్రీహర్షుడు మఠంలోని యోగేశ్వరునే కీర్తించాడు.

శ్రీ హర్షుడు గొప్ప అద్వైతియే కాదు, మహాభక్తుడు కూడా. అతడు 800 సంవత్సరాలు వెనుకనున్నవాడు. ఇంత తటాకాన్ని చూసి నీరు అంతగాలేని గుజరాత్‌లో మార్వార్‌లో ఉండేవాడు కనుక ప్రశంసించాడు. చెఱువులును, నూతులను త్రవ్వడం మొదలైన వాటిని శాసనాలు వాపీ కూపప్రశస్తులుగా పేర్కొన్నాయి. ఉత్తర ప్రాంతానికి చెందిన కవి దక్షిణ ప్రాంతానికి చెందిన కంచిని మన మఠంలోని స్వామిని ప్రశంసించడం వల్ల మన మఠమెంత ప్రాచీనమైనదో గుర్తించండి. ఇక్కడున్న చంద్రమౌళీశ్వరుడు జగత్తునకంతటికీ చెందినవాడు. ప్రపంచాన్నే తన ఇంటిగా భావించిన శంకరులు ఐదు లింగాలను నలుమూలలా స్థాపించారు. ప్రపంచ సౌభాగ్యం కోసం చంద్రమౌళీశ్వరుడు పూజలందుకొనవలసిందే.

# గొప్ప చోళ చక్రవర్తి

మొదటి రాజరాజు సహస్ర సంవత్సర ఉత్సవంలో స్వామివారిచ్చిన సందేశం చోళరాజులలో ఇతడు పదవతరానికి చెందినవాడు. చోళులు 810 నుండి 1279 వరకూ సుమారు నాల్గు శతాబ్దాలు తంజావూరు రాజధానిగా పాలించారు.

మనమొక మహారాజును స్మరిస్తున్నాం. తానొక మహారాజునకు సేవకుడనని భావించే రాజితడు. నెత్తిపై రత్నాలంకృతమైన కిరీటం ధరించడం కంటె స్వామి వారి పాదుకలను ధరించడం గొప్పగా భావించే రాజితడు. ఇతడే ప్రసిద్ధమైన రాజరాజచోళుడు. తాను పరమేశ్వర కింకరుడనని మురిసిపోయేవాడు. శివపాద శేఖరునిగా ప్రసిద్ధుడు.

చిదంబరనటరాజు భక్తుడు. నాయనార్లు అనగా శివభక్తులు కీర్తించిన కీర్తనల సమాహారమైన తేవారాన్ని బహుళవ్యాప్తి లోనికి తెచ్చిన ఘనత ఇతనికి దక్కుతుంది. తంజావూరులోని బృహదీశ్వర ఆలయ నిర్మాత. ప్రపంచ ఔరసత్వాలలో (వాడుకలో వారసత్వం) ఇది ఒకటి. శిల్పకళా శోభితం. కళింగ ప్రాంతం వరకూ దండెత్తి కృష్ణా గోదావరి నదుల మధ్య ప్రాంతాన్ని ఏలే చాళుక్యుల నోడించాడు. లంకపై దండెత్తాడు. అనేక ద్వీపాలను జయించి రాజరాజ బిరుదాంకితుడయ్యాడు. అసలు పేరు అరున్మోళివర్మన్.

ఎంత జయించినా ఇదంతా ఈశ్వరానుగ్రహమే, అతనికింకరుణ్ణే అనే భక్తిభావంతో ఉండేవాడు. స్వామిపేరు బృహదీశ్వరుడు. అమ్మవారి పేరు బృహన్నాయకి. ఆలయం పేరు బృహదీశ్వరం. ప్రపంచంలోనే ఇది పెద్ద దేవాలయంగా నుతింపబడింది. రాతిశాసనంలో రాజరాజేశ్వరంగా ఉంటుంది. అమ్మవారి పేర్లలో ఒక పేరు రాజరాజేశ్వరి. అయ్యవారు రాజరాజేశ్వరుడే కదా! ఇందలి చాలా పెద్ద నంది ప్రసిద్ధమైంది. ప్రాకారంలోని

దేవతలే 8 నుండి 10 అడుగుల ఎత్తువరకూ ఉంటారు. ఇందలి ఈశ్వరలింగం ఎత్తైనది. దీనినే మహాలింగమని, స్వామిని మహాదేవుడని కీర్తిస్తారు. లింగంపై నున్న విమానం 200 అడుగుల ఎత్తులో ఉంటుంది. దానిని దక్షిణ మేరువని అంటారు. ఇక్కడ మేరువనగా కైలాసమే. అనగా ఇది దక్షిణ కైలాసం.

రాజురాజు అనేక విధాలుగా గొప్పవాడు. పరాక్రమం, భక్తి, మూర్తులపై విలువైన మాణిక్యాలను అలంకరించడం, దేవాలయ పోషణకై భూరి విరాళాల నీయడం మొదలైనవి ఎన్నో. ఈ వివరాలన్నీ శాసనాలలో కన్పిస్తాయి. గొప్ప పరిపాలనా దక్షుడు. రాజైనా నియంతగా కాకుండా ప్రజాస్వామ్య పద్ధతిలో పరిపాలన సాగించేవాడు. ఎన్నికల విధానాన్ని కనిపెట్టినవాడు. (ఇది ముందింకా వివరించారు) భూములను సర్వే చేయించే పద్ధతిని ప్రవేశపెట్టాడు. వాటి రిజిస్ట్రేషన్ పద్ధతికి ఆనాడే శ్రీకారం చుట్టాడు. వీధుల నేర్పరచుట, వాటి పేర్లు; ఇండ్లకు ప్రత్యేకమైన సంఖ్యలు మొదలైనవి ఎన్నో సంస్కరణలు చేసిన పరిపాలకుడు.

అంతకంటె గొప్పదేమంటే తమిళాన్ని, సంస్కృతాన్ని సమదృష్టితో ఆదరించాడు. ఈనాడు పనిగట్టుకొని సంస్కృతాన్ని అణగద్రొక్కడం కన్పిస్తోంది. (ముఖ్యంగా తమిళనాడులో). అతడు తమిళ గడ్డలో పుట్టినా సంస్కృతం యొక్క గొప్పదనాన్ని గుర్తించి భాషా ద్వేషంతో బ్రతకలేదు. శైవ సంబంధమైన, తమిళంలో ఉన్న తేవారం, తిరుమురైలకు బహుళ ప్రచారం తీసుకొని వచ్చాడు. శివాలయాలలో తమిళ శైవస్తుతులకై పండితులను నియమించాడు. అట్టివారు ఆనాడు ఏభైమంది యుండేవారట.

అట్లాగే వేదధర్మాన్ని, సంస్కృతాన్ని ప్రోత్సహించాడు. వైదిక పద్ధతిలోనే పూజావిధానం ఉండేది. (తమిళంలోనే పూజించాలని నేటి తమిళనాడులో ఉద్యమిస్తున్నారు) నర్మదనుండి బాణ లింగాలను తెప్పించాడు. 64 మందితో

వెళ్ళి ఆ పెద్ద శివలింగాన్ని తీసుకొని వచ్చాడు. అతని మొదటి శాసనం సంస్కృతంలోనే ఉంది.

"ఏతత్ విశ్వ స్వరూప శ్రేణి మౌళి..."

పాశ్చాత్యులు ప్రవేశపెట్టిన ఆర్యద్రావిడ భేదానికి ఆనాడు తావు లేదు.

అతని పాలనలో వేద పఠనమూ ఉంది, తమిళంలోని తేవారాలను పఠించేవారు, ఆలయాలలో సంగీత నృత్యాలు విలసిల్లాయి. ఇట్లా సంస్కృతులు సమ్మేళనం సాగింది. అందరినీ కలుపుకొని పోవడం వల్లనే అట్టి మహత్తర కార్యక్రమాలు నిర్వహించాడు.

అతడు పుట్టి వేయి సంవత్సరాలైంది. సహస్ర జయంతి ఉత్సవాలను జరుపుకొంటున్నాం. అతడే విధంగా జాతీయ సమైక్యాన్ని తీసికొని వచ్చాడో గుర్తించండి.

అతని బాటలో నడిచి, ఈశ్వర భక్తులమై భాషాద్వేషాలకు మంగలం పాడుదాం.

## యజ్ఞంలో అహింసయే

*(వెబ్‌సైట్‌లో సమాచారం ఆధారంగా ఈ అనువాదం)*

1957లో స్వామివారు మద్రాసులోని మైలాపూర్ సంస్కృత కళాశాలలలో కొంతకాలం ఉండగా అడయార్‌లో దివ్యజ్ఞాన సమాజంవారి ఆధ్వర్యవంలో శాకాహారుల సమ్మేళనం జరిగింది. దేశవిదేశాలనుండి ప్రతినిధులు వచ్చారు. ఎక్కడైనా ఏ రీతిలోనైనా జంతువుల్ని చంపడం నేరమనే తీర్మానం చేసారు. అహింసను ప్రోత్సహించాలని ఎలుగెత్తి చాటారు.

సమావేశాలు పూర్తియైన తరువాత పై సమాజం యొక్క అధ్యక్షులు, శ్రీ శంకరమీనన్ గారు వీరి నందరిని స్వామివారి దగ్గరకు తీసికొని వచ్చారు.

అందర్నీ స్వామికి పరిచయం చేసారు. స్వామిని మిగతావారికి పరిచయం చేయబోతే నాగురించి తెలిసింది చాలని వారించారు.

యజ్ఞంలో జరిగే జంతుబలిని సమర్థిస్తారా అని స్వామిని అడిగారు.

చేయవచ్చు, తప్పేమీ లేదని స్వామి అన్నారు. వెంటనే అందరూ పకపకా నవ్వారు. ఈ పద్ధతి స్వామిని అవమానించినట్లేయని బాధపడ్డారు, శంకరమీనన్‌గారు.

వారిగురించి కోపపడవద్దు. ఒక నిర్ణయానికి వచ్చి నా మాటలను విని విరుద్ధంగా ఉన్నట్లు భావించి నవ్వి యుంటారని స్వామివారన్నారు. మీనన్‌ని సముదాయించారు.

సమాధానం ఇట్లా సాగింది : ఒక రౌడీ ఒకణ్ణి చంపితే న్యాయాధీశుడు విచారించి అతనికి ఉరిశిక్ష వేస్తాడు కదా! రౌడీ, క్షణికావేశంలో చంపి యుంటాడని కనికరించాడా? శిక్ష వేసినందులకు న్యాయాధీశుణ్ణి తప్పు పడుతున్నామా?

నాల్గు రహదారుల నడుమలో రోగుల్ని వెంటనే తీసుకొని వెళ్ళే వాహనం (Ambulance) వస్తే మిగిలిన వాహనాలను ప్రక్కనబెట్టి ముందు దానికి దారి యిస్తారు కదా! ఇక మంటలనార్పే వాహనం వస్తే ముందు దీనికే ప్రాధాన్యం ఇస్తారు. ఇక సైనిక వాహనం వస్తే పైరెంటిని ప్రక్కనబెట్టి దీనికే ప్రాధాన్యం ఇస్తారు. అంటే మామూలు మనుష్యుల కంటె ఒక రోగికి; రోగి కంటే గ్రామరక్షణకు, గ్రామరక్షణకంటె దేశరక్షణకు ప్రాధాన్యం ఈయడం జరిగింది కదా! అంటే ఒక విశేష ప్రయోజనం కోసం కొన్నింటిని త్యాగం చేస్తున్నారు.

ఒక రాజు దేశరక్షణకై యుద్ధంలో అనేకుల్ని చంపుతాడు. ఒక మనిషిని చంపితేనే మరణశిక్ష విధిస్తున్నారు కదా! మరి రాజునకు శిక్ష విధిస్తున్నారా?

ఇట్టి సందర్భాలలో జీవహింసను సమర్థిస్తారు కదా! అట్లాగే లోక హితం కోసం కొన్ని జంతువులను యజ్ఞంలో చంపినా తప్పు లేదంటోంది శాస్త్రం.

వేదాలు అనాది. అది పరమేశ్వరుని నిశ్శ్వాసాల వంటివి. కనుక వేదాలూ, భగవానుడూ అనాదులే. వేదశాస్త్రాలు జనుల సుఖానికై ఉద్దేశింపబడ్డాయి. గీతలో భగవానుని సందేశం ప్రసిద్ధం. ఏమన్నాడు? మనం యజ్ఞాలు చేసి దేవతలను తృప్తి పరిస్తే వారు వర్షాన్ని కురిపిస్తారని ఉంది.

**దేవాన్ భావయ తానేన తే దేవా భావయంతు వః**

**పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ**

ఆ యజ్ఞాలను కొందరే చేయాలని కూడా వేదం విధించింది. భాగవతంలో ప్రాచీన బర్హిస్ అనే రాజు నిరంతరం యజ్ఞాలు చేస్తూ ఉండేవాడు. కొంతకాలానికి తత్త్వ జ్ఞానం ఒంటబట్టింది. మానసికంగా సన్న్యాస స్థితిలో ఉన్నా వాటిని చేయడం మొదలుపెట్టాడు. అతనికి జ్ఞానోపదేశం చేయడం కోసం నారదుడు వచ్చి మాయతో కూడిన ఒక దృశ్యాన్ని చూపాడు. ఆకాశం వంక చూడమని అనగా కొన్నివేల పశువులు తమ కొమ్ములతో ఇతణ్ణి పొడవడానికి సిద్ధంగా ఉన్నట్లు కనబడింది. ఈ దృశ్యాన్ని చూసి అన్నీ విడిచి పెట్టినవానికి ఈ యజ్ఞాలలో పశుహింస చేయడమేమిటని జ్ఞానం కలిగింది.

మరొక మాట చెబుతా. తమిళనాడులో తాయుమన్నవార్ అనే తపస్వి ఉండేవాడు. ప్రతిరోజు ఉద్యానవనానికి వెళ్ళి గంపెడు పూలు కోసి రోజూ పరమేశ్వరుణ్ణి అర్చిస్తూ ఉండేవాడు. ఒకనాడు నేలపై వేలకొద్దీ పూలు రాలిపడి యుండడాన్ని చూసి మనస్సు ద్రవించింది. అన్నీ బ్రహ్మ స్వరూపంగా కనబడ్డాయి. పరమేశ్వర స్వరూపాన్ని పెకలించి పరమేశ్వరుని పాదాబ్జాలపై అర్చించడమా అని తర్కించాడు. హే భగవాన్! నీకు పూర్తి పూజ చేయను. నీవు పువ్వులలో సాక్షాత్కరిస్తున్నావు. కనుక వీటిని గిల్లి నీకర్పించను.

అప్పటినుండి స్వామికి సాష్టాంగం చేయడం మానుకున్నాడు. ఒకవైపున నీవున్నావని నీకు సాష్టాంగ నమస్కారాలు చేస్తూ ఉంటే మరొకవైపున నీవు లేవా? నేను చేసింది సగం సగం నమస్కారం అవుతుంది కదా! ఒకవైపునకే చేస్తే మరొకవైపున ఉన్న మూర్తికి కాళ్ళను చూపించినట్లౌతుంది కదా!

కనుక ఏది హింస, ఏది అహింస అని వేదమే చెప్పాలి గాని మనం కాదు.

మొక్కలలో ప్రాణం ఉంటుందని మన మాదిరిగా సుఖదుఃఖాలనుభవిస్తాయని ఋజువు చేసారు కదా! ఎన్నో విత్తనాలకది కారణం అవుతోంది కదా! కనుక విత్తనాలను ఇచ్చే పండ్లను తినడమూ పాపమే కదా! అందుకే సన్యాసులు కాయకూరలను తినరు. వారు వాతాంబు పర్ణాశనులు. అనగా గాలిని, నీటిని, రాలిన ఆకుల్ని మాత్రమే తింటారు.

అట్టి నియమం వారికే చెల్లింది. గృహస్థులందరికీ కాదు. ఏవి తినాలో ఏవి తినకూడదో శాస్త్రాలు నిర్దేశించాయి. లోకహితం కోసం కొన్ని జంతువులను బలి ఇచ్చే యజ్ఞాలను గృహస్థులు చేయాలనీ వేదాలు చెప్పాయి. అందలి హింస, హింస కాదనీ ఘోషించాయి. అట్టి నియమాలను ఉల్లంఘిస్తే ఎలా?

ఇంతలో లండన్ నుండి వచ్చిన ప్రతినిధి తాను సత్యానికి అంతం లేదనే పుస్తకాన్ని (No End to the Truth) వ్రాసానని అన్నాడు. అయితే పుస్తకాన్ని ఎట్లా ముగించారని స్వామి ప్రశ్నించారు. అతడు తటపటాయించి మీరు చెప్పిన అంతం లేనిదనే మాటయే అంతమని అన్నాడు. అందరూ నవ్వుకున్నారు.

# కవులు - కావ్యాలు

## కవుల ఆత్మగౌరవం

రాజులు తమ రాజ్యాలలోనే గౌరవింప బడతారు, కాని విద్వాంసుడెక్కడికి వెళ్ళినా గౌరవింపబడతాడనే సూక్తి ప్రసిద్ధం. సంస్కృత శ్లోకమూ ఉంది.

ఈ మాటను అవ్వై అనే కవయిత్రి పల్కింది. ఆమెకా గౌరవమూ లభించింది. చేర, చోళ, పాండ్యరాజులు ఆమె మాటలను చెవులనొగ్గి ఆలకించారు, పూజించారు.

పారివల్లాల్ అనే ఉదారవ్యక్తి కవులను పోషించేవాడు. పెళ్ళికాని ఇద్దరు కూతుండ్రను విడిచి కాలం చేసాడు. ఈ కష్టకాలంలో ఈమె వారి నాదుకొని పెళ్ళిళ్లు చేసింది. వివాహ ఆహ్వాన పత్రికలను ముగ్గురు రాజులకూ పంపింది. ఈమె పంపడం వల్ల వారిలో పరస్పరం స్పర్ధలున్నా వివాహాలకు హాజరయ్యారు. ఆహా! మీరందరూ కలిసారు. ఇది ఎట్లా ఉందంటే యజ్ఞంలో గార్హపత్యం, ఆహనీయం, దక్షిణాగ్నులున్నట్లు ప్రకాశిస్తున్నారని కొనియాడింది. ఈ సంగం కాలానికి చెందిన పురునానూరులో ఈ పంక్తులున్నాయి.

వృద్ధ వయస్సులో కూడా ఈమెను రాజులు గౌరవించారంటే ఆమెకున్న జ్ఞాన సంపదయే కారణం.

రాజులకంటే విద్వాంసులను, కవులను ప్రజలు గౌరవించిన కాలమిది.

అయితే ప్రతిరాజును వారి తృప్తికోసం కీర్తించేవారు కాదు. ఆత్మగౌరవాన్ని రాజులముందు తాకట్టు పెట్టలేదు. అందుకే పై మాట అంది.

## గొప్ప కవులు - అందు భేదం

ఒక జ్ఞానిగాని, ఒక భక్తుడు కాని గౌరవాగౌరవాలను పట్టించుకోడు. కాని కవులా తరగతికి చెందిన వారు కాదు. సామాన్యులకంటె వారు మాన్యులు. ప్రపంచాన్ని త్యజించినవారు జ్ఞానులు, భక్తులూ. కాని ప్రపంచంలోనే ఉంటూ తమ కవితా వైభవాన్ని ప్రకటిస్తూ ప్రజల మన్ననలను పొందేవారు, ఆశించేవారు కళాకారులు.

జ్ఞానులలో, భక్తులలో మణిపూసలవంటి మహానుభావుల్ని కన్నది మన దేశమాత. వేదర్షులనుండి వాల్మీకి వ్యాసాదుల వరకు, అట్లే నాయనార్లు, ఆళ్వార్లు, వేదాంత దేశికులు, జ్ఞానదేవ్, తులసిదాసు, పురందర దాసు పోతన మొదలైన వారందరో మహాకవులైనా అందరూ జ్ఞానులే. నానృషిఃకురుతేకావ్యం అనే మాట ఉంది కదా! అనగా ఋషి కానివాడు కవి కాలేడని అర్థం. కవియనే పదానికి ఋషియని చెప్పింది వేదమంత్రం. అతని క్రాంత దర్శియని చెప్పింది. అనగా అన్ని సత్యాలను తెలిసినవాడు. (అనగా పారమార్థిక సత్యం, వ్యావహారిక సత్యం, ప్రాతిభాసిక సత్యం)

పైవారు మహాత్ములైనా మహాకవులే. నేను చెప్పబోయేది అట్టి జ్ఞానులైన కవుల గురించి కాదు, కావ్యాలు వ్రాయడమే వృత్తిగా పెట్టుకొన్నవారిని గురించి మాత్రమే.

ఆనాటి రాజులు మహాకవులను పోషించేవారు. కవులా రాజులను స్తుతించేవారు. అక్షరలక్షలను పొందేవారు కూడా. ఇక కొందరు తమ ఆత్మగౌరవానికి భంగం కలిగినప్పుడు రాజులను తృణప్రాయంగా చూసినవారూ ఉన్నారు. ఎంతగా గౌరవించారో, గౌరవానికి భంగం వస్తే అంతగానూ ఉత్తరక్షణంలో విడిచి పెట్టేవారు కూడా. ఇట్టి వారిలో కాళిదాసు, కంబడు వంటి వారిని పేర్కొంటాను.

## రాజ్యాలను విడిచిన కవులు

రాజు తన పొరపాటును గుర్తించి మరల తన ఆస్థానానికి రావలసిందిగా అర్థించినా తిరస్కరించేవారు. సర్ఫోజీ అనే రాజు పంపిన కాన్కలను త్యాగరాజస్వామి తిరస్కరించలేదా? నిధి చాల సుఖమా? రాముని పెన్నిధి చాల సుఖమా అని కీర్తించలేదా? కొందరు, రాజులను కీర్తించం, రాజాధిరాజైన పరమేశ్వరునే కీర్తిస్తాం అని చాటినవారున్నారు. ఒక మానవమాత్రుణ్ణి నా నోటితో కీర్తించడమా అని నమ్మాళ్వార్ అన్నాడు.

సుందరమూర్తి స్వామి, కవులనుద్దేశించి ఆ నరుణ్ణి స్తుతిస్తావేమిటి? శివుణ్ణి నోరార కీర్తించమని హితవు పల్కాడు. తేవారంలో ఒక పదికం, పదికం అంతా అట్లాగే ఆదేశించాడు. సంపదనిచ్చే పారివల్లాల్ (గొప్ప ఉపకారం చేసేవాడు) అంటూ మామూలు నరులను నుతిస్తావేమిటని ప్రశ్నించాడు.

శైవాన్ని వ్యాప్తి చేసే అప్పర్ స్వామి గురించి విని జైన మతావలంబకుడైన మహేంద్రపల్లవుడు కోపోద్రిక్తుడై పిలిపించగా నేనెవరికీ దాసుణ్ణి కాను అని తెగేసి రాజు సమక్షంలోనే అన్నాడు.

కొందరు భక్తులైనా, జ్ఞానులైనా కొన్ని సందర్భాలలో ఆస్థాన విద్వాంసుల మాదిరిగా ఉండడానికి ఇష్టపడేవారు కారు. తిరుమల నాయకుని ముఖ్యమంత్రిగా పనిచేసిన నీలకంఠ దీక్షితులను ఒక సందర్భంలో రాజు అవమానించి తొలగించాడు. తరువాత తన తప్పును తెలిసికొని పదవిలో ఉండవలసిందిగా అర్థించాడు. ఈ రాచకొలువు చాలు, అయిందేదో అయింది అంటూ ఒక గ్రామం చేరి అక్కడ వైదిక అనుష్ఠానాన్ని కొనసాగించాడు. తన వంశంలో పుట్టినవారెన్నడూ రాచకొలువును చేయవద్దని శాసించాడు. చివరకు సన్న్యాసం పుచ్చుకొన్నాడు.

వేదాంత దేశికుల గురించి ఒక కథ చెబుతారు. విజయనగర సామ్రాజ్యాన్ని

స్థాపించిన విద్యారణ్యుల సహపాఠి ఇతడు. హరిహర బుక్కరాయలిద్దరూ విద్యారణ్యుల శిష్యులే. వారు పరిపాలించిన విద్యానగరమే తరువాత విజయనగరమైంది. విద్యారణ్యులు గొప్ప అద్వైతి. శంకరమఠ సన్యాసి. దేశికులు విశిష్టాద్వైతులు. సిద్ధాంతాలు భిన్నమైనా వేదాంత దేశికుల పాండితీ వైభవాన్ని గుర్తించినవారు విద్యారణ్యులు. రాజాస్థానాన్ని అలంకరించవలసిందిగా విద్యారణ్యులు కబురు పంపారు. నాకా రాజాస్థాన పదవి ఎందుకని ఐదు శ్లోకాలు వ్రాసి పంపారు వేదాంత దేశికులు. అదే వైరాగ్య పంచకం.

మహాత్ములు అట్టి గౌరవాలను తిరస్కరించడంలో ఎట్టి ఆశ్చర్యమూ లేదు. సంసారంలో ఉన్న కవులు తమ ఆత్మ గౌరవానికి భంగం వచ్చినపుడు తిరస్కరించడంలోనే విశేషం.

కాళిదాసు, కంబడు జీవితాలలో ఇట్లా జరిగింది. పాలకుండలో ఒక్క ఉప్పుగల్లు వేస్తే మొత్తం పాలంతా విరిగిపోయినట్లు ఇంతవరకూ క్షీర నీరన్యాయంగా రాజు కవులుండగా వికటించిన ఘట్టాలున్నాయి.

## కంబర్ - కులోత్తుంగుడు

కంబ మహాకవి కాలం గురించి అనేకాభిప్రాయాలున్నాయి. 10 నుండి 12వ శతాబ్దం మధ్యలో ఎప్పుడో కంబడున్నట్లు చరిత్రకారులూహించారు. ఆనాటి రాజు పేరు విక్రమ చోళుడా, కులోత్తుంగుడా, కులోత్తుంగ చోళుడా అనే సందేహాలను ప్రక్కన పెడదాం. కథను కథగానే చూద్దాం. అట్టిదే భోజుడు - విక్రమాదిత్యుడు - కాళిదాసుల కాలాల గురించి అభిప్రాయ భేదాలున్నాయి.

భోజ కాళిదాసులెంత అన్యోన్యంగా ఉండేవారో కంబడు – కులోత్తుంగుడూ కూడా అంతే సఖ్యంగా ఉండేవారు. కంబడు రాజుతో చాలా చనువుగా ఉండేవాడు.

ఒకనాడు సామ్రాజ్యం అంతా నా చెప్పుచేతలలో ఉందని రాజు బీరాలు పల్కాడు. అంతరాజ్యం నీ చేతిలో ఉన్నా నువ్వు నా చేతిలో ఉన్నావని కంబదన్నాడు. ఇదేమీ అహంకరించి కాదు, ప్రేమతోనే అన్నాడు.

ఈశ్వరుణ్ణి భక్తపరాధీనుడంటాం. అది అతనికి గౌరవాన్ని కల్పించేదే. అట్లే అంత రాజు కూడా ఒక చేతిలో ఉన్నాడంటే రాజును సన్మానించినట్లే. అతని కళా పోషణను ప్రశంసించినట్లే.

అయినా అధికారమదం ఒక్కొక్కప్పుడు ఈ సూక్ష్మాంశాన్ని గ్రహించలేదు. ఇదేమిటి? ఒక కవిమాత్రుడు రాజును ధిక్కరించడమా అంటూ కళ్ళెర్రజేసాడు.

ఒక్కొక్కప్పుడు మిక్కిలి ప్రేమయే మిక్కిలి ద్వేషానికి దారి తీస్తుంది.

ఎవరైనా మనకు పరిచయం లేనివారు మనకిష్టం కాని పనిని చేసినపుడు మన మనసును అర్థం చేసుకోలేకపోయారని, వారితో ఎందుకులే అని మనంతట మనమే సర్ది చెప్పుకొంటాం. కాని పరిచయం ఉన్న వ్యక్తి మనకిష్టం కాని పనిచేస్తే వెంటనే కోపపడతాం. ఇంతకాలం పరిచయం ఉన్నా ఇట్లా అపార్థం చేసుకొన్నాడేమిటని తీవ్రంగానే కోపపడతాం.

ఇట్లా కంబదు తనను గౌరవించలేదని రాజనుకున్నాడు. తన మనస్సును సరిగా అర్థం చేసుకోలేదని కంబదు భావించాడు.

భోజుడు కాళిదాసును పొమ్మనమన్నట్లుగా రాజు కంబణ్ణి రాజ్యం విడిచి పొమ్మన్నాడు. భోజుడెందుకు పొమ్మన్నాడు? భోజుడు, తన మరణానంతరం కాళిదాసు ఏ శ్లోకం వ్రాస్తాడో తెలిసి కోవాలని కుతూహలపడ్డాడు. అట్లా వ్రాయడానికి కాళిదాసు అంగీకరించలేదు.

రాజు పొమ్మంటే మరొక వ్యక్తి ఐతే కాళ్ళావేళ్ళా పడి క్షమించండని రాజును ప్రార్థిస్తాడు. పదవులు పోతాయని సామాన్య జనులు బాధపడతారు.

కాని కంబదొక శ్లోకం చదివాడు. తమిళం చదివింది, కవిత నల్లింది నీ

కోసమా? నీవాదరించకపోతే మిగిలిన రాజులు గొడ్డుపోయారా? నన్ను ఆస్థానకవిగా రండి రండని ఆహ్వానించేవారు లేరనుకొన్నావా? కవులకు రాజ్యం లేదనుకొంటున్నావు కదూ! నీవు భయపడే చేరరాజునే అడప్పైకరన్ (పోకచెక్క భరణిని మోసేవాడు)గా తీసికొని వస్తాను చూడు అని సవాలు విసిరాడు. (తెలుగులో అడపపు కత్తె తెలియనగా తాంబూల సామాగ్రి యుండే భరిణిని మోసేది) అడక్కై అంటే తమిళంలో పోకచెక్క భరిణిని అడప్పం అంటారు (తెలుగులో అడపం).

భోజ కాళిదాసుల కథలో కాళిదాసు భోజుణ్ణి నిందించకుండా ఆస్థానం విడిచి వెళ్ళిపోయాడు. లోకులితనిని చులకనగా చూడరాదని, నిందించకుండా కాళిదాసు వెళ్ళిపోయాడు. కాని కంబడట్లా కాదు. ఎందుకీ తేడా?

ఇద్దరూ చేసింది సబబే. భోజుడు తాను మరణిస్తే ఏ శ్లోకం వ్రాస్తాడో వినాలని, తన మరణవార్త వినడం అమంగళమైనా కాళిదాసు కవిత యొక్క సొగసును ఆస్వాదించడానికే అట్లా అన్నాడు. అటువంటి సరసుడైన రాజును విడిచి మరొక రాజు దగ్గరకు కాళిదాసు వెళ్ళగలడా? కాళిదాసు భోజుడు మరణించినట్లు ఎందుకు వ్రాయలేదని శంక. అది అమంగళమే కాదు.

ఉత్తర రామచరిత నాటకంలో భవభూతి ఒక అద్భుత సత్యాన్ని అందించాడు. సామాన్య జనులు జరిగిన వాటిని గురించి చెబుతారు. కాని మహాత్ములేమి పలుకుతారో అది జరిగి తీరుతుందని **వాచ మర్థోనుధావతి** అన్నాడు. అంటే అర్థాన్ని, విషయాన్ని చూసి మనం శబ్దం పల్కుతాం. మహాత్ములు శబ్దం పలకడం వల్ల అర్థం సిద్ధిస్తుందని, వసిష్ఠుని గూర్చి రాముడట్లా అంటాడు.

ఋషి, కవి యొక్కరే కనుక బ్రతికియుండగానే భోజుడు చనిపోయాడని శ్లోకం చెబితే ఇతడు పల్కిన వెంటనే భోజుడు మరణిస్తే ఆ బాధను కాళిదాసు తట్టుకోగలడా? అందుకని కూడా కాళిదాసు శ్లోకం చెప్పలేదు. తన

మాటవల్లనే చనిపోయాడని కుమిలిపోయి యుండేవాడు కదా! మిగిలిన కవులు రాజుతో ఎందుకులే పేచీ యని చెప్పి యుండేవారు. కాని కాళిదాసు అమ్మవారి అనుగ్రహాన్ని పొందినవాడు కదా! ఒక తల్లి, పిల్లవాడు బ్రతికి యుండగా అతని మీద వ్రాసిన స్మారక పద్యాన్ని విని సహించగలదా?

కాని భోజుడు తాను రాజవడంచే తన ఆజ్ఞను ఇతరుల్లంఘిస్తే సహించలేకపోయాడు. కాళిదాసును ఆస్థానంనుంచి పొమ్మన్నాడు. అయితే కాళిదాసు ఇతర ఆస్థానాలలో ప్రవేశించలేదు. తాను చరమశ్లోకం చెబితే, రాజు మరణిస్తే మిగతా కవులకు ఆశ్రయమేది? రాజు మరణిస్తే సంఘానికి చేటు కదా! తాను శ్లోకం వ్రాసి లక్షలు గడించాలని కాళిదాసు భావించలేదు. ఇట్టి త్యాగబుద్ధితో, ఇతర కవుల పట్ల ప్రేమతో, వివేకంతో ఆ స్థానాన్ని విడిచి పెట్టాడు.

అట్లా ధారా నగరాన్ని విడిచాడు. దానిని నేడు ధార్ అని అంటారు. మధ్యప్రదేశ్‌లో ఉంది ఉజ్జయినికి సమీపంలో. అదే విక్రమాదిత్యుని రాజధాని. అతని కాలం కవులకు స్వర్ణయుగం.

మరొక రాజు దగ్గరకు వెళ్ళకుండా మారువేషంలో తిరుగుతూ ఉండేవాడు. మరల రాజును కలుసుకోలేక పోతానా అనే ఆశతో తిరిగేవాడు. సన్యాసి వేషం ధరించాడు.

ధార, ఉజ్జయినుల గురించి చెప్పా. మాలవ రాజ్యానికి రాజధాని ధార. భోజుడు పరిపాలించేది ఉజ్జయిని. ప్రక్క రాజ్యంలో వస్తుంది. అవంతి రాజ్యానికి చెందినది మాలవ. అవంతి, విదర్భకు ఉత్తరాన ఉండేవి. ఆ విదర్భ రాజ్యం కృష్ణా గోదావరి నదుల మధ్య ప్రాంతం. కొందరు ఉజ్జయినినే అవంతియనే వారని చరిత్రకారులంటారు. విక్రమాదిత్యుడు అక్కడినుండే పరిపాలించాడనీ అతడే కాళిదాసును పోషించాడని అంటారు. భోజ ప్రబంధాన్ని పల్లాలన్ అనేవాడు వ్రాసాడని, అందు చారిత్రక విశేషాలు

లేవని అంటారు. ఇక విక్రమాదిత్యుని గురించి అభిప్రాయ భేదాలున్నాయి. అతడు ఉజ్జయినిని ఏలిన చంద్రగుప్తుడా? శకులను నిర్మూలించి విక్రమ శకాన్ని స్థాపించినవాడా? లేక గుప్తుల కాలంలోని రెండవ చంద్ర గుప్తుడా అని సందేహం. ఇతడే పాటలీ పుత్రం ఏలాడని అంటారు.

ఇట్లా కవుల, రాజుల కాలం గురించి అనేక అభిప్రాయ భేదాలున్నాయి. అట్లాగే తమిళ సాహిత్యం గురించి కూడా. తిరువళ్ళువర్, అవ్వైయార్ సమకాలికులని ఒకరు; అవ్వైయార్, కంబర్ సమకాలికులని, అట్లాగే ఒట్టకొత్తర్; పుగళేందులు సమకాలికులని రకరకాల అభిప్రాయాలున్నాయి.

కాలమేదైతేనేమి? కథలలో ఎన్నో మార్పులు, చేర్పులు లోకులు చేర్చి యుంటారు. విషయం ప్రధానం. అది అందించే సందేశం ప్రధానం.

మరల కంబని కథలోకి వద్దాం. చేర రాజ్యంలోకి ప్రవేశించాడు కంబడు. రాజు యొక్క మన్ననలను పొందాడు. ఇతణ్ణి తరిమివేసిన చోళరాజు పశ్చాత్తాపపడ్డాడు. కంబనికై పలవరించాడు. ఎంత ఉదాత్త వ్యక్తియైనా, సరసుడైనా ఒక క్షణికావేశం అట్లా మారుస్తుంది.

అన్ని ప్రాంతాలకు దూతలను పంపాడు. కంబడు చేరరాజ్యంలో ఉన్నట్లు తెలుసుకొన్నాడు. తాను చేసింది తప్పేయని క్షమించమని ఉత్తరం వ్రాసి పంపాడు. కంబని మనస్సు కదిలింది. చేర రాజ్యానికి వీడ్కోలు పల్కబోయాడు.

చేరరాజు, కంబడే కారణం వల్ల తన రాజ్యానికి వచ్చాడో గుర్తు పెట్టుకున్నాడు. అడైప్పైకరన్‌గా నన్ను తీసికొని వెడతానని చెప్పావు, గుర్తుందా అని కంబణ్ణి అడిగాడు. నేను పోకచక్కల భరణిని తీసుకొని వస్తానన్నాడు.

ఈ చేరరాజు గొప్పదనాన్ని గుర్తించారా? శత్రురాజు దగ్గరకు తానొక సేవకునిగా వెడతానన్నాడు. రాజుల అహంకారాన్ని విన్నాం. కవులకు సేవచేసిన రాజుల గురించి వినండి. ఈ కథలిచ్చే సందేశాలను గుర్తించండి.

దీనికేమి? మారాజు ఏదో కోప్పడినపుడేదో అన్నానులే, పట్టించుకోవద్దని కంబడు రాజుతో అన్నాడు. నాపట్ల ప్రేమను చూపించినపుడు పాత ప్రతిజ్ఞలను పట్టుకొని వేళ్ళాడటం బాగుంటుందా, రాజైన నీకు ఆ పనిని అప్పజెప్పడం సబబుగా ఉండదని, ఆ ప్రయత్నం మానుకొమ్మని సర్దిచెప్పాడు కంబడు.

కథ అంతటితో ఆగిందా? చేరరాజు వినయాన్ని చూడండి.

కులోత్తుంగుడు కంబనిని సాదరంగా ఆహ్వానం పలికాడు. కొంతకాలం పోయిన తరువాత చేరరాజును రప్పిస్తానన్నావు కదా అని పాత కథను త్రవ్వాడు. కంబడీ వార్తను చేరరాజునకు చేరవేయక తప్పలేదు. ఎట్లా చేరరాజు వెళ్ళాడు?

ఒకనాడు మారువేషంలో చేరరాజు వచ్చాడు. కంబడు, కులోత్తుంగుడు సరససల్లాపాలాడుతున్నారు. చేరరాజును చూసీ చూడకుండా ఉన్నాడు కంబడు. అతని ఎదురుగా నున్న వ్యక్తి చేరరాజని, చోళరాజు గుర్తించలేదు. మాట్లాడుతూ చేతిని చాచాడు కంబడు. తమలపాకును చుట్టి కంబనికి అందించాడు చేరరాజు. అట్లాగే రెండు మూడు తమలపాకుల చిలుకలనందించాడు. నోట్లో పెట్టుకోకుండా చేతిలోనే వాటినుంచుకొని పరధ్యానంగా ఉన్నట్లు నటించాడు కంబడు.

అవి ఇచ్చి ఒక్క ఉదుటున గుఱ్ఱం ఎక్కి చేరరాజు ఉడాయించాడు. తానెవరో ఒక గుర్తును అక్కడ విడిచి వెళ్ళాడు.

ఇక్కడకు వచ్చినవాడు చేరరాజని మాటవరుసకైనా చెప్పలేదేమిటని చోళరాజు కంబణ్ణి ప్రశ్నించాడు.

నా పిలుపు మేరకు చేరరాజు వచ్చాడు. నీవాతనిని పిలవలేదు. నా గౌరవాన్ని, నా ప్రతిజ్ఞను నిలపడానికి వచ్చాడు. నేనాతని గౌరవాన్ని నిలపవద్దా? అందుకే నీతో చెప్పలేదు. వచ్చిన పని పూర్తి చేసుకొని

వెళ్లిపోయాడు, అందువల్ల పరిచయం చేయలేదన్నాడు కంబడు. ఇట్లా కంబని ఔన్నత్యం మరొక మారు ఋజువైంది.

అయితే అతడిచ్చిన తమలపాకు చిలుకలను నోట్లో ఎందుకు పెట్టలేదని చోళరాజు అన్నాడు.

అడపపుభరణిని తీసుకొని వస్తానని అనడం అతని వినయాన్ని సూచిస్తుంది. అతని స్వామిగా నేను నటించాను. తాంబూలం గ్రహించినట్లు నటించా. నిజంగా నోట్లో వేసికొంటే స్వామినని ప్రకటించినట్లౌతుంది కదా! నమిలి నా అహంకారాన్ని అతని ముందు ప్రకటించకూడదు కదా! సేవకుడిగా తీసుకొని వస్తాదన్నాను. నేను తమలపాకులు నమలడం ప్రధానం కాదు.

ఇట్లా ఆత్మగౌరవాన్ని తనకు తాను రక్షించుకోవడమే కాకుండా ఇతరుల ఆత్మగౌరవానికి భంగం కలిగించేరీతిలో కంబడు ప్రవర్తించాడు.

## కుట్టి పేరుతో ఇద్దరు

మొదటి కుట్టి కవి పేరు వాంఛీశ్వరన్. క్షేత్ర దేవత పేరు పెట్టారు తల్లిదండ్రులు. చిన్నపుడే కవితల నల్లేవాడు కనుక కుట్టికవి యని పిలిచేవారు.

## షాహజీ రాజు

17వ శతాబ్దం చివరిలో నాయక రాజులనుండి తంజావూరు ప్రాంతం మరాఠుల కైవసమైంది. వారి వంశంలో షాహజీ ఒకడు. కళాపోషకుడు. ఆపైన శివభక్తుడు. జయదేవుడు వ్రాసినట్లుగా ఇతడు శివునిపై 24 అష్టపదులను వ్రాసాడు. తిరువారూర్‌లో త్యాగరాజు భగవానుని కీర్తించాడు. కావేరీ దక్షిణతటంలో తిరువిసైనల్లూర్‌లో సర్వమాన్య అగ్రహారాన్ని ఏర్పాటు చేసి అనేక విద్వాంసులకు ఆవాసం కల్పించాడు. అందు కుట్టికవి తండ్రి యొకడు.

అందరూ పూలమాలలు వేస్తే కుట్టికవి పద్య సుమమాలతో రాజును అలంకరించాడు. కవులెంతగా స్తుతిస్తూ ఉంటే అంతకుమించి రాజులు వీరిని పోషిస్తూ ఉండేవారు. ఈ స్తోత్రాలలో అతిశయోక్తులుంటాయి.

రాజునుతించడం కంటె రాణిని నుతించి రాజు మెప్పు పొందే కథను గురించి చెబుతాను.

అప్పయ్య దీక్షితుల తాతగారి పేరు అచ్చాన్ దీక్షితులు. ఆచార్య దీక్షిత పదం అచ్చాన్ దీక్షితులయింది. ఇతడే వక్షస్థలాచార్యుడని కీర్తి గడించాడు. కృష్ణ రాయలదేవేరిని పొగిడి, ఆ బిరుదును పొందాడు.,

ఒకనాడు రాయలవారు కంచీపురంలోని వరదరాజస్వామిని దర్శించడానికి వచ్చారు. ఈ అచ్చాన్ దీక్షితుల ప్రక్కనే ఉన్నాడు.

అర్చకుడు పైనుండి క్రిందకు చూపించే హారతి ఎట్లా ఉందంటే స్వామివారి చూపులు పైనుండి క్రిందకు ఏదో వెదుకుతున్నట్లుగా; ఆ వెలుతురు, ఛాయ అట్లా కనబడింది. ఇట్లా ఉందేమిటని రాయలు దీక్షితులనడిగాడు.

స్వామి చూపు నీ ఎడమవైపున బంగారు రంగుతో ఉన్న రాణిపై బడింది. తన వక్షః స్థలం నుండి లక్ష్మి దిగి ఇక్కడ అవతరించిందా ఏమిటి? అని భావించి తన వక్షః స్థలాన్ని చూసుకొన్నట్లుగా ఉందని చమత్కరించాడు.

**కాంచిత్ కాంచన గౌరాంగీం వీక్ష్య సాక్షాదివ శ్రియం**

**వరదః సంశయాపన్నో వక్షః స్థలం అవేక్షతే**

అతణ్ణి వక్షఃస్థలాచార్యుడనే బిరుదుతో రాయలు సత్కరించాడు.

అట్లాగే కాళిదాసు, భోజుణ్ణి కీర్తించాడు. ఆ చమత్కారం వినండి:

భూలోకాన్ని గోకులంగా (గోలోకంగా) మార్చాడు కృష్ణుడు. అన్ని లోకాలకంటె పైలోకం గోలోకం కదా! గోలోకాన్ని విడిచి భూలోకానికి వెళ్ళే విష్ణువును చూసి నారదుడు ఎందుకిట్లా వెదుతున్నావని ప్రశ్నించాడు.

ఏమీలేదయ్యా! ఈ లోకంలో ఉండే కామధేనువు తన దూడకు పాలీయలేక వట్టిపోయింది. అందర్ని కోరికలను తీర్చే కామధేనువునకు పని లేకుండా పోయింది. అందరూ భూలోకంలోని భోజుణ్ణి ఆశ్రయించి అన్ని కోరికలను తీర్చుకొంటున్నారు కదా! చిక్కిపోయిన కామధేనువునకు భోజుడుండే భూలోకం వెళ్ళి కొన్ని గడ్డి పరకలను తీసికొని వద్దామని వెడుతున్నానని అన్నాడు.

నీవెంత దురదృష్టవంతుడవయ్యా! నీ పని జరిగేటట్లు లేదని నారదు డన్నాడు. కారణమేమంటావా, దానం, పరాక్రమం, పాండిత్యం కలిగిన శత్రురాజు లెందరో భూమిపై పడి యుండడం వల్ల అక్కడ గడ్డి కూడా మొలవడం లేదని అన్నాడు.

అట్లాగే కంబడు కూడా రాజును నుతించాడు. కొన్ని అతిశయోక్తు లుంటాయి.

రామపట్టాభిషేక సమయంలో వసిష్ఠుడు కిరీటాన్ని రాజు తలపై ఉంచాడు. అది కంబణ్ణి పోషించిన వంశంలో మొదటి రాజునకు చెందినది అన్నాడు.

ఒకనాడు షాహజీ మధుర మీనాక్షి దర్శనానికి వెళ్ళాడు. అతనితో బాటు కుట్టికవి, అతని తండ్రి కూడా వెళ్ళారు. రాజు, అమ్మవారిని చూసి ఆశువుగా ఒక శ్లోకం పలికాడు.

**పురిమధురం గిరి మధురం గరి మధురం ధరానితంబ**
**మప్య ధరం స్థూలకుచం నీలకచం భాలక చంద్రాంకితం భజే తేజః**

అనగా అమ్మవారి నివాసం మధురం - మధురాపురి కనుక పురి మధురం. ఆమె మాట మధురం - గిరి మధురం. ఆమె నల్లనైన కురులు మధురం - నీలకచం - అందున్న చంద్రవంక మధురం - భాలక చంద్రాంకితం. అటువంటిది ఆమె తేజస్సు.

కుట్టికవి విన్నాడు. ఇతడూ ఆశుకవిత నల్లాడు:

**కవిలోకే నవిలోకే భువిలోకేశస్య సాహ జేరు పమాం**

**హృదితర సావిదితరసా తదితర సాహిత్యావా నమే లగతి**

అని ఈ శ్లోకం భావం. కవిలోకంలో షాహజీవంటి రాజకవిని నేనింతకుముందు చూడలేదు. ఈ శ్లోకంలో హృది తరసా, విదితరసా, తత్ ఇతర సాహిత్య అనే మాటలలో తరసా అని మూడుసార్లు రావడాన్ని గమనించండి. కవిలోకే నవిలోకే అనే మాటలలోని శబ్ద సౌందర్యం గమనించండి. ఇది కవితలోని మాధుర్యం, ఇతర కవులలో ఉండదని అంటున్నాడు.

ఇట్లా రాజును పొగడుతూ పరోక్షంగా కవితా రసాన్ని చిందే కవినని చెప్పకనే చెప్పాడు. తరసా అంటే వెంటనే. లగతి అనగా పట్టుకొని యుండుట.

భక్తిరసంతో రాజు కవిత నల్లగా రాజును మించి పిల్ల కవి పెద్దకవిగా మారాడు.

ఇట్లా వాంఛీశ్వరునకు ఈ సందర్భంలో కుట్టికవి అని రాజు పిలిచినట్లు చెబుతారు. ఇట్లా పొగడిన కవియే రాజు పొరపాటు చేస్తే ఖండించిన సందర్భమూ ఉంది.

అయితే తప్పు చేసినవాడు సాహజీ కాదు.

## ప్రతాపసింహుడు - కుట్టికవి

షాహజీ తరువాత అతని కొడుకు ప్రతాప సింహుడు గద్దెనెక్కాడు. నానాజీ ప్రభు, చంద్రభాను, ఆనందరాయర్ వంటి వారు ముఖ్యోద్యోగులుగా ఉండేవారు. అయినా కొంతమంది అవివేకులు చేరడం వల్ల వారి మాటలు వినడం వల్ల ప్రజలు కష్టాలపాలయ్యారు. కవి పండిత పోషణ సన్నగిల్లింది.

ఈ సందర్భంలో రాజును వ్యంగ్యంగా మందలిస్తూ కుట్టికవి మహిష శతకం వ్రాసాడు.

ఇప్పుడు కుట్టికవి ప్రౌఢకవి అయ్యాడు. పైపై విషయం మహిషానికి సంబంధించినదైనా లోలోన రాజును నిందించడమే. ఇదే అన్యాపదేశంగా సందేశాన్ని అందించడం. మనుష్యులకే జంతువుల బొమ్మలను వేసి కార్టూన్ రూపంలో వెక్కిరిస్తూ ఉంటారు కదా!

మహిషి అనగా రాణి. పట్టమహిషి అనే వ్యవహారం ఉంది. రాజును మహిష అని అనరు. మహేశ, మహీపతియని అంటారు. కొన్ని శ్లోకాలు వ్రాసి రాజుకి పంపాడు. రాజును సేవిస్తూ అతనికి తందాన తాన అంటూ బ్రతకడం కంటె ఒక దున్నపోతును సంపాదించి పొలం దున్నుకోవడం మేలనే భావనతో పైపైన మహిషాన్ని నుతిస్తున్నట్లుగా శతకం ఉంటుంది.

ఒకటి రెండు శ్లోకాల అర్థాన్ని అందిస్తాను. ఒక శ్లోకంలో - శ్రీధరుడు, షడ్దర్శన పారంగతుడైన అంబుదీక్షితులు, నేను, ధనవంతుని పాదాలపై పడ్డాము. కాని ఏం లాభం? చిల్లి గవ్వ దక్కలేదు. ఓ మహిషమా! నీకు నమస్కరించకపోవడమే నా లోపం. మహిషేశ్వరుణ్ణి కొలవక పోయాం కదా!

మరొక శ్లోకంలో - రాత్రి పగలు పొలం దున్నుతావేమిటి? రాజసభలో హాయిగా బ్రతకవచ్చు కదా! నేను తెలివైనవాణ్ణి కాదని, ప్రజ్ఞ లేదని శంకించడం ఎందుకు? రాజసభలోని వారితో పోలిస్తే నీవే బృహస్పతివి.

రాజు చదివాడు. తప్పును గ్రహించాడు. కవిని సమీపించాడు. అసమర్థులను రాజసభనుండి గెంటి వేస్తానన్నాడు. ఈవిధంగా రాజును రక్షించాడు కవి.

రాజు తప్పు తెలిసికొన్నాడు కదా! ఈ శతకాన్ని కవి చింపివేయవచ్చు కదా అని శంకిస్తున్నారా? కవి, రాజునకు అంకుశం వంటివాడని లోకానికి తెలియడం కోసం భావితరాలకు తెలియాలని చింపలేదు.

అట్టి కవులను రాజు బహిష్కరించలేదనే విషయాన్ని గుర్తించండి. అది ఆనాటి రసికత. కవి యొక్క సాహసాన్ని గమనించండి.

## ముని మనుమడైన కుట్టికవి

పై కుట్టికవి ముని మనుమడు. వాంఛీశ్వర యజ్వ. సోమయాగం చేయడం వల్ల యజ్వ అయ్యాడు. పై ముత్తాతగారి మాదిరిగానే ఇతడూ మహా విద్వాంసుడే. ఇతణ్ని కుట్టి శాస్త్రియని పిలిచేవారు.

ఇతడు ఒక బెంగాలీ విద్వాంసునిపై తన ప్రతిభను చూపించాడు.

అమరసింహుని రాజస్థానానికి నవద్వీపం (నాడియా) నుండి ఒక విద్వాంసుడు తన తర్కశాస్త్ర ప్రతిభను చూపుతూ ఉండగా కుట్టిశాస్త్రి తన పాండిత్య బలంతో కట్టి వేసాడు. అట్లా తమిళనాడు గౌరవాన్ని నిలిపాడు.

## సర్ఫోజీకి తలవంచని శాస్త్రి

సర్ఫోజీ, ఇతని దగ్గరకు ఒక అశ్వికుణ్ణి పంపి రోజూ మంత్రాక్షతలను గ్రహిస్తూ ఉండేవాడు. ఇతని పూజ శాస్త్రోక్తంగా ఉండడం వల్ల ఆలస్యమౌతూ ఉండేది. అక్షతలను గ్రహించిన తరువాతనే రాజు భుజించేవాడు.

మీ పూజ నెమ్మదిగా చేస్తున్నారనుకొంటా అని ఒకరోజు రాజు, శాస్త్రితో అన్నాడు. రాజు కొన్నివేల తాళపత్రాలను సేకరించి, సరస్వతీ మహల్‌ని కట్టినవాడే, విద్వాంసుడే. అయినా ఆకలి బాధకు తట్టుకోలేక మృదువుగా అన్నాడు.

అరెరె! ఒకరాజు కోసం శాస్త్రకర్మను సంక్షేపం చేయడమా? నన్ను రాజు సేవకునిగా భావిస్తున్నాడా అని ఆ రోజే మకాం మార్చివేసాడు శాస్త్రి. స్వధర్మానికి హాని వస్తోందని అమ్మవారిని ప్రార్థించి మహారాష్ట్రకు పయన మయ్యాడు.

బాజీరావు శ్రీమంత్ అనే పీష్వా కొలువులో చేరాడు. ముఖ్యమంత్రులను పీష్వాలనేవారు. వారికి శ్రీమంత అని బిరుదుండేది. ఇంతకుముందు షాహజీని కొడియాడాడు కుట్టికవి. అట్లాగే కుట్టిశాస్త్రిపై శ్రీమంతుడు ప్రేమను, గౌరవాన్ని చూపించేవాడు.

పై పీష్వా, మహారాష్ట్ర సామంత రాజుల్ని ఏకం చేసి తెల్లదొరలపై దండెత్తగా 1818లో యుద్ధంలో ఓడిపోయాడు. ఇతని బిరుదును లాగుకున్నారు. నామ మాత్రంగా భరణం ఇచ్చేవారు. కాన్పూరు దగ్గర ఒక బంగళా నిచ్చి అందుండమన్నారు. అంటే దేశ బహిష్కృతుణ్ణి చేసినట్లే కదా!

పీష్వాను బంధించి దూరం తీసుకొని పోతున్నారని శాస్త్రి తెలుసుకొని భాగ్యంతో ఉన్న రోజులలో నీతో ఉన్నా, ఇప్పుడూ నీతోనే ఉంటానని అంతదూరం కాలినడకతో వెళ్ళాడు.

ఒక సంవత్సరం గడచిన తరువాత కాశికి శాస్త్రి వచ్చాడు. తాళపత్రాలు సేకరించడం కోసం కాశికి వచ్చిన సర్ఫోజీ ఇతణ్ణి చూసాడు. తిరిగి తంజావూరు రావలసినదిగా బ్రతిమలాడాడు. పీష్వా కూడా వెళ్ళమన్నాడు. వెళ్ళడానికి ముందే అహోబిల పండితుని దగ్గర వేదాంత శాస్త్రాన్ని అభ్యసించాడు.

మహారాష్ట్రలోని పాతమిత్రులను కలిసాడు. తరువాత మైసూరు మహారాజైన కృష్ణరాజ ఉడయార్‌ని కలిసాడు. ఆయన తన ఆస్థానంలో ఉండవలసిందిగా అర్థించి సత్కరించాడు. అయినా ఎక్కడున్నా అతని స్వతంత్ర భావానికి లోటు లేకుండా చూసుకునేవాడు. అక్కడుండగానే కుట్టిశాస్త్రి సోమయాగం చేసాడు. వాజపేయ యాగం చేసినవారికి రాజే గొడుగు పడతాడని విన్నానని నీకు గొడుగును పట్టే అవకాశాన్ని ప్రసాదించ వలసిందిగా మైసూర్ మహారాజు అర్థించాడు.

ఈ కాలం అనుకూలంగా లేదు. పరదేశస్థులు దండెత్తుతున్న కాలమిది. నేనీ సోమయాగాన్ని బ్రాహ్మణ ధర్మాచరణలో లోపాలుంటే సవరించుకోవడం

కోసం మాత్రమే చేసానంతే. ఇట్టి పరిస్థితులలో వాజపేయం చేయాలని ఒత్తిడి చేయవద్దని రాజుతో అన్నాడు శాస్త్రి.

రాజు గొడుగు పడతానంటే పొంగి పోయాడా? అతని నిరిపతను

ఈర్ష్య లేకుండా ఉన్నతిని సాధించడం ప్రశంసింపదగిందే! మితిమీరిన సమయంలో మొట్టికాయలు తిని వినయవంతులైన వారూ ఉన్నారు.

కాళిదాసు, ఎవరితో అధిక ప్రసంగం చేసాడు? పరాశక్తితోనే!

ఆమె ఇచ్చిన ఎంగిలి తాంబూలాన్ని తిని అంతటి కవియయ్యాడు. చివరకు కాళిదాసయ్యాడు. అతని నోటినుండే శ్యామలాదండకం వచ్చింది.

## దైవిక న్యాయం

కవుల వాగ్వాదాలూ, పాండిత్యాలూ సామాన్యులు నిర్ణయించలేనపుడు చివరకు నిర్ణయించేవాడు భగవానుడే. రకరకాల పరీక్షలుండేవి. కవులను, పండితులను ఏ గుడికో తీసుకొని వెళ్ళి వారి గొప్పదనాన్ని పరీక్షించేవారు. దైవిక పరీక్షలుండేవి. తాళ పత్ర సంపుటాలను తూచడం, వాటి మొగ్గును బట్టి నిర్ణయించడం మొదలైనవి. ఎక్కువ తాళపత్రాలున్నది బరువుగా ఉంటుంది కదా! కాని భగవత్ సమక్షంలో తక్కువ పత్రాలున్నది, సారమున్న పుస్తకం బరువుగా ఉండి త్రాసులో ఉన్న సిబ్బి క్రిందికి దిగడమూ జరుగుతూ ఉండేది. తిరుక్కురల్ చిన్న పుస్తకమే. దానిని సంగంపలకపై ఉంచినపుడు (శంఖఫలకము) అందరి సంగం కవుల రచనలన్నీ చెఱువు నీటిలో మునిగాయి, ఇతని పుస్తకం తేలిందని కథ. జ్ఞాన సంబంధర్ జీవితంలో అగ్ని పరీక్ష (అనల్ వాదం) జల పరీక్ష (పునల్వాదం) జరిగేవి. దైవీశక్తికే అన్నిటినీ విడిచిపెట్టేవారు. లేదా దేవసన్నిధిలో అందరు పోటీదారులుండగా దైవీశక్తిని ఆవహించుకొన్న పూజారి చెప్పేవాడు. దానినే దైవిక ప్రశ్నయని అనేవారు. (ఇటీవల కేరళలోని పద్మనాభస్వామి ఆలయంలో జరిగిన దేవప్రశ్నం ఇలాంటిదే – అనువాదకుడు)

కాళిదాసు, భవభూతి, దండి కవులలో ఎవరు గొప్పయని సందేహం కలిగింది. (వీళ్ళందరూ ఏక కాలానికి చెందినవారని చరిత్రకారు లంగీకరించరు)

కనుక భోజుడు వీరినందరిని ఆలయానికి తీసుకొని వెళ్ళేడట. అశరీరవాణి ద్వారా అమ్మవారు సమాధానం చెప్పిందని కథ.

**కవిర్దండిః కవిర్దండిః భవభూతిస్తు పండితః**

దండి, కవియని రెండుసార్లు పలికింది. భవభూతిని పండితుడనని చెప్పింది.

కవి చేసే పని పాండిత్యాన్ని ప్రకటించడం కాదు. సరస హృదయాలను రంజింప చేసే కవిత్వాన్ని అల్లగలిగితే అతణ్ణి కవిగా కీర్తిస్తారు. మధుర మంజుల పదాలతో, సులభంగా అర్థమయ్యే రీతిలో ఉండాలి. కవిత్వం, పాండిత్యం సమపాళ్ళల్లో ఉంటే అది గొప్పదనాన్ని సూచిస్తుంది. అయినా కొందరు పాండిత్య ప్రకర్ష కోసమే వ్రాస్తారు. అంతకంటె జనరంజకత్వమే ప్రధానం. పాండిత్యాన్ని మాత్రం ప్రకటించకూడదు. పండితుడు కానంత మాత్రంచే కవి కాకపోడు.

కనుక దండిలో పాండిత్యం కంటె కవిత్వపు పాలు ఎక్కువని అమ్మవారు నిర్ణయించింది. కవిత్వం కంటే పాండిత్యం ఎక్కువుందని భవభూతిని పండితుడని చెప్పింది.

తనను కవియనిగాని, పండితుడని గాని చెప్పలేదని కాళిదాసునకు కోపం వచ్చింది. నేనెరినని గద్దించాడు. ఈయన తొందరపడ్డాడని ఆమె కోప పడిందా? తానడిగినది తల్లి ఆలస్యం చేసిందని పిల్లవాడు దానిని విసిరి కొడితే తల్లి కోపపడుతుందా? అతణ్ణి చూసి గర్విస్తుంది కూడా. **త్వమేవాహం, త్వమేవాహం, త్వమేవాహం నసంశయః** నువ్వే నేను అని మూడుసార్లు బదులు పల్కింది. ఇద్దర్ని కలిపిన ఇతణ్ణి పండితకవి యని చెప్పిందా? లేదు. అభేదాన్ని చెప్పింది.

అందరి పాండిత్యాలకంటె ఆమెది అధిక పాండిత్యం కదా! ఆమె జ్ఞానద జ్ఞానమునిచ్చునది; జ్ఞాన విగ్రహ=జ్ఞాన స్వరూపమని లలితా నామా

లంటున్నాయి. కవితారసానికి ఆమెయే మూలం. రసస్వరూపుడు పరమాత్మ యని తైత్తీరియ ఉపనిషత్తు చెప్పింది. ఆమె నామాలలో రసజ్ఞ, రససేవధిః అనే నామాలున్నాయి. అంటే రసాన్ని తెలిసినది, రసానికి నిధియని అర్థం.

కథలో మరొక కథ. ఒక విషయంపై కవితను వ్రాయండని భోజుడనగా భవభూతి కాళిదాసులు వ్రాసుకొని తీసుకొని వచ్చారు. అమ్మవారి సన్నిధికి తీసుకొని వెళ్ళి త్రాసులో ఉంచారు.

కవిత్వంలోని సారాన్ని గ్రహించి అమ్మవారు, పరీక్షిస్తూ ఉండగా భవభూతి వ్రాసిన తాళపత్రం తేలిపోతూ ఉంది. సిబ్బిలో కాళిదాసు వ్రాసినది బరువెక్కువై క్రిందను చూపిస్తోంది. న్యాయతః కాళిదాసు గెలవాలి కదా!

కాళిదాసు మరల జయించాడని తెలిస్తే అతనికి ఇంకా తలబిరుసుతనం వస్తుందని, ఇంతకు ముందు ఓడిపోయిన భవభూతి ఇంకా చిన్నబుచ్చు కొంటాడని ఆలోచించింది. ఆమె తలలో పువ్వులుంటాయి కదా! చంపక, అశోక, పున్నాగ, సౌగంధికాలుంటాయి.

**చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా** అని ఒక నామం. కదంబ పుష్పాలను చెవిలో తురుముకొంటుంది. **కదంబ మంజరీ క్లుప్త కర్ణపూర మనోహరా** అని ఒక నామం.

భవభూతి కవిత తేలిపోతూ ఉంటే ఒక మాటు చెవి విదిలించింది తెలివిగా. అందున్న మకరంద బిందువు భవభూతి సిబ్బిలో పడింది. అతని సిబ్బి క్రిందకు వచ్చింది. అపుడు భవభూతి గొప్ప కవి అయ్యాడు. కాళిదాసు క్రిందనున్నవాడైనాడు.

అమ్మవారి చమత్కారాన్ని పసిగట్టాడు కాళిదాసు. నీవే నేనని చెప్పింది కదా! ఇదేమిటి? వెంటనే ఆశుకవితను చెప్పాడు.

ఇంతకుముందు మాదిరిగా తొందరపడ్డాడా? లేదు. ఇట్లా చేసావని నిందించలేదు. **అహోమే సౌభాగ్యం** = నా సౌభాగ్యం ఎంత గొప్పదో కదా అని ఆరంభించాడు.

ఆమె కృపవల్ల మనస్సు మార్చుకొన్నాడు. తన అహంకారం పోగొట్టటం కోసమే ఇట్లా భవభూతి పట్ల ప్రేమ చూపించిందని భావించాడు. లోగడ అభేదాన్ని చూపించింది కదా! ఇంకా అహంకారమేల అని జ్ఞానిగా ప్రవర్తించాడు.

అపుడు భవభూతి, అమ్మవారి అనుగ్రహాన్ని అన్నివేళలా అందుకున్న కాళిదాసునకు సాష్టాంగ నమస్కారం చేసాడు, భవభూతికి వంద ఏనుగులిచ్చి సత్కరించవలసిందిగా భోజునితో కాళిదాసన్నాడు.

వినయ సంపన్నుడయ్యాడు కాళిదాసు. రఘువంశం మొదటి శ్లోకాలలో ఒక తెప్పను ఆధారంగా చేసికొని రఘువంశమనే మహా సముద్రాన్ని దాటుతున్నానని వినయంతో అన్నాడు. రామాయణం వ్రాసిన వాల్మీకి యుండగా తాను వ్రాయడం ఎట్లా ఉందంటే పొడుగు పాటి వానికి అందే పండునకు పొట్టివాడు చేతులు చాచినట్లున్నదని వినమ్రుడై పలికాడు.

## నీలకంఠ దీక్షితులు - మహాదేవుడు

నీలకంఠ దీక్షితులు గొప్ప వంశంలో జన్మించాడు. శతాధిక గ్రంథకర్తయై, యజ్వయైన అప్పయ్య దీక్షితులు సోదరుని మనుమడు. పరమేశ్వరాంశతో పుట్టిన వారు, అప్పయ్య దీక్షితులు. ఇతడూ అట్టి విద్వాంసుడే, భక్తుడే. ఇతడు తిరుమల నాయకుని ముఖ్యమంత్రి. రాజునకు కుడిభుజం. ఆ నాయకుడు మీనాక్షి ఆలయంలోని మంటపాన్ని గొప్పమహల్‌ని నిర్మించాడు. నీలకంఠునకు ఎన్నో గొప్ప గుణాలున్నా తనకంటె గొప్పవాడు లేడనే అహంకారం ఉండేది.

తంజావూరు జిల్లాలో ఆనాటి కాలంలో పళమర్‌నేరి అనే గ్రామంలో మహావిద్వాంసుడైన మహాదేవ శాస్త్రి ఉండేవాడు. అయితే దీక్షితులకు దక్కిన కీర్తి ఇతనికి దక్కలేదు. ఇతని ప్రతిభను విద్వాంసులు గుర్తించకపోలేదు.

ఆ ఊరిదగ్గర ఐరావతేశ్వరుని గుడి యుంది. అమ్మవారి పేరు అలంకారేశ్వరి. ఆమెను కొలుస్తూ ఉండేవాడు శాస్త్రి. ఆమె అనుగ్రహిస్తు న్నట్లుగా కొన్ని సూచనలు కనబడేవి.

ఇతనికి మగపిల్లలు లేరు. మధుర వెళ్ళవలసిందిగా అమ్మవారు సూచించింది. ఆమె పరాశక్తి చైతన్యమే కదా!

శాస్త్రి మధుర వచ్చాడని అతణ్ణి కలుసుకొందామని దీక్షితులు భావించాడు.

దీక్షితులకు పాండిత్యమూ, అధికారమూ రెండూ ఉన్నాయి. మంత్రి హోదాలో ఉన్న తనను, శాస్త్రి వచ్చి కలిసి కోవాలనే అహంకారం ముందుకు వచ్చింది.

మహాదేవ శాస్త్రి తనతో మాట్లాడతాడని ఊహించాడు. పూజ ముగించు కొని, ఎవ్వర్నీ పట్టించుకోకుండా తన ధోరణిలో తాను పోతున్నాడు శాస్త్రి.

అమ్మవారు ఇద్దర్నీ కలపాలని భావించింది. దీక్షితులకు వినయం నేర్పాలని భావించింది.

ఒకనాడు పల్లకీలో ఎక్కి దీక్షితులు రాజలాంఛనాలతో ఊరేగుతూ ఉన్నాడు. ఆ సమయంలోనే శాస్త్రి పూజ ముగించుకొని తిరిగి వస్తున్నాడు. పల్లకీని చూడలేదు.

అందరూ దీక్షితులకు నమస్కరిస్తూ ఉండగా ఈ బ్రాహ్మణుడేమీ పట్టించుకోకుండా వెళ్ళిపోతున్నాడు. ఏమిటీ అహంకారమని దీక్షితులు భావించాడు. మనకడ్డంగా పోయే ఈ బ్రాహ్మణునికి ఒక అర్ధచంద్రాన్ని ఈయండని అన్నాడు. అంటే మెడపెట్టి గెంటండని అర్థం. అర్ధచంద్రోపచారమని పాండిత్యానికి తగ్గట్లు మాట్లాడాడు. మెడను త్రోసేటపుడు చేతిని అట్లాగే ఉంచుతాం కదా!

ఆయాంత మధ్వన్ అతి దీర్ఘ కర్ణం
బుధం మహాదేవ సునామధేయం
విలోక్యమంత్రి, మఖిసార్వభౌమః
శ్రీ నీలకంఠః శిబికాధి రూఢః
నిష్కా స్యైన్యం త్వతి దీర్ఘ కర్ణం
కృత్వార్థ చంద్రం ధృతమిత్యువాచ
శాస్త్రీ త్వదా కర్ణ్య జరిత్పువాచ తం
దీక్షితం జ్ఞానలవాఢ్యమూఢం

మార్గంలో పొడుగైన చెవులు కలిగి వచ్చుచున్న విద్వాంసుడైన మహాదేవ శాస్త్రిని యజ్ఞ సార్వభౌముడైన, మంత్రియైన, పల్లకీ యెక్కిన నీలకంఠ దీక్షితులు చూచి ఈతనిని వెంటనే అర్ధచంద్రప్రయోగంతో గెంటివేయండని అర్థం. వెంటనే శాస్త్రి అట్టి బిరుదులున్నవాడు అల్ప జ్ఞానంతో విఱ్ఱవీడుచున్నాడని సమాధానం చెప్పాడు.

ఏమిటీ సమాధానానికి అర్థం? ఏ అపకారం చేయని, పరమేశ్వరుని ధ్యానం చేసుకొనేవానిని, అధికార గర్వంతో అర్ధచంద్ర ఉపచారం చేయాలని అంటాడా? ఒకవేళ అతడు పండితుడైతే మాత్రం ఇతరులను తూలనాడాలా? పాండ్యరాజు ఇట్టివారిని చేరదీసాడేమిటి? అరకొర పాండిత్యం కలిగి మిడిసి పడుతున్నాడేమిటని భావించాడు.

సూర్యుడిప్పుడే అస్తమించాడు. చంద్రుడింకా ఉదయించలేదు. నక్షత్రాల కాంతి కూడా మందంగానే ఉంది. చీకటిలో తిరిగే మిణుగురు పుర్వులు ఇప్పుడు కాంతిని విరజిమ్ముతున్నాయేమిటని భావగర్భితంగా శాస్త్రి ఇట్లా చదివాడు:

సూర్యే ప్రణష్టే శశినిహ్యాదృష్టే

తారాసు మందస్యద్యుతిషు ప్రకాశం

**మహాంధకారే అతివిరాజితే హి**

**ఖద్యోత కోప్య ల్ప రు చిర్నచిత్రం**

ఈ మందలింపుని అర్థం చేసుకొన్నాడు దీక్షితులు. మంచి ఎద్దుకి ఒక దెబ్బ చాలు గదా! ఎన్ని సుగుణాలున్నా అహంకారం అంత పని చేసింది, వెంటనే పల్లకీ దిగి శాస్త్రప్రకారం శాస్త్రికి నమస్కరించాడు. అమ్మవారి అనుగ్రహం ఉండడం వల్ల అలంకారేశ్వరియే నిన్ను మీనాక్షిని దర్శించకోమని ఆదేశించినది కదా అని అప్రయత్నంగా అన్నాడు దీక్షితులు. దైవీశక్తి యొక్క అనుగ్రహాన్ని గమనించండి. ఆమె సంకల్పం వల్ల ఇద్దరూ కలిసారు:

**నిశమ్యతత్ తుష్టామనామఖీచ**

**తస్మై సపర్యాం విధివత్ చకార**

**భవాన్ అలంకార్య పి శోధితఃసన్**

**మీనాంబికాం సేవితుం ఆజగామ**

నన్ను మిణుగురు పురుగని ఒక సామాన్యుడనడం ఏమిటి? అని అహంకరించకుండా సహృదయత్వంతో శాస్త్రి మాటలను స్వీకరించాడు.

లోగడ కాళిదాసు కూడా అహోమే సౌభాగ్యం అన్నాడు కదా! అమ్మవారి అమృత బిందువులు పడి రక్షింపబడిన భవభూతిని చూచి పొంగిపోలేదా?

వినయంతో శాస్త్రిని సత్కరించాడు. ఇట్లా ముందు అహంకారంతో ఉన్న పండితులు, కవులూ ఉన్నా చివరకు వినయవంతులైన సంఘటనలెన్నో ఉన్నాయి.

## వికారం కూడా కొందరికి శోభస్కరంగానే ఉంటుంది

శివమహిమ్నస్తవంలో పుష్పదంతుడు వికారోపిశ్యాఘ్యః అనగా అసలైన రూపానికి అందవికారం కల్గినా పొగడదగినట్లుగానే ఉంటుందన్నాడు. పరమేశ్వరుడు విషాన్ని పానం చేసినపుడు అతని కంఠంలో అది మచ్చగా ఏర్పడినపుడు శంఖం వంటి తెల్లనైన కంఠంలో నల్లని మచ్చ కూడా (వికారం) శోభనే కల్గిస్తోందని అంటాడు. అట్లాగే మహాత్ముల అహంకారాలు కూడా చివరకు వినయానికే దారి చూపి సుగుణవంతుల్ని చేస్తున్నాయి.

## కవి ప్రతిభ - మాటల గారడీ

మనం వాడే మాటలనే కవులు వాడినా అవి ఒక అందాన్ని సంతరించుకుంటాయి. నవరసాలను గుప్పిస్తారు. కొందరిలో ఉన్నతమైన భక్తిభావాలు తొంగిచూస్తాయి. అర్థాలంకారాలతో, శబ్దాలంకారాలతో కవితలనల్లుతారు. ఎట్లా వ్రాయాలో, ఏ రీతిలో అందించాలో చెప్పేది అలంకారశాస్త్రం. తమిళంలో కూడా దండి అలంకార శాస్త్రమనే గ్రంథం ఉంది. 1200 సం॥ వెనుకటివాడు దండి. కావ్యాదర్శం అనేఅలంకారశాస్త్రాన్ని రచించినవాడు. 800 సంవత్సరాల వెనుక దాని నాధారంగా చేసుకొని తమిళంలో రచింపబడింది కూడా.

భావబంధురంగా వ్రాసి మెప్పించేవారు కొందరు. కొందరి రచనలలో మాటలను విరిస్తేనే చమత్కారం పుట్టి ఆనందాన్ని కలిగిస్తుంది. ఆ చమత్కారానికి ముగ్ధులమై ఒక మాటు ప్రపంచ బాధలను మరిచిపోతాం.

ఇట్లా శబ్ద చమత్కారం మహాకవులలో ఎక్కడోగాని యుండదు. గారడీలు సామాన్యంగా ఉండవు. కొందరు పాండిత్య ప్రతిభతో ఇట్టి చిత్రకవితలు వ్రాసి మెప్పిస్తూ ఉంటారు. కొందరు అర్థచిత్రానికే ప్రాధాన్యం ఈయగా కొందరు శబ్ద చమత్కారానికే ప్రాధాన్యం ఇస్తారు. మహాకవులు మనలో

ఉత్తమ సంస్కారాన్ని, ఆనందాన్ని కలిగించగా కొందరు మనలను శబ్దాలతో బంతులాడుకొని మనకు గిలిగింతలు పెడతారు.

## వ్యాస ఘట్టాలు

భారతశ్లోకం వినాయకుణ్ణే తికమిక పెట్టింది. ఏమా కథ?

వ్యాసుడు భారతం చెబుతూ ఉండగా మేరు శిఖరంపై కూర్చొని తన దంతంతో వినాయకుడు వ్రాస్తూ ఉండేవాడు. వినాయకుని వేగానికి వ్యాసుడే తట్టుకోలేకపోయాడు. ఈనాడు షార్ట్‌హ్యాండ్ వంటివి ఆనాడు లేవు కదా! వేగంగా శ్లోకాలు చెబుతా, అంత వేగంతో నీవు వ్రాయవలసి ఉంటుందని వినాయకునితో అన్నాడు. నేను వ్రాయడం మొదలు పెడితే నా వేగాన్ని తట్టుకోగలవా అని వినాయకుడు సవాలు విసిరాడు. నీవు చెప్పడం మానివేస్తే నేనిక వ్రాయనన్నాడు.

ఇట్లా వేయి శ్లోకాలు పూర్తి అయ్యాయి. వ్యాసునకు కాస్త అలసటగా ఉంది. సుబ్రహ్మణ్య స్వామినే ఓడించి పార్వతీ పరమేశ్వరుల ప్రేమను నోచుకున్న వినాయకుడు వ్యాసునకు లోబడతాడా? వ్యాసుడాలోచించాడు. వినాయకుడు మానివేస్తే ఇక వ్రాసేవారుండరని. ఏదో యాంత్రికంగా శ్లోకాలు వ్రాయడం కాదని ప్రతి శ్లోకాన్ని అర్థం చేసుకొని వ్రాయాలని షరతు విధించాడు వ్యాసుడు. వినాయకుడు అంగీకరించాడు. విశ్రాంతి కావాలనుకున్నప్పుడు ప్రతి వేయి శ్లోకాలకు ఒక క్లిష్టమైన శ్లోకాన్ని చెప్పేవాడు. వ్యాసుడు దానిని ఆలోచించి మరీ వ్రాయాలి కదా! ఈలోపుగా కొంత విశ్రాంతి వ్యాసునకు లభించేది. వీటినే వ్యాస ఘట్టాలంటారు. అందొకటి చెబుతా.

పాండవుల అరణ్యవాసం పూర్తి అయింది. అజ్ఞాత వాసమూ పూర్తి కావస్తోంది. ఈ లోపుగా వారెక్కడున్నారో ఊహించి విరాటనగరంలో ఉన్నట్లు నిశ్చయించుకొని వారిని బైటకు లాగాలని దుర్యోధనుడు పథకం వేసాడు.

విరాట రాజును ఇబ్బంది పెడితే పాండవులు రాజభక్తి కలవారు కాబట్టి అతణ్ణి రక్షించడం కోసం వీరు బైటకు వస్తారని ఉత్తరగోగ్రహణం, దక్షిణ గోగ్రహణం పన్నాడు. ఆ గోగ్రహణ సమయంలో బృహన్నలగా ఉన్న అర్జునుడు, విరాట రాజు తనయుడు ఉత్తర కుమారుడు బయలుదేరారు.

ఇక అర్జునుడు బాణాలను సంధించాడు. బాణవర్షం కురిపించే ఈ వనిత ఎవరని భీష్ముడు, ద్రోణునితో అన్నాడు. ద్రోణుని సమాధానం ముందు తికమకగా ఉంటుంది చూడండి. ముందర్థం కాదు:

**నదీజలం కేశవనారికేతుః నగాహ్వాయో నామ నగారిసూనుః**

**ఏషాంగనావేషధరః కిరీటి జిత్వా వయం నేష్యతి చాద్యగావః**

ఈ శ్లోకానికి అర్థమిది:

నదీజలం = నదినీరు

కేశవ నారికేతుః = కేశవుని స్త్రీతో అభిన్నమై

నగం=చెట్టు లేదా పర్వతం

నగాహ్వాయోనామ=నగం యొక్క పేరు కలవాడు

నగారిసూను=నగమునకు శత్రువైన వాని కొడుకు

ఏషాంగనా వేషధరః కిరీటి = స్త్రీ వేషం వేసికొని కిరీటం ధరించినవాడు

జిత్వా=జయించి

వయం = మనము

నేష్యతి = తీసికొని పోవును

చ+అద్య=చాద్య=ఇప్పుడే

గావః=గోవులు

ఇట్లా విడివిడిగా నున్న పదాలకు అర్థమున్నా తాత్పర్యమేమిటో బోధపడలేదు. కలిపి చూస్తే అర్థం వస్తుంది.

ఈ కనబడే వ్యక్తి స్త్రీ వేషంతో ఉన్నాడు. కిరీటాన్ని ధరించియున్నాడు. అది నదీజలము. కేశవుని స్త్రీతో సమానము. ఇతని పేరు పర్వతం గాని చెట్టుగాని అయి ఉంటుంది. చెట్టునకు గాని, పర్వతానికి గాని శత్రువైన వాని కొడుకు. మనము జయించాము. అతడు గోవులను తీసుకొని పోతున్నాడు. ఇదంతా చదువుతూ ఉంటే అసందర్భంగా లేదూ! నృత్యం చేయించే బృహన్నల కిరీటం ధరించదు. కనుక కిరీటి యనే మాట తప్పు. కిరీటిని అని ఉండాలి. ఆ మాట స్త్రీని సూచిస్తుంది. వ్యాకరణ దృష్ట్యా చూసినా అర్థం పరిశీలించినా ఇది తప్పు శ్లోకం.

దీనిని సరిగా అమర్చి చూస్తే అర్థం అవగతమౌతుంది ఏమిటి?

నదీజలం కేశవ నారికేతుః – అనే దానిని నదీజ + లంకేశ + వనారి – కేతుః అని విడదీయాలి.

నదీజయనగా ఒక నదికి పుట్టిన భీష్ముడా అని ద్రోణుడు సంబోధించాడు. లంకేశయనగా రావణుడు. వనారియనగా అరణ్యానికి శత్రువు, అనగా రావణ అరణ్య నాశన కారకుడు, అనగా ఆంజనేయుడు.

కేతుః అనగా ఇక్కడ జెండా. అనగా ధ్వజంపై ఆంజనేయుడు కలవాడు. అంటే లంకేశవనారి కేతుః = అనగా అర్జునుడు.

'నగాహ్వయో నామ' అంటే అర్జున వృక్షం పేరుగా కలవాడు.

ఇక్కడ నగమనగా చెట్టు. అర్జున వృక్షం ఉంది కదా! ఒక్కొక్క క్షేత్రంలో ప్రసిద్ధ వృక్షం కూడా ఉంటుంది. శ్రీశైలం, తిరువిడైమరుదూర్, తిరుప్పుడైమరుదూర్‌లో క్షేత్రాలలో ఉన్నాయి. సంస్కృతంలో వీటి పేర్లు మల్లికార్జునం, మధ్యార్జునం, పూతార్జనం మొదలైనవి.

నగారిసూనులో నగమునకు పర్వతమని అర్థం. పర్వతానికి శత్రువెవ్వడు? ఇంద్రుడు. పూర్వం పర్వతాలకు ఱెక్కలుండేవని ఇంద్రుడు వాటిని నరికాడని కథ. అపుడవి అచలమైనాయి. అచలం, అగం, నగం అన్నా అర్థం ఒక్కటే. అట్టి ఱెక్కలు త్రుంపిన ఇంద్రుని కొడుకు అర్జునుడే కదా!

ఏష అంగనా వేషధరః కిరీటి - బృహన్నలకు కిరీటం లేదు కనుక ఇక్కడ కిరీటం ధరించినవాడని అర్థం చెప్పకుండా మామూలుగా ఒక వ్యక్తి అయినట్లు భావించాలి. ఇంద్రుడు అర్జునుని పరాక్రమం చూసి కిరీటం పెట్టడం వల్ల కిరీటి అయ్యాడని ఇక్కడ అర్థం చెప్పకూడదు.

కిరీటిని అర్జునునిగా భావిస్తే అతడొక స్త్రీవేషంలో ఉన్నాడని విరాట రాజు తనయునకు సారథిగా ఉన్నాడని అర్థం వస్తోంది. అతని జెండాపై హనుమ ఉన్నాడని, అర్జున వృక్షం పేరు కలవాడని అర్థం వచ్చింది.

అయినా స్పష్టంగా అర్థం కావడం లేదు. జిత్వా, వయం, నేష్యతి చాద్యగావః అంటే మనం జయించాలి, అతడు గోవులను తీసికొని పోతున్నాడని అర్థం వచ్చింది. ఇది అసందర్భంగా ఉంది. ఎట్లా విడదీయాలి

కిరీటియైన అర్జునుడు, చాద్య=ఇప్పుడు, యం=ఎవనిని, అనగా దుర్యోధనుని; జిత్వా=జయించి, వః=మీ యొక్క; గాః=గోవులను; నేష్యతి=తోలుకొని పోవుచున్నాడో; తం=వానిని అనగా దుర్యోధనుని; అవ=రక్షించు అని అర్థం.

మొత్తం శ్లోకార్థం: ఓ గంగా తనయుడైన భీష్మ! రావణుని అశోకవనాన్ని రూపుమాపిన ఆంజనేయస్వామి జెండాగా గలవాడు అర్జున వృక్ష నామ ధేయం కలవాడు, పర్వతాలకు శత్రువైన ఇంద్ర తనయుడు, స్త్రీ వేషంలో ఉన్న కిరీటి, నీచేత అపహరింప బడిన గోవులను రక్షించడానికి వచ్చి దుర్యోధనుని ఓడించగా ఆ దుర్యోధనుని రక్షించు.

వెంటనే భీష్ముడు అర్థం చేసుకొన్నాడు. అతడు జ్ఞాని, నైష్ఠిక బ్రహ్మచారి కూడా. కనుక అతనికి సునిశిత బుద్ధి యుంటుంది. ఇట్లా వినాయకుడు, ఆంజనేయుడు, భీష్ముడనే ముగ్గురు బ్రహ్మచారులను స్మరించి పుణ్యం మూట కట్టుకొన్నాం.

వ్యాసఘట్టాలంటే ఇట్లా ఉంటాయి.

## శివ-శక్తియే శివ-విష్ణువు

అక్షరాలను అటూ ఇటూ మారిస్తే అర్థం మారుతుంది. కాళిదాసుని రఘువంశ ప్రథమ శ్లోకాన్ని చూడండి. ఇది మంగలశ్లోకం. బాగా తెలిసిన శ్లోకం:

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతపత్తయే

జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ

శబ్దార్థాల మాదిరిగా విడదీయరాని సంబంధం కలిగి జగత్తునకు తల్లిదండ్రులైన పార్వతీ పరమేశ్వరులను నుతిస్తున్నాను. శబ్దార్థాలను తెలిసికొనే బుద్ధిని నాకు ప్రసాదించుగాక.

ఇక్కడ పార్వతీప – రమేశ్వరౌ అని విడదీస్తే పార్వతీ పతియైన ఈశ్వరుడు, రమకు పతియైన మహావిష్ణువు రక్షింతురుగాక అని అర్థం వస్తుంది. పై జెప్పిన అర్థం తప్పని కాదు. మరొక అందమైన అర్థమూ వస్తుంది. అనగా పార్వతీ పరమేశ్వరులు; మహాలక్ష్మి మహావిష్ణువులు వస్తున్నారు. ఇట్లా రెండవ అర్థం సిద్ధించింది.

ప అనగా పతియని అర్థం. రాజును నృపుడంటాం. అనగా నరులను పాలించువాడని. నరసింహంను నృసింహం అంటాం. పార్వతీప యనగా పార్వతీపతి ఈశ్వరుడు. రమేశ్వర అనగా రమకు ఈశ్వరుడు అనగా విష్ణువు. అనగా శివ – విష్ణువులు.

పార్వతీ పరమేశ్వరులనగా శివ - శక్తులు. రెండవ పదంలోని ఒక అక్షరాన్ని తొలగించి మొదటి పదంతో కలిపితే అర్థం మారింది.

ఇందులో ఒక తత్త్వం దాగియుంది. శక్తి, పురుష రూపంలో ఉంటే అపుడు విష్ణువుగా పిలువబడతాడు. శివమ్ పురుషుడుగా నిర్గుణుడు అంటాం. అమ్మవారి రూపంలో అతనికి ఎడమవైపున ఉండగా అర్థనారీశ్వరుడౌచున్నాడు. ఆ సగుణ శక్తియే పురుష రూపంలో విష్ణువుగా ఎడమవైపున ఉండగా శంకర నారాయణుడని పిలువ బడుచున్నాడు. అనగా అమ్మవారి స్థానాన్ని విష్ణువు గ్రహించి ఈశ్వరుని భార్యగా ఉంటున్నాడు. అపుడు శివ - విష్ణువులు జగత్తునకు తల్లిదండ్రులు కావడంతో తప్పేమీ లేదు. శాస్త అనగా అయ్యప్ప వీరినుండే ప్రాదుర్భవించాడు.

విష్ణువు పురుష రూపంలో ఉండి అతడు మహాలక్ష్మితో కూడినపుడు భక్తులకు తృప్తిగా ఉంటుంది. రామానుజ సిద్ధాంతాన్ని శ్రీ వైష్ణవమని అంటారు. ముందు శ్రీని అనగా అమ్మవారిని పెట్టి అయ్యవారైన విష్ణువును ప్రక్కనుంచుతారు. శివుణ్ణి సాంబమూర్తిగా భావించినపుడు భక్తులకు తృప్తి కల్గుతుంది. పార్వతీప - రమేశ్వరౌ అనినపుడు పార్వతిని రమాదేవిని పేర్కొన్నాం. మంచివాక్కు మనకు కావాలనుకొనునపుడు పార్వతి - ఈశ్వరులను; లక్ష్మీ విష్ణువులను ప్రార్థించడం మనకు శుభకరమే. అక్షరం మార్చడం వల్ల రెండు రూపాలను భజిస్తున్నాం. ఇట్లా శైవం - వైష్ణవం శబ్దార్థాలుగా కలిసి యున్నాయి కదా!

## అక్షరం తొలగిస్తే చిత్రమైన మార్పు

ఒక అక్షరాన్ని తొలగిస్తే నిందాశ్లోకం. స్తోత్రంతో కూడిన శ్లోకమౌతోంది. గమనించండి. ఈ శ్లోకం సీతారావణ సంవాదంలోది. రావణుడొక శ్లోకంలో రాముణ్ణి నిందించాడు. దానికి సమాధానంగా సీత ఇట్లా చెప్పింది.

**ఖల! తం అసకృత్ - మా - స్పృశగిరా**

ఖల= ఓ దుర్మార్గుడా! తం=వానిని; గిరా=మాటలచే, అసకృత్= మాటిమాటికీ; మా-స్పృశ=స్పృశించకు. మాటలు మాట్లాడి కశ్మలం చేస్తున్నావనే అర్థంలో సీత మాట్లాడింది.

ఇక్కడ తం=అంటే అతనిని అనే అర్థంలో కాకుండా శ్లోకంలోని తకారాలను ఉచ్చరించకుండా శ్లోకంలోని మిగిలిన మాటలను గ్రహించాలని సీత అన్నట్లుగా ఆంజనేయుడు గ్రహించాడు. రావణుడు సీతతో రాముడిని నిందుస్తూ అన్న శ్లోకమిది:

**అత్యల్పం నిద్రాళుః రజనిషు కువాక్ దుర్గత తమః**

**మహోకాతర్యాఢః మనసి విధుత ప్రోజ్వల యశాః**

**వధాత్ మాంసాదానం బహువిమతలాభోజనకజే**

రావణుడిట్లా అంటున్నాడు. రాముడు నిద్రించేటపుడు శయ్యమీద పడుకొంటున్నాడా? (సుందరకాండలో హంస తూలికా తల్పంపై రావణుడు నిద్రిస్తూ ఉండగా నేలపై రాముడు నిద్రిస్తున్నట్లుంది) దీనిని గుర్తు చేస్తున్నాడు రావణుడు. రాముడు మంచి మాటలు పల్కడు. అనగా రాముడు తనతో శాంతిని కోరడం లేదని గాని, ధర్మం వంటి ఏవేవో మాటలు మాట్లాడతాడని నిందించాడు. ఆపైన అతడు తక్కువ స్థితిలో ఉన్నాడు. రాజ్యాన్ని విడిచి రాగా రాజ్యాన్ని మరల గ్రహించుమని భరతడునినా, అరణ్యాల వెంట బడ్డాడు. అతడు పిరికివాడు (ఇది పెద్ద అబద్ధం). అతని ఒకనాటి రాజత్వం ఇప్పుడు లేదు. తెలివి తక్కువగా మాంసం తినే రాక్షసుల్ని చంపి వారితో శత్రుత్వాన్ని పెంచి పోషించాడు. అతడెట్లా ప్రశంసింపదగిన వాడవుతాడు?

ఈ శ్లోకంలోని "త"లను తొలగిస్తే ఎట్లా ఉంటుందో చూడండి.

అత్యల్పం = 'త'ను తొలగిస్తే అల్పం (అల్ప నిద్రకలవాడు)

దుర్గతతమః = దుర్గమః (చెడ్డవాక్కుల వద్దకు వెళ్ళదని)

మహాకాతర్యాఢ్య= మహాకార్యాఢ్యః=(మంచి పనులు చేసేవాడని)

విధుతప్రోజ్జ్వల యశాః = విధు ప్రోజ్జ్వల యశాః = అతని కాంతి స్వచ్ఛమైనదని)

అల్పనిద్ర కలిగిన రాజు దొంగల బారినుండి ప్రజలను రక్షించగలడు. అర్జునుడు నిద్రను జయించాడు గనుక అతనికి గూడా కేశుడని అర్థం వచ్చింది. గుడాక యనగా నిద్ర, సోమరితనం, నీవన్న చెడ్డమాటలతో వాని నెదుర్కొనలేవు. చెడ్డవాక్కులతో అతనిని స్పృశించలేవు., మహాకార్యాలను రాముడు చేసాడంటే దుష్టశిక్షణ చేసేవాడని అర్థం. చంద్రుడు చల్లదనాన్ని కలిగించి ప్రజలను సంతోషపెడుతున్నట్లుగా అందరి మనస్సులను చల్లబరిచేవాడని, రాక్షసుల్ని చంపి కాంతిమంతుడై వెలుగొందుచున్నాడని, **సీత స్తోత్రం చేసినట్లైంది.**

**ఇక విచిత్ర కావ్యాల పంక్తులను** వినిపిస్తాను:

(ఈ భాగం **Kanchi** Mahaswami on Poets and Poetry నుండి)

ఆవుతోక మొదట లావుగా వుండి పోను పోను సన్నబడినట్లుగా గోపుచ్ఛాకృతిలో కావ్యాలల్లడం ఒకటి. ముత్తుస్వామి దీక్షితులు తమ కీర్తనలలో చూపించారు. తరంగిణి రాగంలో 'మాయే' అనే కృతిలో అమ్మవారిని సరసకాయే, రసకాయే, సకాయే అయే అని సంబోధించారు. సరసకాయే=అందమైన దయతో కూడిన ముఖము కలదాన; రసకాయే=రస స్వరూపురాల!, సకాయే=నిర్గుణం కాక శరీరంతో ఉన్నదాన; అయే=ఓ తల్లీ!

త్యాగరాజు, ఆనందభైరవి రాగంలో త్యాజరాజ యోగవైభవం - అగరాజ యోగ వైభవం, వైభవం; భవం, వం అని విడదీసి గానం చేసారు.

ఈ పాటలో అనుపల్లవిలో (రెండవ భాగంలో) మొదట చిన్నమాట,

పోను పోను పెద్ద మాటలూ వాడారు. మొదటి పద్ధతి గోపుచ్ఛాకృతి, ఈ రెండవది స్రోతోవహం వంటిది. ప్రవాహం పోను పోను పెద్దదవుతుంది కదా! ఈ రెండవ దానికి ఉదాహరణను చూడండి. శం, ప్రకాశం, స్వరూప ప్రకాశం, శివశక్త్యాది సకలేతత్త్వ స్వరూప ప్రకాశం అని అనగా శ్రీరాగంలోని శ్రీ వరలక్ష్మి అనే కృతిలో దీక్షితులవారు శ్రీ సరసపతే, రసపతే, సపతే, పతే మాదిరిగ గోపుచ్ఛాకారంగా వ్రాసారు.

## సున్న తొలగిస్తే

'త'ను తొలగిస్తే, సీత అర్థం మార్చి చెప్పినట్లు చూసాంకదా! సున్నను తొలగిస్తే ఇంకా అందంగా ఉంటుందని ఒక సందర్భంలో సూచించాడు ఒక కవి.

భవభూతి, కాళిదాసుతో సమానుడే కదా! ఇద్దరు కవులుమధ్య స్పర్థలుండడడం ఒకర్ని ఒకరు జయించడం వింటున్నదే. నేను చెప్పబోయేది అట్టిది కాదు. మరొక కవి యొక్క మాటలను సంస్కరించి మెఱుగులు దిద్దడమే.

భవభూతి, ఉత్తరరామచరితను వ్రాసి కాళిదాసుకు వినిపిస్తున్నాడు. ఒక స్త్రీ తాంబూలం అందిస్తూ ఉండగా తాంబూలం సేవిస్తూ కవితా రసాన్ని గ్రోలుచున్నాడు కాళిదాసు.

మొదటి అంకంలో దండకారణ్యంలో సీతతో గడిపిన రోజుల్ని నెమరు వేసికొంటున్నాడు రాముడు. కాలం తెలియకుండా గడిచిపోయింది కదా అని అన్నాడు: **అవిదితగతయామా రాత్రిరేవం వ్యరం సీత్**

ఇట్లా భవభూతి చదువుతూ ఉంటే సున్నం ఎక్కువైందని కాళిదాసన్నాడు. తాంబూలం ఇస్తున్న స్త్రీ, కాస్త సున్నం ఎక్కువ వేసానేమోనని భావించింది.

భవభూతితో శ్లోకంలోని సున్నను (రాత్రిరేవంలోనున్న సున్నను) తొలగించమంటే బాగుండదు కదా! సున్నం అంటే '0'గా భవభూతి అర్థం చేసుకొన్నాడు. దేవనాగర లిపిలో 'వం' అని రాయాలంటే 'వ' పైన చుక్క '.' పెడతారు కదా. 'రాత్రిరేవ వ్యరం సీత్' అంటే రాత్రే ఇట్లా గడిచిందని చక్కని అర్థం వస్తుంది.

అనుస్వారం ఎక్కువైందని కాళిదాసన్నట్లు కొందరు చెబుతారు. ఇట్లా తిన్నగా తప్పు చెప్పడం కంటె సున్నం ఎక్కువైందని చెప్పడం సొగసుగా ఉంటుంది.

కాళిదాసు 'సున్నం' అని వాడితే అతడు తప్పక తెలుగువాడై యుండాలి. తెలుగులోనే సున్నంకి సున్నమని, '0' అని అర్థముంది. అంతమాత్రంచే తెలుగువాడని చెప్పలేమని కొందరంటే మరొక ఉదాహరణ చెబుతా. ఇతడు వ్రాసిన మేఘసందేశంలో రామగిరి నుండి బయలుదేరమని మేఘుంతో యక్షుడన్నాడు. కొందరు నాగపూర్ దగ్గర రామ్‌టేక్ యని అదే రత్నగిరియని యనగా, ఆంధ్రదేశంలో నాగలాపురం దగ్గర రామగిరి యుంది కదా!

(భవ భూతి, కాళిదాసులు ఏకకాలానికి చెందినవారని ఏ చరిత్ర కారుడూ అనడు. కేవలం పై సంభాషణలోని చమత్కారాన్నే గ్రహించండి - అనువాదకుడు)

రాత్రినిట్లా సీతారాములు గడిపారనడం కంటే రాత్రే గడిచిపోయిందనడం సారాంశం.

## పదాలను త్రిప్పినా అవే పదాలు

వికటకవి, తమిళంలోని కుడకు వంటి పదాలను అటునుంచి ఇటు చదివినా, ఇటు నుంచి అటు చదివినా అవే పదాలు. అట్లాగే మలయాళమ్.

కాశీయాత్ర చేయడం, గయలో శ్రాద్ధం పెట్టడం, ప్రయాగలో స్నానం చేయడం ప్రసిద్ధమే కదా! కాశిని, కాశికా అని అంటారు. ఈ పదమూ పైమాదిరిగానే ఉంటుంది. అట్లాగే గయాప్రయాగ పదం కూడా.

సాక్షర అనే పదానికి మామూలుగా చదువుకొన్నవాడని అర్థం. ఆ పదం రసికత ఉన్నవాడని సూచించదు. సరస అనే పదం కావ్యరసాన్ని గ్రోలిన వాడనే అర్థం ఇస్తుంది. వికసించని మనస్సుతో ఉన్నా, చదువందించే మార్గాన్ని తప్పినా సాక్షరుడు, రాక్షసుడౌతాడు. సాక్షరా - రాక్షసా; కాని రసికుడు బాహ్యంగా మారినా అతని రసికత్వం మారదని ఒక వ్యక్తి చమత్కరించాడు, ఒక శ్లోకంలో.

సాక్షర, త్రిప్పితే రాక్షసుడవుతాడు. సరస పదం, అటూ ఇటు త్రిప్పినా సరస పదమే ఉంటుంది. అనగా సరసుడుగానే యుంటాడని తాత్పర్యం.

ఇట్లా కొన్ని అక్షరాలనే కాదు ఒక పెద్ద వాక్యాన్నే వ్రాసి అటునుంచి ఇటు త్రిప్పినా, అవే అక్షరాలు వచ్చేటట్లు మాఘ కవి వ్రాసాడు. మహాలక్ష్మి భగవంతుణ్ణి కౌగలించుకొనే సందర్భమది. తమ్ శ్రియా మొదలైన పెద్దవాక్యమది. ఇట్లా పండిత కవుల ప్రతిభ ఉంటుంది.

## మూక పంచశతిలో కామాక్షి - నవగ్రహాలు

కామాక్షి అమ్మవారు అన్ని బాధలను పోగొట్టి సంతోషాన్ని కల్గిస్తుంది. జ్యోతిశ్శాస్త్ర ప్రకారం నవగ్రహాలు మన కష్టసుఖాలకు కారణాలు. మూక పంచశతిలో ఒక శ్లోకంలో ఆమె పాదాన్ని ఆశ్రయిస్తే మన అన్ని బాధలు పోతాయని ఉంది.

మూక పంచశతి 500 శ్లోకాల గ్రంథం. ఇందు మూక కవి యొక్క జ్ఞాన, భక్తి శాక్త సంప్రదాయాలు ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. అందొక శ్లోకం అమ్మవారి పాదాలను ఇట్లా పొగడింది:

ద ధానో భాస్వత్తా మమృతనిలయో లోహిత వపు
ర్వి నమ్రాణాం సౌమ్యో గురరపి కవిత్వం చ కలయన్
గతౌమందో గంగాధర మహిషి కామాక్షి భజతాం
తమః కేతురాత్మతస్తవ చరణ పద్మో విజయతే

భాస్వంతం అనే పదం అమ్మవారి ప్రకాశించే స్వభావాన్ని సూచిస్తుంది. అది సూర్య లక్షణం. సూర్యునకు భాస్కరుడని ఒక పదం.

అమ్మవారి పాదం నుండి అమృతం స్రవిస్తోంది. అమృత నిలయమన్నాడు. యోగుల తలనుండి స్రవించు అమృత ధార ఆమె పాదపద్మాలనుండి స్రవించడం వల్లనే వారు చల్లగా నున్నట్లు భావిస్తారు. అదే చరణామృతం. చంద్రుడు కూడా అమృతాన్ని అందిస్తాడు కదా! అందుకే చంద్రుణ్ణి సుధాకరుడన్నారు.

శ్లోకంలో లోహితవపుః అని ఉంది. కుజుడు ఎర్రగా ఉంటాడు. వినమ్రాణాం సౌమ్య = వంగినవారి పట్ల సౌమ్యుడు. మనస్సునకు ఇష్టమైనది, మెత్తనైనది, శాంతితో కూడినదంతా సౌమ్యమే కదా! ఉగ్రదేవత, సౌమ్యదేవత అని అంటాం. చంద్రునకు సోముడని ఉంది. సోమపదం నుండి సౌమ్య పదం వచ్చింది. పెద్దమనిషి తరహా, శాంతి సంతోషాలను సౌమ్యమనే పదంతో వ్యవహరిస్తాం కదా!

బుధుడు సోముని సంతానం. అందువల్ల సౌమ్యుడయ్యాడు. వినతుల పట్ల సౌమ్యుడయ్యాడని తాత్పర్యం.

అమ్మవారి పాదాలను గురరపి అన్నాడు. పాదాలే గురుస్థానం కాబట్టి గురువంటాం. గుణాన్ని బట్టి ఆమె పాదాలనుండి దీక్ష పొందితే అది బ్రహ్మజ్ఞానాన్ని కల్గిస్తుంది. జ్ఞాన మిచ్చేది కనుక గురువు. గురువంటే ఒక గ్రహం. బృహస్పతి. కవిత్వాన్నిచ్చేది ఆమె పాదం. కవిత్వంచ కలయన్ అనగా కవిత్వమునలవరించుచు అని అర్థం. ఆమె పాద పద్మాలనుండి

స్రవించే జలం కవిత్వాన్ని ప్రసాదిస్తుంది. ఇది మూగవానిని కవిగా తీర్చి దిద్దుతుందని సౌందర్యలహరిలో (శ్లో 98) శంకరులన్నారు. మూగయైన మూకకవి అమ్మవారి దయచే మాట్లాడడమే కాదు, మహాకవిత్వమూ చెప్పగలిగాడు కదా! కవి అంటే శుక్రుడు, కవిత్వం వంటి లలిత కళలనిచ్చేవాడు శుక్రుడు. గురవంటే బృహస్పతి. బృహస్పతి దేవ గురువన్నట్లుగా అసురగురువు శుక్రాచార్యులు. అతణ్ణి ఈమె పాదాలతో పోల్చాడు.

గతౌమందో అంటే ఏమిటి? శనికి మందుడని అర్థం. నిమ్మదిగా అతని గమనం ఉంటుంది. శనీశ్వరుడని అనకూడదు. శనైశ్చరుడని అనాలి. నెమ్మదిగా నడకలు కలది అమ్మ. అనగా శనైశ్చరత్వం ఆమె పాదాలకుంది.

తమఃకేతుః ఏమిటి, తమస్ అనగా దుఃఖము, చీకటి. రాహువునకు తమస్ అనే పేరుంది. కేతువు నవమగ్రహం.

శ్లోకంలో రాహువనే కాకుండా తమస్ అని చేర్చబడింది. తమః కేతువైః అగ్ని లేక, కాంతియై రాహువు, కేతువు కూడా అయి నీ చరణ కమలం గొప్పగా శోభిస్తోందని తాత్పర్యం.

ఇట్లా సూర్యాది నవగ్రహరూపంగా అమ్మవారి దివ్యపాదాలు రూపింప బడ్డాయి ఈ శ్లోకంలో.

*(నవగ్రహాల అనుగ్రహం కోసం ఈ శ్లోకాన్ని పఠించవచ్చని పెద్దలంటారు)*

## దోమ - కేశవుడు

దోమ మొదలుకొని పరమాత్మ వరకూ కవులు వర్ణిస్తూ ఉంటారు. అందులో రకరకాల శబ్ద చమత్కారాలుంటాయి. పరమాత్మకు దోమకు అభేదాన్ని శ్లేషాలంకారంతో చమత్కారంగా ఇట్లా అన్నాడు:

చక్రభ్రమణ కరత్వాత్

కు దృష్టిభిః దూరవర్జ్యమానత్వాత్

శ్రుత్యంత ఖేలనత్వాత్

మశక! త్వామేవ మాధవం మన్యే

చక్రభ్రమణ కరత్వాత్ = మహావిష్ణువునకు చేతిలో చక్రం ఉంటుంది కదా! అది ఎప్పుడూ తిరుగుతూ ఉంటుంది. దోమ కూడా గిరగిరా తిరుగుతూ ఉంటుంది. విష్ణు పరంగా చూస్తే కర అనే పదానికి చేయియని అర్థం. దోమ పరంగా చూస్తే దానిచేత చేయబడినదని అర్థం.

కుదృష్టిభిః దూర వర్జ్యమానత్వాత్ = దుష్ట ఆలోచనలు కలవారికి దూరంగా ఉంటాడు విష్ణువు. కుదృష్టిభిః అనినపుడు కంటిరోగం కలవారు, దోమ నుండి దూరంగా తొలగిపోతారని అర్థం.

శ్రుత్యంతఖేలనత్వాత్=శ్రుతి అనగా వేదాలు. శ్రుత్యంతం అనగా ఉపనిషత్తులు. అనగా ఉపనిషద్విహారి, భగవానుడు. దోమ పరంగా శ్రుతియనగా చెవి. చెవి చివర, శ్రుత్యంతం. అక్కడ బాధ పెడతాయి దోమలు. శబ్దం చేస్తూ బాధ పెడతాయి.

మశకత్వమేవ మాధవం మన్యే = ఓ దోమ! అందువల్ల నిన్ను మాధవునిగా తలుస్తున్నాను. మాధవుని పనులన్నీ నీవు చేస్తున్నావని చమత్కారం.

స్వామివారు ఉపన్యాసం ఇచ్చేటప్పుడు దోమలు తిరుగుతున్న సమయంలో మీకందరికీ నిద్ర ముంచుకొస్తోందని, అనంత శయనమూర్తియైన భగవానుడు దోమగా వచ్చాడని చింతిస్తే కొంత బాధ తగ్గుతుందని, కవితా సౌందర్యం చిందించినా కొంత ఆనందం కల్గుతుందని చమత్కరించారు.

## తమిళ కవులు

*(ఈ వ్యాసం, తరువాతది, Kanchi Swami on Poets and Poetry నుండి)*

తమిళనాడు దాతలకు, కవులకు, జ్ఞానులకు భక్తులకు ప్రసిద్ధి.

ఆదిశంకరులు, గొప్ప శివభక్తుడైన జ్ఞాన సంబంధర్‌ను ద్రవిడ శిశువని తమ సౌందర్యలహరిలో పేర్కొన్నారు. అమ్మా! నీవు ద్రవిడ శిశువునకు పాలిచ్చావని కొనియాడారు. అట్టి వారెందరో ఉన్నారు.

ఇక్కడ ద్రవిడ, ఆర్య భేదాలను తీసికొని రావద్దని చాలాసార్లు చెప్పాను. ద్రవిడ శిశువనగా తమిళ శిశువు. అంతేనే కాని ద్రవిడ జాతికి చెందిన శిశువని అర్థం కాదు.

తమిళనాడు దాతలకూ ప్రసిద్ధి పొందింది. అందేడుగురు ప్రసిద్ధులు. పారి, కారి, ఓరి, అతికమాన్, మొదలైనవారు. ఒక మల్లెతీగ అల్లుకోవడం గమనించి తన రథాన్నే వదులుకొన్నాడు పారి. చలితో బాధపడే నెమలిని చూసి చలించి తన అంగవస్త్రాన్ని దానిపై కప్పాడు పేకన్. అతికమాన్, ఆయుర్దాయాన్ని పెంచే ఉసరికలను అవ్వైయార్‌కి ఇస్తూ దీర్ఘకాలం జీవించి నేనేమి సాధించగలనని, అవ్వైయార్ వంటి కవయిత్రికి ఇస్తే ఆమె చాలాకాలం బ్రతికి అందర్నీ మంచివారుగా తీర్చిదిద్దుతుందని అన్నాడు.

ఈ మాటలు వింటూ ఉంటే ఏమిటీ పిచ్చి పనులని భావిస్తాం. మల్లెతీగ ఎదగడానికి రాజు యొక్క రథమే కావాలా! నెమలి చలితో బాధపడుతుందా? నాయనార్లలో ఒక భక్తుడు తన కొడుకునే కోసి భక్తవేషంలో ఉన్న పరమేశ్వరునకు అర్పించడమేమిటి? ఇట్లా వారి పనులు పిచ్చిగా కన్పిస్తున్నా అందు దాగిన తత్త్వాన్ని గ్రహించండి. మహోన్నతమైన ప్రేమను, త్యాగబుద్ధిని గమనించండి. వీటిని హేతువాద దృష్టితో చూసి ప్రయోజనం లేదు.

తిరువళ్ళువర్, ధర్మాన్ని ప్రవచించడంలో అగ్రగణ్యుడు. త్యాగం గురించి

చెబుతూ బంధాలు లేనివానితో బంధం పెట్టుకోవాలన్నాడు. పట్టినట్టర్ అనే శివయోగి గొప్పధనవంతుడైనా సమస్తమూ త్యజిస్తూ తిరువలంగాడులో నాకీ మట్టిపాత్ర ఉందని వైరాగ్యంతో గానం చేసి ఇంటిని విడిచిపెట్టి వెళ్ళాడు. ఆ పాత్రతో పనేమిటని దానినీ బ్రద్ధలు కొట్టాడు.

తిరువళ్ళువర్ వ్రాసిన కురల్‌లో వైదిక భావాలెన్నో ఉన్నాయి. దానినీ వేదం మాదిరిగా పరిరక్షించుకోవలసిందే. తిరువల్లువమాలై అనే గ్రంథంలో సంస్కృతానికి వేదం ఎట్లాగో, తమిళానికి కురల్ అట్లా అని ఒక కవి పేర్కొన్నాడు. రెండూ గొప్పవైనపుడు అందేది గొప్పయని వివాదం వద్దు. సంగం కవుల కాలంలో అనగా క్రీస్తు పూర్వం, కవుల రచనలను ఒక సరస్సులో కర్రపలక మీద పెట్టి పరీక్షించేవారు. ఇది మధుర మీనాక్షి కోవెలలో జరిగేదట. సొగసులేని గ్రంథము నీట మునిగేదట. అట్లా తిరువళ్ళువర్ వ్రాసిన కురల్ మునగలేదు. ఇది ఒక రకమైన దైవికపరీక్ష.

అవ్వైయార్ రచనలలో వినయకర్ అహవల్ అనే యోగ శాస్త్ర గ్రంథం ప్రసిద్ధి కెక్కింది. కుండలిని గురించి చెబుతుంది. శివునికి చెందిన అత్తిసూడి అనే గ్రంథమూ గొప్పదే. అత్తి పువ్వులను ధరించే శివుణ్ని స్తోత్రం చేసే గ్రంథమది. కోన్‌రై అనే పుష్పాన్ని ధరిస్తాడట శివుడు.

కోన్‌రై ఆరుదళాలున్న పుష్పం. అది ప్రణవానికి సంకేతం. పంచాక్షరి మంత్రానికి ఓం చేరిస్తే ఆరక్షరాలయ్యాయి. దీనికి గుర్తు ఆ పుష్పం. వినాయకుడు కూడా ప్రణవ స్వరూపుడే. అవ్వైయార్ వినాయకుని భక్తురాలే. మేము కైలాసానికి వెడుతున్నాం, నీవు వస్తావాయని శివయోగియైన సుందరమూర్తి నాయనార్, వైష్ణవుడైన చేరమన్ పెరుమాల్ రాజులు ఆమెను పిలిచారట. కైలాసం వెళ్ళడం కంటె వినాయకుణ్ణి పూజించడమే నాకిష్టమన్నది అవ్వైయార్. పూజయైన తరువాత గణపతి తన తొండంతో ఆమెను గ్రహించి కైలాసంలో వారు రాకముందే కూర్చోబెట్టాడని కథ.

మృత్యువు మన జీవితాన్ని హరిస్తే శివుని కంటె తోడెవ్వరని అప్పర్ అనే మహాభక్తుడు కీర్తించాడు. మాణిక్యవాచకులు బ్రహ్మముపై మనస్సును లగ్నం చేసి తిరువాచకాన్ని నిరంతరం పాడుతూ ఉండేవాడట. ఒక ఆలయం నుండి మరొక ఆలయానికి వెడుతూ భగవంతునితో ఇట్లా అనేవాడట. నా పట్టునుండి నీవు తప్పించుకోగలవా? నిన్ను ఊరకే పోనిస్తానా అని భక్త్యావేశంతో గానం చేసాడు.

ఒక సింహళదేశపు రాజు బౌద్ధుడు. అతని కూతురు పుట్టు మూగ. అన్ని వైద్యాలు చేయించి విసుగు చెంది కూతురుతో చిదంబరానికి చేరుకున్నాడు. మాణిక్య వాచకులు రెండు పద్య పంక్తులను పలుకగా మిగిలిన రెండు పాదాలను ఆమె పూరించిందట. ఇవి తిరువాచకంలో ఉన్నాయి.

మస్తాన్ పాటలలో అద్వైతం తొంగి చూస్తుంది. తాయు మానవార్ పాటలలా ఉంటాయి. వేదనాయకం పిళ్ళై అనే క్రైస్తవుడు వ్రాసిన పాటలో ఆత్మానుభవం తొంగిచూస్తుంది.

పుగళేంది, విష్ణువును కీర్తిస్తూ వేదానికి మూలమందున్నవాడని అన్నాడు. ఆది మూలమే అన్నాడు.

తిరుమంగై ఆళ్వార్ విష్ణువు యొక్క కుడివైపున శివుడునన్నాడని అన్నాడు. అతడు చంద్రశేఖరుడని కీర్తించాడు. విష్ణువు శివునకు ఎడమవైపున ఉన్నట్లు శివభక్తుడంటాడు. అంటే అమ్మవారు ఉన్నవైపు. అపుడు ఎవరీ విష్ణువు? అంబికయే కదా! శివ, విష్ణు, అంబికలే రత్నత్రయం.

తిరుప్పావై, తిరువెంబాలను కన్యకలు. ఉషఃకాలంలోనే పాడుతూ స్నానాలు చేయడం తమిళనాడులో అన్ని ప్రాంతాలలో ఉన్న ఆచారం.

తిరువెంచెవైని, తిరువణ్ణామలైలో; తిరుప్పావైని శ్రీవిల్లిపుత్తూర్‌లో రచించారు. రెండు గ్రంథాలు పరమేశ్వరుణ్ణి, శక్తిని నుతించేవే. ఇవి బుద్ధ ఆలయ ఉత్సవాలలో సయాంలో (ఇప్పటి థాయ్‌లాండ్‌లో) కీర్తింపబడడం

విశేషం. ఉత్సవం మార్గశిర మాసంలో వస్తుంది. చలికాలంలో ఇట్లా ఆ మాసంలో కీర్తించడం, పిల్లలో భక్తిభావాన్ని కల్గిస్తుంది.

అరుణగిరి నాథునకు ఇష్టదైవం మురుగన్. అంటే సుబ్రహ్మణ్య స్వామి. ప్రతి స్వామి ఆలయంలోనూ భిన్నభిన్నంగా కీర్తించాడు. పళని క్షేత్రంలో స్వామిని నుతించే సందర్భంలో ఆనాటి పాలకుని పేర్కొన్నాడు. అతడు చేరమన్ పెరుమాల్. పళని క్షేత్రం కొంగునాడులో ఉంది. అరుణ గిరినాథుడిట్లా కీర్తించాడు:

ఓ పళని స్వామీ (అవినన్ కుడి) నీవీ కొంగునాడులోని పళనిలో దేవతల మాదిరిగా కొలువైయున్నావని. సుందరమూర్తి నాయనార్ అప్పుడు చోళదేశంలో ఉన్నాడు. అతడు 63 నాయనార్లను (శివభక్తులును) నుతించాడు. చేరమన్ పెరుమాల్, సుందరమూర్తి నాయనార్ ఇద్దరూ కలిసి కైలాసానికి ఒకరు ఏనుగుపై, మరొకరు తెల్లని గుఱ్ఱంపై ఎక్కి వెళ్ళారు. ఇంతకు ముందు చెప్పిన అవ్వైయార్‌ని రమ్మన్నారు. ఆమె నిరాకరించింది. ఈ కథను మనసులో పెట్టుకొని అరుణగిరినాథుడు కీర్తించాడు.

రామలింగస్వామి, ధర్మంతో నేటి చెన్నై నిండియుందని కీర్తించాడు. గత శతాబ్దంలో ఇద్దరు ధర్మమూర్తులు కన్పిస్తారు. వారే పచ్చియప్ప ముదలియార్, కృష్ణస్వామి అయ్యర్. తమిళనాడులో

ఇట్లా స్థల పురాణాలను పుక్కిటి పురాణాలుగా భావించకుండా వీటిని రక్షించుకోవడం మన బాధ్యత. ఒక భార్య, భర్త సంవాదంలో కావేరి పురాణం ఉంది. వారే నంద శర్మ, అనవద్యలు.

## అప్పయ్య దీక్షితులు

ఈయన అద్వైత ప్రవర్తకులైన గౌడపాద, శంకరుల తరువాత ప్రసిద్ధి పొందిన ప్రవర్తకుడు. 1520లో తమిళనాడులో ఉత్తర ఆర్కాటు జిల్లాలో

అడయపాలెంలో పుట్టి 73 సంవత్సరాలు జీవించాడు. 104 గ్రంథాలను రచించాడు. చతురధిక ప్రబంధకర్తగా కీర్తింపబడ్డాడు.

ముగ్గురు రాజులితనిని పోషించారు. చిన తిమ్మనాయకుడు; తంజావూరు, మధుర, ట్రావెంకూర్ కలిపిన విజయనగర ప్రాంతానికి వైస్‌రాయిగా ఉండేవాడు, 1550 వరకు ఉండేవాడు. చినబొమ్మడు 1549-1578 నాటివాడు. వెల్లూర్‌ను పాలించాడు. 1578 నుండి పెనుకొండను కొంతకాలం పాలించిన వెంకటపతి కాలంలోనూ దీక్షితులవారున్నారు.

చివరి రోజులలో చిదంబరంలో ఉన్నారు. శ్రీ వై. మహాలింగ శాస్త్రిగారి అభిప్రాయం ప్రకారం వీరు నటరాజు అనుగ్రహం వల్ల జన్మించి అతనితోనే ఐక్యం చెందారు. వీరి చివరిమాట భావగర్భితం. చిదంబరంలో దేహాన్ని చాలించే భాగ్యం కలిగింది. నా సంతానం విద్వాంసులు. వారు కవులు, నటరాజు పాదపద్మాలలో లీనం కావడమే నా లక్ష్యం అని అనగానే నటరాజు యొక్క పైకెత్తబడిన పాదం కనబడింది. దానిని నుతిస్తూ రెండు చరణాలు వ్రాసి కన్ను మూసారు. వారి పిల్లలు మిగిలిన రెండు పాదాలను పూర్తి చేసారు. సంసారమనే చీకటినుండి తప్పించుకున్నారు దీక్షితులు.

నా మనస్సులో శివజ్యోతి వెలుగుగాక అన్న తాత్పర్యానికి శ్లోకమిది :

**చిదంబరమిదం ప్రథితం మే చ పుణ్యస్థలం**
**సుతాశ్చ వినయోజ్జ్వలాః సుకృతయశ్చ కాశ్చిత్కృతాః**
**వయాంసి మమసప్త తేరుపరి నైవభోగ స్పృహా**
**నకించి దహమర్థయే శివపదం దిదృక్షే పరం**
**ఆభాతి హాటక మహానట పాదపద్మ**
**జ్యోతిర్మయో మనసిమే తరుణారుణోఽయం**

అట్టి పుణ్యశ్లోకులను స్మరిద్దాం

## రచయితల విధి

వేదాలను నాలుగుగా విభజించి నల్గురు శిష్యులకు అందించాడు వ్యాసుడు. వారు యజ్ఞ కర్మలననుష్ఠించు వారికి అందించారు. అందరికీ అందుబాటులో వేదాలుండాలనే సద్భావంతో పురాణాల రూపంలో వేదధర్మాలను అందించాడు. దీనికి సూతుణ్ణి నియమించాడు. పురాణ ప్రవచనం వల్ల సూత పౌరాణికుడుగా ఇతడు ప్రసిద్ధిని పొందాడు. అతడు బ్రాహ్మణేతరుడైనా బ్రహ్మర్షులు అతనికి ఉన్నత స్థానాన్నిచ్చి ఆ పురాణాలను విన్నారు.

వేదంలో సత్యాన్ని పలుకుమనే మాటయే హరిశ్చంద్ర కథారూపంలో కన్పిస్తుంది. ధర్మంచర అనే వేద వాక్యానికి మొత్తం భారతం ప్రసిద్ధి కెక్కింది. మాతృదేవోభవ, పితృదేవోభవ అనగా తల్లినీ, తండ్రినీ దేవతగా కలిగినవాడవు కమ్ము అనే మాటలకు వ్యాఖ్యానప్రాయంగా మొత్తం రామాయణముంది. ఇట్లా వేద ధర్మాలు పురాణాల రూపంలో ప్రజలలో నాటుకొన్నాయి.

పురాణ ప్రవచనం అనాదిగా ఉంది. పౌరాణికులున్నట్లు, ప్రధానంగా భారతాన్ని ప్రవచించినట్లు వారికి భూరి సంభావనలిచ్చినట్లు శాసనాలవల్ల తెలుస్తోంది. నిన్నమొన్నటివరకు అనేక గ్రామాలలో పురాణ ప్రవచనాలు సాగుతూ ఉండేవి. ప్రజలకు చదవడం, వ్రాయడం ఎక్కువగా రాకపోయినా అందరూ సంస్కారవంతులుగా ఉండడానికి కారణం పురాణ శ్రవణమే.

పూర్వకాలంలో విని నేర్చుకునేవారు. వేదాలు కావచ్చు, శాస్త్రాలు కావచ్చు. ఇక ముద్రణ యంత్రాలు ప్రబలడం, పుస్తక ముద్రణలు ఈనాడెక్కువగా ఉన్నాయి.

ఈనాడు రచయితలు, పత్రికా రచయితలు ఆనాటి పౌరాణికుల మార్గాన్ని ఎన్నుకోవాలి. ప్రజలకు ఇష్టపడేది వ్రాయడం కంటే వారిని ఉత్తేజితులుగా,

కర్తవ్యోన్ముఖులుగా తీర్చిదిద్దే రచనలు చేసే బాధ్యత పైవారిపై ఉంది. ఉత్తమ భావాలను కొంగ్రొత్త రీతిలో అందించాలి.

సత్యం, పంచదార మెదిపిన మాత్రలా ఉండాలి. కేవలం, పంచదార మాత్రమే ఈయకూడదు. అంటే వారి కిష్టమైన పచ్చి శృంగారం వంటి దానిని అందీయకూడదని అర్థం చేసుకోండి. ప్రజల ఆధ్యాత్మిక ఉన్నతికి పై రచయితలు నడుం కట్టాలి. తాము ఎదిగి ఇతరులను ఎదుగునట్లుగా వారి కలాలకు పదును పెట్టాలి. అట్లా సంఘానికి సేవ చేసినవారవుతారు.

శాంతి, సౌభాగ్యాలను, సంఘశ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని రచనలు సాగించండి.

## ప్రాచీన శాస్త్రాలను రక్షించండి

శాస్త్రాలనందించడంలో పూర్వుల మహోన్నత భావాలను పరికించండి. భోజుడు సమరాంగణ సూత్రాన్ని వ్రాసి అనేక యంత్రాలను, విమానాలను తయారు చేసే సూత్రాలనందించాడు. శాస్త్ర విషయాన్ని అందించాను గాని చేసి చూపించడం లేదన్నాడు. చేసి చూపిస్తే అనుకూల ప్రభావం కంటె ప్రతికూల ప్రభావానికే దారి చూపిస్తుందని, చేసే విధానం తనకు తెలుసని వ్రాసాడు.

ఈకాలంలో ప్రపంచ యుద్ధాలలో విమానాలలో అణుబాంబు వినియోగం, దానిద్వారా తీవ్రనష్టం జరిగిన వార్తలు మనకు తెలుసు.

1500 సంవత్సరం వెనుకటి వాడైన వరహమిహిరుడు తన బృహత్సంహితలో అనేక శాస్త్ర విషయాలను చెప్పాడు. అవి ఒక తరం నుండి మరొక తరానికి అందింపబడుతూ ఉండేవి. ఈనాడెన్నో రక్షించే సదుపాయాలున్నా మనం ప్రాచీన శాస్త్రాలను రక్షించుకోలేకపోతున్నాం.

అందలి విషయాలు సామాన్యులకు తెలయకపోయినా రక్షించాలంటున్నా.

ఒక గ్రుడ్డివాడు చేతిలో దీపాన్ని పెట్టుకొని నడుస్తున్నాడు. నీవు గ్రుడ్డివాడవు కదా! చేతిలో ఈ దీపమేమిటిని ఒకడన్నాడు. నాకుకనబడకపోవచ్చు, చీకటిలో నేను కనబడకపోతే నీవు నన్ను నెట్టివేసి యుండేవాడివి కదా! అని జవాబిచ్చాడు. కనబడనివానికి దీపం ప్రత్యక్షంగా ఉపయోగించక పోయినా కన్నులున్నవాడు, కన్నులు లేనివానికి హాని చేయడు కదా! అట్లాగే శాస్త్రాలు మన కర్థం కాకపోయినా అర్థం చేసుకొనేవాడు రాబోయే తరాలలో, ఉండవచ్చు. ఉంటారు. మనం రక్షించకపోతే రాబోయే తరాలవారు మనలను నిందించవచ్చు కదా!

ఆనాటి రాజులు శాస్త్రాలను రక్షించారు. ఈనాడట్టి వారు లేరు. అయితే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలున్నాయి. అయినా ఒక ప్రాంతానికి చెందినవారు, మరొక ప్రాంతం వారితో భాష; సరిహద్దులు, నీటితగాదాలు మొదలైన క్షుద్ర రాజకీయాలతో కొట్లాడుకుంటున్నారు. పూర్వకాలంలో ఒక రాజునకు, మరొక రాజునకు పోట్లాటలుండేవి. ఈనాడు అడుగడుగునా తగాదాలే. శాస్త్రాలను రక్షించడంలో ప్రభుత్వం సాయం చేస్తుందని చూడకూడదు. మనంతట మనమే రక్షించుకోవాలి. ఒక్కమాటు క్రూర జంతువుల్ని చూడండి. సింహం, పెద్దపులి నెదిరిస్తుంది. పెద్దపులి లేడిపై దుముకుతుంది. అయినా ప్రతి జాతి వర్ధిల్లుతూనే ఉంది. అట్లాగే ఎన్ని కొట్లాటలున్నా, ఎన్ని సమస్యలెదురైనా భావితరాల కోసమైనా శాస్త్రాలు అర్థమైనా, కాకపోయినా, రక్షించండి. ఈనాటికాలానికి పనికిరావని నిర్లక్ష్యం చేయకండి.

# నమోనమః

## మహాస్వామి యొక్క అంతర్మథనం

నన్ను పెద్దవానిగా భావించి మీరందరూ నాకు నమస్కరిస్తుంటారు. నేనూ పెద్దలకు నమస్కరించాలని కోరుకుంటాను. కాని చిన్నతనంలోనే పీఠాధిపతిని కావడంచే ఆదిశంకరులకున్న జగద్గురుపదం నాకు కూడా సంక్రమించుటచే ఇతరులకు నమస్కారం పెట్టే అవకాశం లభించడం లేదు. నా కోరిక నెరవేరడం లేదు.

## శంకరులు సన్న్యాసులకు విధించినది

సన్న్యాసులనుద్దేశించి శంకరులిట్లా ఆదేశించారు. ఎవరైనా మనకు (సన్న్యాసులకు) నమస్కరిస్తే అది మనకు చెందదని ఆ జగన్నిర్వాహకునికే, ఆ పరాశక్తికే చెందుతుందని భావించాలని కట్టడి చేసారు. అంటే మీ నమస్కారాన్ని మేము తీసుకొన్నట్లుగా భావించకూడదన్నమాట.

## శంకరులు - నారాయణ నామం

పరాశక్తిని గురించి చెప్పాను. ఆ శక్తినే శంకరులు నారాయణ పదంతో భాష్యంలో వ్రాసారు. దీనికి అనేక కారణాలున్నాయి. వివరాలలోకి వెళ్ళకుండా ఒక్కకారణం గురించి చెబుతాను.

అనాదిగా మన భారతదేశంలో వేదాంత, మీమాంస, న్యాయశాస్త్రాలపై చాలా చర్చ జరిగింది. వీటిని దృష్టిలో పెట్టుకొని శంకరులు భాష్యం వ్రాసారు.

ఇట్టి చర్చలపై సద్విమర్శలూ, కువిమర్శలూ వచ్చాయి. ఒకమూల శుష్కవేదాంత చర్చతోబాటు బహుదేవతల ఆరాధనల ప్రాశస్త్యమూ లోకానికి పూర్వులు అందించారు. అందువల్ల తత్త్వంతో బాటు భగవన్నామం యొక్క రుచిని అందించాలని శంకరులు భావించారు.

పెక్కు దేవతారాధనలున్నా ప్రధానంగా శైవులని, వైష్ణవులనే విభజన ప్రసిద్ధం. ఈ పేర్లలో దేనిని గ్రహించాలి? శంకరులు శంకరుని అవతారమే కదా! కనుక తన నామాన్ని ప్రచారం చేస్తే బాగుండదు కదా! శివునకు విష్ణువు, విష్ణునకు శివుడూ ప్రీతిపాత్రులే. జగత్ కారణశక్తిని, ప్రపంచ మహాశక్తిని, లేదా సగుణ బ్రహ్మమైన ఈశ్వరుణ్ణి వేదాంతంలో ఎక్కడ ప్రస్తావించవలసి వచ్చినా నారాయణ పదాన్నే శంకరులు వాడారు. (సత్వరజస్తమో గుణాలు లేనివాడు బ్రహ్మము. అతడు సగుణ సాకార మూర్తియైతే అతడు బ్రహ్మ. సకల కల్యాణ గుణాలు కలవాడు సగుణమూర్తియని వైష్ణవులంటారు. అనగా ఒక రూపము, కల్యాణ గుణాలు కలిగియున్నవాడు. ఈ తేడాను పాఠకులు గుర్తింతురుగాక)

ఈశ్వరుడని అన్నాను. ఈశ్వరుడంటే శివుడని కదా. వేదాంతంలో ఇతణ్ణి శివుడని అంటారు. అనగా సగుణ బ్రహ్మమని. రామానుజులు, మధ్వా చార్యులు మొదలైనవారు అదే అర్థంలో వాడారు.

శంకరులు సౌందర్యలహరి, శివానంద లహరి వ్రాసారని మీకు తెలుసు. శివుడైన తాను శివుణ్ణి ఎట్లా స్తోత్రం చేసారని శంక. అవి భక్తిసోత్రాలు కనుక. శంకరులు అనేక దేవతలపై భిన్న భిన్న మనః ప్రవృత్తుల వారి తృప్తికోసం అనేక స్తోత్రాలు రచించారు. అటువంటప్పుడు శివుణ్ణి స్తోత్రం చేయకుండా ఉంటారా? శంకరుడే శంకరులైనా, శంకరులు శంకరుణ్ణి నుతించారు.

వారు ఆత్మస్వరూపులైనా భక్తులను ఉద్ధరించడం కోసం అట్లా నుతించారు,

భక్తుల మనోభావాలలో లీనమై వ్రాసారన్నమాట. నీటికి రంగులేకపోయినా నేల యొక్క రంగును బట్టి నీటికి రంగు ఏర్పడుతోంది కదా! ఒక్కొక్కరికి ఒక్కొక్క దేవతామూర్తిపై ప్రీతి యుంటుంది. శివునిపై స్తోత్రం చేసినపుడు తనను గురించి ఆలోచించక ఒక భక్తునిగా వ్రాసారు. అవతారంగా తనను తాను భావిస్తే తను తాను స్తోత్రం చేసుకొన్నట్లవుతుంది కదా! శివభక్తునిగా భావిస్తే శివుణ్ణి ఎంతైనా పొగడవచ్చు.

శంకరులు స్థాపించిన మఠాలలో శివుణ్ణి అనగా చంద్రమౌళీశ్వరుణ్ణి ప్రధాన దేవతగా స్థాపించి మిగిలిన దేవతలను అంగ దేవతలుగా పెట్టి పూజించారు. దేవతలందరికీ సమమైన ప్రాధాన్యం ఎందుకీయలేదు? వారు తమంతట తాము ఏర్పాటు చేసికొనలేదు. పరమేశ్వరుడే వారికి ఐదు స్ఫటిక లింగాలనిచ్చాడు. అందువల్ల ఐదుచోట్ల వాటికి పూజలు జరుగుతూ ఉంటాయి. ఈశ్వరాదేశానుసారం శృంగేరిలో కంచిలో రెండు లింగాలనుంచారు. అదే పద్ధతిని ఇతర మఠాలలోనూ ప్రవేశపెట్టారు. అట్లా శివపంచాయతన పూజ ఆరంభమైంది. అంటే ప్రధాన దేవత శివుడే. పరివార దేవతలుగా విష్ణువు, అంబిక, వినాయకుడు, సూర్యుడూ ఉంటారు.

అయ్యా! భాష్యం వ్రాసేటపుడు శంకరులను ఆత్మ స్వరూపులని మీరన్నారు కదా! తాము శివావతారంగా భావించడం వల్ల తన పేరును ఉచ్చరించకుండా నారాయణ స్మరణ చేసారంటున్నారేమిటి? దీనికి జవాబిది: ఆత్మ స్వరూపం భాష్యం వ్రాయదు. అది నిష్క్రియం. అది తనంతట తానుండేది. భాష్యం వ్రాసేటపుడు ఆత్మస్వరూపాన్ని ప్రక్కన పెట్టి అవతారమే అవుతుంది. శివావతారంగా భావించి ధర్మప్రబోధం కోసం గ్రంథాలు వ్రాయవలసి వచ్చింది. అవతార స్థితి ఎప్పుడైతే వచ్చిందో ఏ అవతారమనే ప్రశ్న వస్తుంది. అది శివావతారమే. కనుక అవతార శివుడు తనను గురించి చెప్పుకొనక విష్ణునామాన్నే భాష్యంలో ఉంచారు. నారాయణుడు జగత్ పాలకుడు కదా!

అద్వైతం అంటే జీవాత్మ పరమాత్మల తాదాత్మ్యం. ఇప్పుడు శివావతారం, విష్ణువును స్మరించింది. ఇట్లా చేయడం వల్ల హరిహరాద్వైతం సిద్ధించింది.

విష్ణువునకు సహస్ర నామాలున్నా నారాయణ పదాన్నే ఎంచుకొన్నారు. అది అష్టాక్షరమంత్రంలో ఉంది కదా!

ఆయనం అనగా మార్గం. ఆ మార్గం వల్ల లక్ష్యాన్ని చేరుకోవడమే గమ్యాన్ని సూచిస్తుంది. నారాయణుడు సమస్త జీవులకు ఆయనం. అతడే బ్రహ్మవిద్యాశాస్త్రం. నేను విద్యలలో ఆధ్యాత్మవిద్యనని గీతలో అన్నాడు కదా! **ఆధ్యాత్మ విద్యా విద్యానాం.** ఆ విద్యవల్లనే బ్రహ్మమును చేరుకోవాలి. అందువల్లనే అద్వైతవిద్యా గురుపరంపర నారాయణునితోనే ఆరంభ మౌతుంది. **నారాయణం పద్మభువం** కనుక బ్రహ్మ విద్యాశాస్త్రంలో ముందుగా అతణ్ణి పేర్కొనడం సబబు.

నారాయణుణ్ణి శంకర పదంతో కలిపి శంకర నారాయణగా పేర్కొంటాం. తమిళనాడులోని దక్షిణ ప్రాంతంలో ఇట్టి మూర్తి ఉన్నాడు.

ఒక పెద్దమనిషి యున్నాడు. ఆయన స్మార్తుడే. కాని శివుని పట్ల విపరీతమైన భక్తి. వీరశైవ ధోరణిలో ఉండేవాడు. నాకతడు నమస్కరించి నపుడు నారాయణ నారాయణ అని నేనంటే అతనికి బాధగా ఉండేది. అందువల్ల నారాయణ పదాన్ని నిమ్మదిగా ఉచ్చరించేవాణ్ణి. అయినా ఒకరోజు అడిగాడు.

ఇట్లా సమాధానం చెప్పాను. అందరు హిందువులకు ఉపనిషత్తులు ప్రమాణమే కదా! అవునన్నాడు. స్కందోపనిషత్తులో **విష్ణోశ్చ హృదయం శివః** అని ఉంది కదా! అంటే విష్ణువు యొక్క హృదయమే శివుడని అర్థం కదా! శివుడనే హృదయం ఉంటేనే, అంటే విష్ణువును బ్రతికించే వాడు శివుడని అర్థం వస్తోంది కదా అన్నాను. బాగుబాగని సంతోషించాడు. మంత్రంలో సగమే చదివాను తెలివిగా. దాని ప్రక్కనే **శివస్య హృదయం విష్ణుః** అనీ

ఉంది. అనగా విష్ణువే శివుని హృదయం. దీనిని అతని ఎదురుగా అనలేదు.

కనుక ఇద్దరూ, రెండూ ఉండవలసిందే. నిర్గుణ బ్రహ్మమనే కేంద్రం ఉండగా శక్తి కదులుతోంది. కనుక స్థితి శక్తి, గతిశక్తి రెండూ ఉండవలసిందే (Static Force, Dynamic Force). ఇక్కడ స్థితిశక్తి ఈశ్వరుడు, లేదా శివం. గతిశక్తి విష్ణువు.

కనుక జగన్నిర్వాకుడైన నారాయణునకు నమస్కారము. కనుక అన్ని పనులను అతనికే అర్పించాలి. ఈ మాటను చెప్పినది ఒక్క శంకరులే కాదు. చాలాకాలం నుండి వస్తున్న శ్లోకం మీరెరిగిందే:

**కాయేన వాచా మనసేంద్రియైర్వా**

**బుద్ధ్యాత్మనావా ప్రకృతేః స్వభావాత్**

**కరోమి యద్యత్ సకలం పరస్మై**

**నారాయణాయేతి సమర్పయామి**

ఒక్క శరీరంతోనే పనిచేయం. మనస్సు, బుద్ధులతో జీవాత్మ పనిచేస్తోంది. దానము కూడా క్రియయే. సమాధి మినహా అంతా పనితోనే ఉంది. సహజ స్వభావంచే నేనేది చేస్తున్నా అన్నిటినీ నారాయణునకు అర్పిస్తున్నాని ఆ శ్లోకానికి అర్థం.

శంకర నారాయణ పదం వాడాను. శంకరులు వ్రాసిన ప్రశ్నోత్తరమాలికలో ఎవరు భగవానుడని ప్రశ్న. సమాధానంగా శివ, విష్ణువులని, హరి – హరులనే పదాలు వాడకుండా శంకర నారాయణుడని అన్నారు. కలిసిన రూపమని అన్నారు.

**కశ్చ భగవాన్ మహేశః? శంకర నారాయణాత్మైకః**

కనుక జగత్కారణుడు నారాయణుడు కాబట్టి, మీకెవరైనా నమస్కరిస్తే అది నారాయణునకే చెందుతుందని శంకరులు మాకాదేశించారు.

## అన్ని నమస్కారాలూ నారాయణునికే

ఏ దేవతకు నమస్కరించినా అది కేశవునకే చెదుతుంది. సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి అనే మాట ఉంది కదా! కేశవుడంటే నారాయణుడే. అది విష్ణుపదమే. కృష్ణునకు ప్రత్యేక నామం కేశవుడు ఈ పదం విష్ణు సహస్రనామాలలో వస్తుంది. కేశవ పదంలో క+అ+ఈశ+వ అనే అక్షరాలున్నాయి. క అనగా బ్రహ్మ. అ అనగా విష్ణువు. ఈశ=శివుడు అనగా త్రిమూర్తులూ కేశ పదంతోనే వ్యవహరింపబడ్డారు. వీరు సృష్టి, స్థితి, సంహారాలు చేస్తారు. వ అనే అక్షరం ఉంది కదా. అనగా ఈ ముగ్గురిని వశంలో ఉంచుకొన్నవాడు కేశవుడు. పై మూడు పనులే కాక అన్నిటికీ మూలకారకుడు కేశవుడు. అందుకే నారాయణ పదం వాడారు. కేశవునకు చెందుతాయని అంటే నారాయణునకే అన్ని దేవతలకు పెట్టే నమస్కారాలు చెందుతాయి.

దేవతలకు పెట్టే నమస్కారాలే నారాయణునకు చెందగా మామూలు వ్యక్తులు మరొకరికి పెట్టే నమస్కారాలు చెందవా?

అందువల్లనే ఎవరైనా మాకు నమస్కరించినపుడు మమ్మల్ని నారాయణ స్మరణ చేయాలని ఆదేశించారు శంకరులు. ఆ మాట నుచ్చరించడంలో భగవానునే స్మరిస్తున్నాం. అతనికి చెందవలసిన వాటిని మేము ఊడ బెరికితే ఎలా? అతనికే అందిస్తున్నాం.

## నిజమైన స్మరణం

మామూలుగా నారాయణ అంటే అది నారాయణ వచనమౌతుంది. స్మరణం కాదు. స్మరణం అనగా మానసికంగా భావనతో పలకాలి. హృదయ పూర్వకంగా ఉండాలి. ఒక స్తోత్రం గాని, మంత్రంగాని, యాంత్రికంగా పలుకుతూ ఉంటాం. అట్లా కాకుండా అర్థంపై దృష్టి పెట్టి పలకడం

విశిష్టమైనది. ఏదో నోటితో ఉచ్చరించడం కాదు నారాయణుణ్ణి స్మరించకుండా పలికితే దోషం. భగవానునికి చెందవలసిన దానిని మనమే స్వీకరిస్తామా? ఈ విషయంలో సన్న్యాసి జాగరూకుడై యుండాలి.

## నిజమైన సన్న్యాసి - నమస్కారం

నూటికి నూరు పాళ్ళు సన్న్యాసి ఏమి చేయనవసరం లేదు. అతడెవరికి ఋణపడియుండలేదు. ఇతరుల సుఖదుఃఖాలతో అతనికెట్టి సంబంధమూ లేదు. అట్టివారికి నమస్కరిస్తే నమస్కరించినవారి బాగోగులను చూడనవసరం లేదు. అట్లా ఉండకపోతే తాను సంకల్పించినది జరిగిందా లేదా? అనే చింత అతనిని వెంటాడుతూ ఉంటుంది. ఇట్లా ఆలోచిస్తూ ఇక ఆత్మ విచారమేమి చేయగలడు? ఆత్మవిచారణ చేయనివాడు సన్న్యాసియే కాదు. అతడు సన్న్యాసికాకపోతే అతనికెవరూ నమస్కారం పెట్టనవసరం లేదు. కనుక నిజమైన సన్న్యాసి తన లక్ష్యమేమిటో అడుగడుగునా గుర్తుంచుకొంటూ నారాయణునికే అన్నిటిని వదిలిపెట్టగలగాలి. ఇతరుల బాగోగులను చూసే బాధ్యత సన్న్యాసిది కాదు.

విద్యారణ్య స్వామివారు తమ జీవన్ముక్తి వివేకంలో బ్రాహ్మణ పదాన్ని బ్రహ్మజ్ఞాని అనే అర్థంలో వాడి సన్న్యాసియే బ్రహ్మజ్ఞానియని జీవన్ముక్త లక్షణాన్ని భారతం నుండి పేర్కొన్నారు. అట్టివాడు ఆశీర్వదించకుండా నమస్కరించకుండా ఉంటాడని అన్నారు.

నిర్నమస్కారం, నిరాశిషం

అంతా తానైనపుడు తనకు తాను నమస్కరించుకోవడం, ఆశీర్వదించు కోవడం ఉంటుందా!

నమస్కరించేవారిని ఆత్మస్వరూపులుగా భావిస్తాడు. కాని ఇతరులు తాము తక్కువ వారమని, సన్న్యాసులు ఎక్కువవారని తలుస్తారు. ఆశీర్వదిస్తాడని

ఆపేక్షిస్తారు. అతడు గ్రహిస్తున్నట్లుగా కనబడకపోతే వాళ్ళు బాధపడరా? ఈ అజ్ఞానుల పట్ల సుముఖంగా ఉండవద్దా?

విద్యారణ్యు లీ విషయం ఎత్తుకొని ఇట్లా సమాధానం చెప్పారు. ఇతరులు నమస్కరించినపుడు ఏమీ అనకుండా ఉండడానికి బదులు నారాయణ పదాన్ని స్మరించాలన్నారు. అది ఆశీర్వచనానికి ప్రతినిధి.

**నిఖిల ఆశీర్వాద ప్రతినిధిత్వేన నారాయణ శబ్ద ప్రయోగః**

ప్రత్యక్షంగా ఆశీర్వదించకపోయినా ఇతరుల దుఃఖాన్ని పోగొట్టడంలో ఇది విరుగుడుగా పనిచేస్తుంది. ఇది మామూలు మందు. సంసార లంపటం అనే రోగాన్ని పోగొట్టే మందుగా పనిచేస్తుందన్నారు.

## మఠాధిపతియైన సన్న్యాసి - నమస్కారం

ఇంతవరకూ నిజమైన సన్న్యాసిని గూర్చి చెప్పా. మావంటి సగం సగం సన్న్యాసులుంటారు. (స్వామివారు నవ్వుతూ అన్నారు). సగం అంటే కూడా ఎక్కువే, పాస్ మార్క్ సన్న్యాసులందాం. ఇక మావంటివారు ఇతరులు మాకు నమస్కరిస్తూ ఉంటే అంతా నారాయణునకు విదిలేసి పట్టించుకోకుండా ఉండాలా?

భార్యాబిడ్డల్ని విడిచిన వానికి సంఘంతో పనేమిటి? అని శంక.

మేము మఠాధిపతులమై గురుపీఠాన్ని అలంకరించాం. వీరినుద్దేశించే పాస్‌మార్క్ సన్న్యాసులన్నా. ఎప్పుడైతే గురుస్థానం వచ్చిందో కొన్ని విధులుంటాయి. సంఘంతో సంబంధం ఉంటుంది. సంఘంలో ఉన్న అందర్నీ శిష్యులుగా భావించి సన్మార్గంలో పెట్టవలసిన బాధ్యత మామీద ఉంది. అటువంటప్పుడు నీ సుఖదుఃఖాలతో నాకు సంబంధం లేదు, నీ ఇష్టం వచ్చినట్లు నీవు నడు, అంతా నారాయణునకు విదిలి పెట్టమని చెబితే అతడు అంగీకరిస్తాడా?

నేనేమంటున్నా? వేదరక్షణ నిధికి చందాలనో, గోపుర నిర్మాణానికి డబ్బునో అడుగుతున్నా. మీ భిక్షను స్వీకరిస్తున్నా. ఇవన్నీ వస్తురూపేణ, ధనరూపేణ స్వీకరిస్తున్నా., ఇవేకాకుండా రోజూ పిడికెడు బియ్యాన్ని ఒక పాత్రలో వేయండి. ప్రసాదం వండి వైద్యాలయాలకు తీసికొని వెళ్ళి పంచండి, చెరువులను, బావులను త్రవ్వండి మొదలైనవి చెబుతున్నా. ఇట్లా ఉండగా మీతో నాకు సంబంధం త్రెంపేసుకోనా?

## ఆశీర్వాద బలం

తపశ్శక్తి కలవారి ఆశీర్వాదం పనిచేస్తుంది. ఇతరులాశీర్వదించినా కొద్దిపాటి మేలు జరగవచ్చు. ప్రతి సద్భావనకూ ఎంతోకొంత శక్తి యుంటుంది.

దేనితోనూ సంబంధం లేకుండా తపశ్శక్తియే ధనం కలవారి సన్నిధిలో వారు సంకల్పించకపోయినా వారి సన్నిధే మంచినిస్తుంది. మిగల ముగ్గిన పండు చిట్లగా అందు రసం స్రవించదా?

సానుభూతి లేనివారు అందరి విషయాలను పట్టించుకొంటే మళ్ళీ సంసార కూపంలో పడిపోతారు. అట్టి బాధనుండి తప్పించుకోవడం కోసం ఆత్మవిచారానికి భంగం లేకుండా చేయవలసిన సంఘ కార్యక్రమాలలో హద్దులు మీరకుండా ఉండగలిగితే మా ఆశీర్వాదం ఫలిస్తుంది.

## ఆశీస్సులకు ఆధారం నారాయణుడే

అయినా నారాయణుడే అన్నిటికీ ఆధారమని మేము మరిచిపోరాదు. అతని ఆజ్ఞ లేనిదే ఒక్క అణువైనా కదలనపుడు అతడనుగ్రహిస్తే నే ఆశీర్వాదం ఫలిస్తుంది. కనుక మీ నమస్కారాలతొ మాకేమి సంబంధం లేదనుకోకూడదు. మా ఆశీర్వాదం వల్లనే అన్నీ జరుగుతున్నాయని మేమనుకోకూడదు.

అందువల్ల నారాయణ స్మరణ చేస్తున్నాం. మానసికంగా స్మరిస్తున్నా, స్వామి! వీరి పట్ల దయ చూపించమని వేడుకొంటాం.

## చేతినెత్తుట - ఆశీర్వాదమే

ఇతరులు నమస్కరిస్తే మేము అంజలి ముద్ర పట్టకూడదు. మీరు ఆశీర్వాదాన్ని కోరుతారు కదా!

నారాయణుడు కనబడడు కనుక మహాత్ముల దగ్గరకు ఆశీర్వాదానికి వెడతారు. నారాయణుడిచ్చే ఆశీర్వాదమూ కనబడదు.

సంప్రదాయం తెలిసినవారు, మమ్మల్ని నారాయణుని ప్రతినిధులుగా భావించి మాకు నమస్కరిస్తే నారాయణునకే చెందుతుందని, నారాయణుని ద్వారానే తమకు ఆశీర్వాదముంటుందని భావించి నమోనారాయణ అని అంటారు. అష్టాక్షరి మంత్రం ఉపదేశింపబడినవారు ప్రణవాన్ని చేర్చి జపిస్తారు. పైవిధంగా నమోనారాయణ అనడం అలవాటులో లేదు. నమస్కారం పెట్టినవాడు నమోనారాయణ అంటే నమస్కారాన్ని స్వీకరించినవారికి ఆ నామం గుర్తుకు వస్తుంది కదా!

ఆశీస్సులని మేము పల్కము. నారాయణ అనే అంటాం. మేము చేయి నెత్తడం వల్ల మా నమస్కారం స్వీకరించారని భక్తులకొక తృప్తి కల్గుతుంది. అదే ఆశీర్వచనానికి గుర్తు.

## ప్రార్థనలు - భక్తుల విశ్వాసం

చాలాకాలం నుండి మీరు వచ్చి నమస్కరిస్తున్నారు. నేను మీకు మంచి జరగాలని స్వామిని ప్రార్థిస్తున్నా. మీకు మంచి జరిగితే అది మీ విశ్వాసం వల్లనే జరిగింది. నా ప్రయత్నం కంటె కూడా నా పట్ల మీరు చూపిన విశ్వాసానికి తగ్గట్లు నేను ప్రవర్తిస్తున్నానా అని ఆశ్చర్యపోతూ ఉంటాను.

అందువల్లనే మీ విశ్వాసమే ఫలిస్తోందని అంటున్నా. మీరు నా ఆశీర్వాదమింత మంచి పని చేసిందని భావిస్తున్నారు. అంతా నారాయణానుగ్రహమే.

మేము ఆశీర్వదించేటపుడు చాలా జాగరూకులమై యుండాలని మరల చెబుతున్నా

## ఉన్నత స్థితి

ఇక్కడ పీఠం అనే ఒక స్థానం ఉండడం వల్ల మేమూ ఒక కూలివాడు సామాన్లు మోసినట్లుగా ఉన్నాం. మీరు మాకు నమస్కరిస్తూ ఉంటే మనస్సుతో ఆ నమస్కారాన్ని మోసి మా ప్రార్థనను జోడించి మీ బదులు నారాయణునకు చేరవేస్తున్నాం. ఒక కూలివాడు ఇతరుల వస్తువులను చేర్చమన్న చోటునకు చేరుస్తాడు కదా! అట్లాగే మీ నమస్కారాల బరువును నారాయణుని పాదపద్మాల దగ్గర మేము చేరిస్తే మేము చేసే పనిపట్ల నారాయణుడు ప్రీతి చూపిస్తాడు.

విద్యారణ్యులు సన్న్యాసులను ఒక మహాభారత శ్లోకంతో హెచ్చరించారు. **సమ్మానాన్ మరణాదివ.** తన గొప్పదనం వల్లనే గౌరవం చూపిస్తున్నారని సన్న్యాసి తలిస్తే అదొక పతనం. గౌరవాన్ని ఆశించడం మరణంతో సమానమన్నారు. అంతకంటే భయంకరంగా "నరకాదివ" అన్నారు. నరకం ఇంకా క్రూరంగా ఉంటుంది కదా! (సమ్మానాన్ని విషంగా, అవమానాన్ని అమృతంగా స్వీకరించాలని మనువన్నాడు).

ఈ మాటలు నిజమైన సన్న్యాసి పట్లనే. సంఘంతో సంగాన్ని పాములా చూడాలట. పామును చూసి పరుగెత్తుకొని పోతాం కదా.

**అహేరివ గణాత్ భీతః సమ్మానాన్ మరణాదివ**

కాని మేము సంఘం మధ్యలో ఉండి సంఘ శ్రేయస్సు కోసం కొన్ని పనులు చేయాలి. పీఠానికి తగ్గట్టు మర్యాదలుండాలని మావంటి వారంటున్నారు కదా! పీఠ మర్యాదను మీరూ పాటించాలి.

ఇట్టి కొన్ని కట్టుబాట్లు తప్పవు. శిష్యుడు గురువుపట్ల ఎట్టి వినయాన్ని, విధేయతను పాటిస్తాడో దానికి తగ్గట్లు గుర్వనుగ్రహమూ ఉంటుంది. కనుక వారు సత్కరించడమూ ఉంటుంది. మేము నివారించకుండా స్వీకరించడమూ ఉంటుంది.

సమ్మానంలో గౌరవానికి ఏ ప్రాధాన్యం. డబ్బు మాట తరువాత. తమిళనాడులో డబ్బునీయడమే సమ్మానంగా భావిస్తున్నారు. ఉత్తర దేశంలో గౌరవానికే ప్రాధాన్యమిస్తారు. కాళిదాస సమ్మాన్ అని వింటున్నాం. ప్రభుత్వమే ఖర్చు పెడుతుంది.

నావంటివారు మీ సమ్మానాన్ని అడ్డుకొనలేకపోతున్నాం. నిరాకరించడమూ లేదు. మేము స్వీకరించడమూ కూడదు. పరస్పర విరుద్ధంగా ఉన్నాయి ఎట్లా?

ఇంతకుముందు చెప్పినట్లు శిష్యులు గురువునకు సమ్మానం చేసినట్లుండగా మేము స్వీకరిస్తున్నట్లు కనబడాలి, అపుడు మీకు తృప్తి కలుగుతుంది. ఇది ఒక నాటకం మాదిరిగా కనబడుతుంది. ఇదొక ఆచారంగా మేము భావించాలే గాని మేము సమ్మానింపబడినట్లు భావిస్తే మాకు అధోగతే. నారాయణ స్మరణతోనే మేము స్వీకరించాలి.

ఎట్లా చేసినా సమ్మానమే. అదృష్టవశాత్తు మాకు మీరిచ్చే బిరుదులుండవు. ఎందుకంటే పీఠాధిపతులం కనుక. భగవానునకు బిరుదులిస్తామా? గురువును బిరుదులతో సత్కరిస్తారా? కనుక సమ్మానం ధనరూపంలో ఉంటుంది. మఠ నిర్వహణకు డబ్బు కావాలి కదా! నడిపేవాడు నారాయణుడే. అయినా ఆయన కొరకే ఈ మఠం ఉంది కనుక మీ సమ్మానాలను అంగీకరించక తప్పదు. అనగా ధబ్బును, మీరీయకపోతే భిక్షమెత్తి అడగడానికి మాకు హక్కు ఉంది.

కూలివాడు బాధతో బరువును మోస్తాడు. మేము సంతోషంతో భారాన్ని మోసి స్వామికి అర్పిస్తాం. చేరువేసేటంతవరకు భారమే. స్వామికి ఈయకపోతే

పాపాన్ని మూటగట్టుకొన్నవాళ్ళమౌతాము. కనుక నమస్కారాన్ని స్వీకరించిన వానికి ఎన్నో కష్టాలు.

## నమస్కరించేవాడు అదృష్టవంతుడు

నమస్కారం పెట్టినవాడే అదృష్టవంతుడు. కారణమేమంటే తన బరువును దించుకొంటున్నాడు కనుక. నమస్కారం స్వీకరించినవాడు తన భారం మోస్తాడని నమ్ముతున్నాడు. నమమ=నాది కాదు అనే మాట నమః అయింది. ఆ భావంతో నమస్కరించాలి.

అయితే అందరూ అట్టి భావంతో చేస్తున్నారా? అంటే లేదనే చెప్పాలి.

ఇట్లా నమస్కరించే భాగ్యం నాకు లేదు. పీఠాధిరోహణమే నాకా అవకాశాన్ని ఈయలేదు.

## సన్యాసి చేయు నమస్కారం

నమస్కారం పెట్టాడా లేదా అని జీవన్ముక్తుడు పట్టించుకోడు. తానొకనికి నమస్కరించాలా అని కూడా ఉండదు. కారణమేమంటే తనకు ఇతరులకు మధ్య భేదభావాన్ని చూడడు కనుక.

ఇట్లా ఉండగా శంకరులు ప్రణామేత్ కం = ఎవనికి నమస్కరించాలని ప్రశ్న వేసారు.

**నా మాదిభ్యః పరే భూమ్ని స్వారాజ్యే చేతః స్థితేఽద్వయే**
**ప్రణామేత్ కం తథాత్మజ్ఞాన కార్యం కర్మణా తదా**

తా: అద్వయమైన ఆత్మను తెలిసికొనినవానికి నామం, దేశాకాలాతీతునికి స్వతంత్ర భూమికలలో సంచరించువానికి కర్మలవల్ల పొందదగిన దేముంటుంది? బాహ్యమైనవే కర్మలన్నీ, తనకంటె భిన్నమైనది లేనపుడు కర్మనుండి ఏం లాభం పొందుతాడు? ఎవరికి నమస్కరించాలి?

అటువంటి జీవన్ముక్తులు ఎక్కడోగాని ఉండరు. అట్టి ఆత్మానుభూతికై సన్న్యాసులు ప్రయత్నిస్తారు. అట్టి మామూలు సన్న్యాసులు, దేవతామూర్తులకు, పూర్వాచార్యులకు నమస్కరిస్తూ ఉంటారు.

అయినా మేము సాష్టాంగ నమస్కారం మాత్రం చేయకూడదు. దండవందనం చేయాలి. దండాన్ని అంజలి ఆకారంలో ఒకరకంగా త్రిప్పాలి.

## దండంలో దాగిన తత్త్వం

దండం అంటే కఱ్ఱ. అయితే కేవలం కఱ్ఱ అని కాదు. అది పట్టు విడిచినపుడు తిన్నగా పడుతుంది. ఆ దండం జీవుని అహంకారాన్ని సూచిస్తుంది. చేతిలో ఉన్నపుడు అహంకారం పట్టి యుంటుంది. పట్టువిదలగా నేలపై పడుతుంది. అనగా పట్టు తప్పిన మనస్సు నేలపై పడింది. అట్టిది దండాకార నమస్కారం. ఆ భావం లేకపోతే నమస్కరించినా నమస్కరించనట్లే.

వ్యర్థమైన దానిని తమిళంలో దండం అంటారు. చెట్టు ముక్కలైతే కదా దండం ఏర్పడేది? చెట్టులో భాగమైనపుడు అందు జీవం ఉంటుంది. ముక్క అయినపుడు చనిపోయిన దానితో సమానమే కదా! అందువల్ల తమిళంలో ఆ ప్రయోగం ఏర్పడింది. మన శరీరంలోని ప్రాణం లేనపుడు ఇదీ దండమే అవుతుంది. ఈభావంతో దండాకారంగా నమస్కరిస్తూ శక్తి కలవారి ముందు భక్తులుంటారు.

శరీరాన్ని దండమనినపుడు, దానిని నియమించే మనస్సే నిజమైన దండము కావాలి. శరీరం ఒక పనిముట్టు మాత్రమే. భగవానుడే నన్ను నడిపిస్తున్నాడు, అతడే నాలో నిష్క్రియత్వం కల్గించి శాంతిని ప్రసాదించుగాక అని భక్తుడు భావించగలగాలి. అట్టి వంగిన మనస్సుతో నమస్కరించాలి. అనేక పాపాలు మనచే చేయించిన మనస్సు ప్రాయశ్చిత్తంగా శరీరాన్ని నేలపై పడునట్లు చేసి పుణ్యాన్ని సంపాదించుకోవాలి. కనుక మనస్సునే దండంగా భావించాలి.

నా శక్తి పని చేయడానికి నీ శక్తియే కారణమని, దానిని నీకు అర్పిస్తున్నాననే భావం ఉండాలి.

## సన్యాసి తీసికొని వెళ్ళే దండం

దండం మనస్సును నిగ్రహించుటను సూచిస్తుంది. ఇతరులను కొట్టడానికో, భయపెట్టడానికో ఉపయోగం పడుతుంది. శత్రువులను నిలవరించడానికి, ప్రజలను ఒక క్రమపద్ధతిలో తీర్చిదిద్దేది కనుక, రాజనీతిని దండనీతియని అంటారు.

అట్లాగే మనోనిగ్రహాన్ని సూచిస్తుంది మాకీ దండం. ఇది కేవలం ఒక ప్రతీక కాదు. గురువు, అందు మంత్రశక్తిని నిక్షేపించి శిష్యునకిస్తాడు. దానివల్ల శిష్యుడు మనోనిగ్రహాన్ని కలిగియుంటాడు.

బాహ్య ప్రపంచంలో యంత్రాలవల్ల ఏ ఉపయోగాన్ని పొందుతున్నామో అదే మంత్రశక్తి వల్ల పొందవచ్చు. విద్యుత్తును చేతితో తాకినపుడు ప్రమాదం. అదే కర్రతో కదిపితే ప్రమాదం లేదు. అట్లాగే ఇంద్రియ ఘాతాన్ని తప్పించుకోవాలంటే ఈ దండమట్లా ఉపయోగిస్తుంది. మా విషయంలో ఈ దండం మనస్సునకు ఒక ప్రతీక. ఇది మనస్సునకు ఒక కవచం వంటిది కూడా. కనుక భగవానునకు, పూర్వాచార్యులకు దండాకారంగా అర్పిస్తాం. వినయాన్ని సూచించే కేవల సాష్టాంగ నమస్కారం మాత్రం కాదు.

## వినయం యొక్క పరిపూర్ణత

దేవతలకు అమితశక్తి యున్నట్లే మహాపురుషులకు, దైవీశక్తి యుంటుందని భావిస్తాం. వారినీ భగవత్ స్వరూపులుగా మనం భావించినపుడు అన్నివేళలా దైవత్వాన్ని చూడలేం. మామూలు మనుష్యుల మాదిరిగానే కొన్ని సందర్భాలలో వారూ ప్రవర్తిస్తూ ఉంటారు కనుక. అయినా వారికి నమస్కరించడం, మనలోని వినయాన్ని సూచిస్తుంది.

## బ్రతికి యున్న మహాత్ముల పట్ల గౌరవం

ప్రస్తుతం ఉన్న మహాత్ములకంటె దేవతా మూర్తులపట్ల, పూర్వ మహాత్ముల పట్ల గొప్ప గౌరవాన్ని చూపిస్తాం. దేవతామూర్తుల పట్ల గొప్ప గౌరవం చూపించడం కంటె భక్తినే ఎక్కువగా చూపిస్తాం. భక్తిని నిర్వచించడం కష్టం. అది ప్రేమ మొదలైన అనేక భావాలతో ఉంటుంది. భగవానుని పట్ల భక్తి ఎందుకు చూపిస్తున్నామో అది మన బుద్ధికి అందనిదిగా ఉంటుంది. గౌరవం, ఒక మూల దాగేయుంటుంది. అది లేకపోవచ్చు కూడా. దేవతల పట్ల మనం ఎక్కువగా స్వాతంత్ర్యం చూపించి నిందాస్తుతులను కూడా చేస్తాం. అనగా పైపైన నింద, లోలోన స్తుతి ఉంటుంది.

పూర్వ మహాత్ములపట్ల ఇట్లా చేయం. కేవలం గౌరవ భావంతోనే యుంటాం. దేవతల పట్ల చూపించే గౌరవం కంటె ఎక్కువగానే చూపిస్తాం. అది ముఖ్యమైనా వారిపట్ల భక్తి కూడా ఒక మూల దాగియుంటుంది.

బ్రతికియున్న మహాత్ములపట్ల గౌరవాన్ని ఎక్కువగా చూపిస్తాం. ప్రేమ, చనువు మొదలైనవాని కంటె గౌరవానికే అధిక ప్రాధాన్యనమిస్తాం.

అది అధ్యాత్మిక రంగంలోనే కాదు, గొప్ప రాజకీయ నాయకులు, బుద్ధిమంతుల, కళాకారుల పట్ల కూడా గౌరవానికే అధిక ప్రాధాన్యం ఉంటుంది.

దేవతల పట్ల గౌరవం చూపించడంలో పెద్ద విశేషం లేదు. పూర్వ మహాత్ములు గొప్పవారే అంటూ పెద్దగా పట్టించుకోం. మావంటివారిని చూచినపుడు, ఏదో ఒక రంగంలో గొప్పవారని మనం వారికంటె తక్కువ వారమనే భావనతో ఉండడం వల్ల వినయంతో నమస్కరిస్తూ ఉంటారు.

## నా దురదృష్టం

ఇతర సన్న్యాసులకున్న అదృష్టం నాకు దక్కలేదు. ఒక సన్న్యాసి మరొక సన్న్యాసిని కలిసినపుడు నమస్కరిస్తాడు. ఇది వయస్సును బట్టి కాదు. ఎవరు ఎక్కువ వ్యాస పూజలు చేస్తే వారికే నమస్కారం.

ఆషాఢమాసంలో వ్యాసపూజ ఉంటుంది. 20 ఏళ్ళ సన్న్యాసి 30వ ఏడు వచ్చేటప్పటికి పదిసార్లు చేస్తాడు. ఉద్యోగ విరమణ చేసిన తరువాత సన్న్యాసం పుచ్చుకుంటే ఒకమారు వ్యాసపూజ చేసినవాడు, వయస్సులో పెద్దవాడైనా చిన్నవయస్సులో ఎక్కువ వ్యాసపూజలు చేసినవానికి నమస్కరించాలి.

నేను సన్న్యాసం పుచ్చుకొన్న తర్వాత ఎందరినో ఎక్కువగా వ్యాసపూజలు చేసినవారిని కలుసుకొన్నా. అయినా నేను వారికి నమస్కరించలేకపోయాను. జగద్గురు పీఠం అడ్డం వచ్చింది. ఈ పదాన్ని సమస్త జగత్తును గురువుగా భావించుట అనే అర్థంలో గ్రహించినా మతం సంప్రదాయం ప్రకారం జగత్తులోని శిష్యులందరకూ గురువైనవాడనే అర్థం రావడం వల్ల శిష్యులకు వందనం చేయకూడదు కనుక చేయలేకపోతున్నా.

మరొక దురదృష్టం. జగద్గురు బిరుదున్న మిగిలిన సన్న్యాసులు, వారి గురుస్వామికి నమస్కరించే భాగ్యం వారికి కలిగింది. నాకట్టి భాగ్యమూ దక్కలేదు. (స్వామివారి పూర్వాచార్యులు, స్వామివారిని పీఠాన్ని అధిరోహింప చేయడానికి ముందే సమాధిని పొందడం వల్ల అదీ కుదరలేదు)

## వినయం వృద్ధి పొందడానికి

ఇతరుల పట్ల భక్తి చూపించుటలో వినయానికే ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. ఇతరుల ముందు సాష్టాంగపడినపుడు ఇట్టి వినయాన్ని భావించగలగాలి. నమస్కార క్రియ ఎట్లాగూ ఉంటుంది. ఆ క్రియ ఈ భావాన్ని ఇంకా బలపరుస్తుంది కూడా. ఇది పరంపరాగతంగా వస్తోంది. వినయాన్ని క్రియలో ముంచి నిరూపించగలగాలి.

## మానవుని ఉత్థాన పతనాలు

సమస్త, జంతువులు అడ్డంగా ఎదుగుతాయి. మానవుడు మాత్రం నిలువుగా ఎదుగుతాడు. ఏమిటి దీని పరమార్థం? అన్నిటికంటె ఎప్పుడున్నతుడౌతాడు? ఇట్లా నిలువుగా ఎదిగానని గర్వపడితే అది పతనమే. ఉన్నతమైన భావాలు కలిగియుండాలనే భావంతో సృష్టికర్త ఇట్లా సృష్టించాడని మానవుడు భావించాలి. గర్వాన్ని పోగొట్టడం కోసమే నమస్కార ప్రక్రియ ఏర్పడింది. మామూలుగా నిలబడినపుడు ఎప్పుడైనా నేలమీద పడవచ్చు. కూర్చున్నవానికే దెబ్బలు తగలవచ్చు. కాని వినయంతో నేలమీద పడినవానికి జీవితంలో పతనావస్థ ఉండదు.

ఎత్తుమీద నుండి పడితే ఎక్కువ ప్రమాదం. అట్లాగే డబ్బు, అధికారం మొదలైనవాటి వల్ల ఉన్నత స్థితికి వచ్చినవాడు నైతికంగా – పతనమైతే ఇక మళ్ళీ కోలుకోవడం అంటూ ఉండదు.

## అహంకార నిర్మూలనకై తలవంచుట

అతణ్ని లోకం ఏమనుకుంటుందో అనే దానిని ప్రక్కన పెట్టండి. అతని ప్రవృత్తి శాంతినిస్తోందా? తృప్తినిస్తోందా? నెత్తిపై బరువు దించుకొన్నప్పుడు తేలికగా ఉంటుంది. మనకున్నది మామూలు బరువు కాదు. బాధలే బరువులు. అహంకారం, ఆత్మస్తుతి, తలబిరుసుదనం అనే బరువుల భారం ఎక్కువ. వీటిని దింపగలిగితే తృప్తి కలుగుతుంది. దీనికి నమస్కారమే విరుగుడు. ఇపుడు తలకు ప్రాధాన్యం ఈయడం లేదు. మనలను తల దించుకొనేటట్లు ఇతరులు చేస్తే అది మనకు తలవంపు. మనంత మనమే తల దించితే అది వినయం యొక్క ఫలం. తల దించుకుని ఎందుకు నమస్కరిస్తారు?

తల దించుకొని అటూ ఇటూ చూడకుండా ఏకాగ్రతతో నమస్కరిస్తాం. బాహ్య విషయాలపై తగుల్కొనే ఇంద్రియాలన్నీ శరీరం ముందే ఉన్నాయి. వాటినన్నిటినీ దించుతున్నామన్నమాట.

తల దించుకుని నేలమీద పడడం, వీపు చూపించటం అగౌరవం కావచ్చు. లోపల అహంకారం ఉన్నపుడు మాత్రమే గౌరవం గురించి పట్టించుకొంటాం. నేను అనే అహంకారం లేనపుడు గౌరవమూ లేదు, అగౌరవమూ లేదు. ఎప్పుడైతే లేదో జీవన్ముక్తులమే అవుతాం. అట్టి స్థితిలో నమస్కారం యొక్క ఆవశ్యకత లేదు.

ఈ అహంకారాన్ని అణచిపెడుతున్నాం. కొన్నిచోట్ల విడిచి వేస్తున్నాం. ఎక్కడ? దేవసన్నిధిలో, మహాత్ముల సన్నిధిలో. అపుడు గౌరవాన్ని ఆశించం. అపుడు వీపు చూపించైనా నేలమీద పడతాం.

పెద్దలకు ఎదురుగా నిలబడినపుడు వీపు చూపించం. వారిని విడిచిపెట్టి వెళ్ళేటపుడు కూడా చూపించకుండా ఉండడానికి ప్రయత్నిస్తాం.

ధ్యానంలో నిటారుగా కూర్చోవాలి. తలకూడా వంచకూడదు. పరిపక్వత లేని మనస్సు కలవారికి నమస్కారమే అసలైన మందు.

ఎత్తుగా నున్నచోట నీరు నిలవదు. పల్లంగా ఉన్నపుడు మాత్రమే. అనగా మనం వంగినపుడు మాత్రమే అనుగ్రహమనే వర్షం కురిసి నిలవ ఉంటుంది.

## సాష్టాంగ నమస్కారం

ఇందు ఎనిమిది అంగాలు, నేలను తాకుతాయి. నుదురు, భుజాలు, వక్షఃస్థలం, ఉదరము, రెండు కాళ్ళు - అప్పుడది సాష్టాంగం.

ఒక అభిప్రాయం ప్రకారం తల, చిబుకం రెండు చెవులు, రెండు చేతులు, రెండు కాళ్ళు. తల నేలను తాకినపుడు చిబుకం తగలదు. ఒక సమయంలో ఒకటే తాకుతుంది. ఇక చెవులెట్లా తాకుతాయి? తలను అటూ ఇటూ త్రిప్పి చెవులను తాకేటట్లు చేయవలసి వస్తుంది.

ముందు తల, నేలను తగులట. మొత్తం శరీరం అంతా తాకాలంటే గుండె, కడుపు తగలాలి. అందే గుండె, ఊపిరితిత్తులు, జీర్ణావయవాలు,

ఇనవ్నీ మనం జీవించడానికి ప్రధాన అవయవాలు. అహంకారం బరువు పోగొట్టుకోవడానికి, జీవి నిలబడడానికి కారణమైన భాగాలను కూడా వంచాలి. అంటే తల.

మరొక పద్ధతి. వక్షఃస్థలం, కాళ్ళు తగిలిన తరువాత చేతులను వెనుకకు త్రిప్పి అరచేతులలో నుంచుట కూడా ఉంటుంది.

ఇంకా చాలా భేదాలున్నాయి. అన్నీ చెబితే చాలా భేదాలున్నాయని అసలు నమస్కారం పెట్టడమే మానివేస్తారు., ప్రసిద్ధమైన ప్రమాణాలను చూపిస్తాను.

**దోర్భ్యాం పద్భ్యాం జానుభ్యాం ఉరసా శిరసా దృశా**
**మనసా వచసా చేతి ప్రణామోఽష్టాంగమి తీరితం**

ఉమా మహేశ్వరులకు ఎట్లా నమస్కరించాలో చెప్పేటపుడు ఆపస్తంబుని మాటలను కొందరు పేర్కొన్నారు.

**ఉరసా శిరసా దృష్ట్యా వచసా మనసా తథా**

**పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే**

మొదటి శ్లోకార్థం: చేతులు, కాళ్ళు, మోకాళ్ళ సంధులు, వక్షస్సు, తల, కన్నులు, మనస్సు, వాక్కు

రెండవ శ్లోకార్థం : వక్షస్సు, తల, కన్నులు, వాక్కు, మనస్సు, కాళ్ళు, చేతులు, చెవులను ఆనించాలి.

రెండు శ్లోకాలలోను మనస్సు, వాక్కు, కన్నులు పేర్కొనబడ్డాయి. మనం మాట్లాడుతున్నది శరీరానికి సంబంధించిన సాష్టాంగ నమస్కారం గురించే కదా! మనస్సు, వాక్కు భాగాలెట్లా అవుతాయి? కన్నులను ఆన్చడం ఎలా?

ఇవి క్రియలో చేరవు. భావంలోనే. అంటే మనస్సును మానసికంగా వంచాలి. అట్లే వాక్కును నియమించాలి. కన్నుల ముందిష్టమైన రూపాన్ని ఊహించుకొని, అనగా భావించుకొని ఉండాలి.

ఈ మూడూ మినహాయిస్తే మిగిలినవి శరీరంలోని భాగాలే కదా!

ఒక లెక్క ప్రకారం ఈ ఐదు - రెండు చేతులు, రెండు కాళ్ళు, రెండు మోకాళ్ళు, వక్షస్సు, తల మరొక లెక్క ప్రకారం వక్షస్సు, తల, కాళ్ళు, చేతులు, చెవులు. ఈ రెండు లెక్కలలోను శరీరంలోని అష్టాంగాలూ వస్తాయి.

ఈ రెండు శ్లోకాలను పెద్దలు ప్రమాణంగానే స్వీకరించారు. రెండవ శ్లోకంలోని చెవులను తాకించడం అభ్యాసంలో ఉంది.

చెవి ముఖ్యమైనదే. వేదాలను శ్రుతులని అంటున్నాం. వినదగినవి కనుక అనే అర్థంలో. ఆకాశతత్వానికి తన్మాత్రయైన అనగా సూక్ష్మ రూపమైన శబ్దాన్ని చెవియే వినగలదు. ఆపైన చెవిలో గంగ యుంటుందని (కుడిచెవిలో) ప్రమాణం ఉంది. ప్రాణాయామం చేసేటపుడు ముక్కును పట్టుకొంటాం, విడిచిన గాలి తగలడం వల్ల ఆ దోషాన్ని పోగొట్టుకోవడం కోసం చివరగా చెవిని తాకుతారు. ఇక నేలనెట్లా తాకిస్తారు? నేలపై బడి తలను కుడివైపు త్రిప్పి కుడి చెవిని, ఎడమవైపు త్రిప్పి ఎడమచెవిని తాకిస్తారు.

ఇట్లా ఇది ఒక వ్యాయామం కూడా. సూర్య నమస్కారాలలో వ్యాయామం కూడా దాగియుంది కదా!

ఇట్లా చెవులను తాకించడం వీలు కాకపోతే ఇంతకుముందు చెప్పిన పద్ధతి, యనగా నుదురు, మూపులు, భుజాలు రెండు చేతులు, వక్షస్సు, కాళ్ళు అన్నిటా చేయవచ్చు.

తప్పు క్షమించుమనే అర్థం కూడా నమస్కారం వల్ల సిద్ధిస్తుంది. ఏదైనా మనం తప్పు చేసినా ఆ భగవానుడు క్షమిస్తాడు.

## పంచాంగ నమస్కారం - మాతృత్వం గొప్పదనం

పురుషుల మాదిరిగా స్త్రీలు సాష్టాంగ నమస్కారం చేయరు. వారు చేసేది పంచాంగ నమస్కారమే. మొత్తం శరీరాన్ని నేలపై ఆన్చడం మంచిదైనా

పూర్వులు మాతృత్వాన్ని గమనించారు. స్త్రీలందరూ అంబికా స్వరూపాలే కదా! గర్భంలో పిల్లను మోస్తోంది. పాలనిస్తోంది. అట్టి పనులు చేసే భాగాలు నేలకు తగులకూడదని వద్దన్నారు. పంచాంగం నమస్కారం చేసినపుడు వంగుతోంది. అది వినయాన్ని సూచిస్తుంది.

## వణక్కం

వణక్కం అంటే వంగుటయని తమిళంలో అర్థం. స్త్రీలు చేసేదే వణక్కం. పురుషులు కూడా తలను వంచి కాళ్ళను కొద్దిగా ఎత్తి చేసినా వణక్కమే. కాని స్త్రీలు చేసేదే నిజమైన వణక్కం.

నమస్కారంలోని 'నమ' కు కూడా వంగుట అనే అర్థం. నమ్ అనగా వంగుట. నమనం, దానినుండే వచ్చింది. ఈ అర్థంతో పరికిస్తే పంచాంగం, నిజమైన వణక్కం. సాష్టాంగంలో దండంలా పడియుండడం గమనిస్తాం.

## పురుషులు - పంచాంగ నమస్కారం

పురుషులు పంచాంగ నమస్కారం చేయకూడదని ఎక్కడా లేదు. ఉత్తర దేశంలో ఇట్లాగే చేస్తారు.

ధర్మశాస్త్రాలు రెంటినీ పురుషులకు విధించాయి. కొన్ని కల్పగ్రంథాలలో దేవతలకు, గురువునకు తల్లి దండ్రులకు, మహాత్ముల ఎదుటనే పురుషులు సాష్టాంగం చేయాలని మిగిలిన వారి పట్ల పంచాంగం చేయాలని ఉంది. కొన్ని కల్ప గ్రంథాలట్లా విధించలేదు. కనుక ఆచారం ప్రకారం నడవడం మంచిది.

ఇరుకైన ప్రదేశంలో ఒక మహాత్ముని సన్నిధి యుండగా సాష్టాంగం కుదరదు. అట్టి సందర్భంలో పంచాంగం చేయవచ్చు.

వణక్కం అని నోటితో చాలామంది అంటారు. ఈ పదం వినసొంపుగా ఉంటుంది.

## దేశభక్తి - ప్రాంతీయతత్వం

తమిళనాడులో తప్ప మిగిలిన ప్రాంతాలలో నమస్తే పదం వాడుకలో ఉంది. నమోనమః లో, శివ పంచాక్షరిలో నారాయణ అష్టాక్షరిలో నమః ఉంది. నమస్తే అనగా నీకు నమస్కారమని అర్థం. ద్రవిడ ప్రాంతాలలో కూడా అందరూ నమస్తే అంటున్నారే గాని, వారి వారి భాషా పదాలను వాడడం లేదు. కాని తమిళనాట ప్రజలు నమస్తే అనరు. తమిళనాడులోకూడా పూర్వం నమస్తే అనేవారు. ప్రాంతీయతత్వం ప్రబలిపోయి – ఆ సంస్కృత పదాన్ని ప్రజలు విసర్జించారు. బహుళ ప్రచారంలో, అన్ని ప్రాంతాలలోనున్న ఆచారాన్ని పనిగట్టుకొని తమిళులు విసర్జించడం బాగాలేదు.

మిగతా ప్రాంతాలవారు తమిళనాడు వచ్చి ఈ ప్రాంతాచారాన్ని మన్నిస్తున్నట్లు వారూ వణక్కం అంటున్నారు. లోలోపల ఇష్టపడకపోయినా మెప్పుకోసం అట్లా తమిళ పదాన్ని వాడుతూ ఉండగా తమిళులు గిరిగీసుకొని యున్నారేమిటని ఒకాయన నాతో అన్నాడు. అంతకంటె, అర్చన కూడా తమిళంలో సాగాలని పట్టుబట్టడం బాగా లేదన్నాడు.

## తమిళంలో అర్చన

తమిళులు, పట్టుబట్టినట్లు మిగతా ప్రాంతాలవారు తమ తమ భాషలలో అర్చన సాగాలని అనడం లేదు. ఎవ్వరూ సంస్కృతాన్ని మాతృభాషగా వాడడం లేదు. కాని మతగ్రంథాలు సంస్కృతంలోనే ఉన్నాయి. అర్చన అందులోనే అనాదిగా సాగుతోంది. ఆలయాలు ఒక ప్రాంతానికే పరిమితం కావు. అనేక ప్రాంతాలవారు వచ్చి దేవతలను పూజిస్తారు. అందుకే సంస్కృతం. అందరూ ఒక కుటుంబం అనే భావన దీనివల్ల కల్గుతోంది. జాతీయ సమైక్యం కోసమేనా కొన్ని సంప్రదాయాలను కాదనకూడదు.

రామేశ్వరం వెడితే సగం మంది ఉత్తర దేశం నుండి వచ్చిన

యాత్రికులుంటారు. ప్రయాణ సాధనాలు అందుబాటులో ఉండడం వల్ల తీర్థయాత్రలు ప్రబలంగానే ఉన్నాయి. జమ్మూకాశ్మీరులో ఉన్న వైష్ణవీ దేవి ఆలయమైనా దక్షిణ ప్రాంతంలోని రామేశ్వరమైనా భారతీయులందరూ పాల్గొంటారు. ఇట్లా ఉండగా ప్రాంతీయ భాషలని పట్టుబట్టడం బాగుందా? అని ఒక ఔత్తరాహుడన్నాడు.

నేనూ దీనినాలోచించి ఒక పరిష్కార మార్గాన్ని సూచించాను.

ఆగమ, తంత్రశాస్త్ర ప్రకారం అర్చన సాగాలి. కుంభాభిషేక సమయంలో శాస్త్రప్రకారం సంస్కృతంలో సాగవలసిందే. పూజా పద్ధతులను గమనిస్తే ప్రాంతీయ భాషలకు ఒక దశలో అవకాశం కల్పించవచ్చు. పూజలో అనేక ఉపచారాలుంటాయి. పంచోపచారమని గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యములు); షోడశోపచారాలని; చతుష్షష్టి (64) ఉపచారాలని ఉన్నాయి. పూజలో స్తోత్రాలను పఠించడం ఉంటుంది. పాటలు పాడుతారు. ఇట్టి పాటలు, పద్యాలు పాడే సందర్భంలో ప్రాంతీయ భాషలను కొనసాగించవచ్చు. అట్లే నృత్యం, ఒక ఉపచారం. అక్కడా ప్రాంతీయ భాషలను కొనసాగించ వచ్చు. కనుక సంస్కృతంలో అర్చన చేసి చివరగా ప్రాంతీయ భాషలను వాడి స్తోత్రాలు చేయవచ్చు.

ఉన్న సంస్కృతార్చనను విడిచి పెట్టకుండా తమిళార్చన చేయవచ్చు. పూర్తిగా సంస్కృతార్చనను నిషేధించనవసరం లేదు. మిగిలిన ప్రాంతాలవారు వస్తారనే భావనతో నైనా సంస్కృతంలో కొనసాగించాలని కోరిన వారిని దృష్టిలో పెట్టుకొని ఉన్న సంప్రదాయాన్ని కొనసాగిస్తూ అదనంగా తమిళంలో అర్చనను ప్రవేశపెట్టవచ్చు.

లేదా సంస్కృతంలోనే సాగాలంటే అట్లాగే చేయండి. తమిళంలోనే సాగాలనే వారి తృప్తి కోసం తమిళంలోనే సాగించినా అందరిపై ఒక విధానాన్ని రుద్దనవసరం ఉండదని అతనితో చెప్పాను.

అష్టోత్తర నామాలు (108), సహస్రానామాలూ పఠిస్తారు కదా! ఇట్లా అన్ని నామాలకు తమిళంలో అనువాదాన్ని ఇంకా చూడలేదు, వినలేదు కనుక తమిళంలోనే సాగాలనే వారి తృప్తి కోసం ఈ నామాలను ఏర్పాటు చేయాలి.

ఆ తమిళనామాలు కూడా పూర్వ మహాత్ములు వాడిన పదాలను వాడడం మంచిది. ఎందుకంటే వారి మాటలలో పవిత్రత, ప్రామాణిక భావం ఉంటాయి. ఈశ్వరానుభూతితో పల్కిన పల్కులవి.

అట్టి నామాలను సంగ్రహించండి. కొత్తగా సృష్టించడం కంటె అది కొంతమేలు.

శివనామాలను తేవారం, తిరువాచకం, తిరుమురైలనుండి గ్రహించండి. విష్ణునామాలను ఆళ్వారుల దివ్య ప్రబంధం నుండి స్వీకరించండి. అట్లాగే అమ్మవారి నామాలను అభిరామ భట్టర్ నుతించిన స్తోత్రాలనుండి స్వీకరించండి.

సంస్కృతంలో విష్ణు సహస్ర నామాలున్నాయి. వాటికి ఓంకారం చేరుస్తారు. కంఠస్థం చేసి కోవడానికి వీలుంటుంది. అర్చన సులభంగా సాగుతుంది.

తమిళంలో నామాలను తయారుచేసేటపుడు అనేక స్తోత్ర గ్రంథాలనుండి గ్రహించండి. ప్రాచీన కవుల కావ్యాలనుండి గాని, సంస్కృత నామాలను అనువాదాలను చేసి గాని గ్రహించండి. అట్లా చేస్తే సంప్రదాయాన్ని గౌరవించినట్లుంటుంది.

మన స్వల్ప బుద్ధితో తయారు చేసిన వాటిల్లో శక్తి యుంటుందా చెప్పండి.

మహాదేవ, దక్షిణామూర్తి, నవగ్రహాల స్తోత్రాలను తమిళ గ్రంథాలనుండి తీసిన పదాలతో నింపలేము. అటువంటప్పుడు సంస్కృత నామావళికే అనువాదం చేయవలసి వస్తుంది.

మనం చేసే అర్చన తమిళులకు అర్థం కావాలని, తమిళ పదాలుంటేనే అర్థం అవుతుందని అవతలివారు వాదిస్తారు. కాని సంస్కృత నామాలు అర్థమౌతాయి. ఎవరైనా కృత్రిమంగా తమిళ పదాలను సృష్టించినా ఆ కవులకు మాత్రమే అర్థమౌతాయి. అటువంటప్పుడు సంస్కృతాన్నే కొనసాగిద్దామని సామాన్యులంటారు.

కనుక ప్రజల మనోభావాలను గుర్తించి తమిళంలో, సంస్కృతంలో విద్వాంసులైనవారు తమిళంలోనే అందరికీ అర్థమయ్యే రీతిలో నామావళిని కూర్చండి.

అర్చన, భక్తితో కూడినది. ఇట్టి సందర్భంలో భాషా మమకారంతో ముడిపెట్టడం సబబుగా లేదు. భాషపట్ల పట్టుదల చూపు వారిపట్ల పరమేశ్వరుడు సద్బుద్ధిని ప్రసాదించుగాక!

ఇట్లా రకరకాల ప్రజలను పాలించే నారాయణునకు ఒక్క నమస్కారం పెడదాం.

## పరాక్రమం - వినయం

మన భావాలను నోటితోనే కాకుండా వివిధ భంగిమలతో వ్యక్తీకరిస్తుంటాం. నమస్కారమనేది మానసికంగా గౌరవించడంతోబాటు ఒక శారీరక ప్రక్రియ కూడా. ఈ క్రియ పంచాంగంలో స్పష్టంగా కన్పిస్తుందని, సాష్టాంగంలోనూ శరీరాన్ని వంచవలసి వస్తుందని చెప్పాను.

దీనిని Bowing అని ఆంగ్లంలో అంటారు. ధనుస్సు వంగియుంటుంది కదా! అట్టి వంగియుండడం నమస్కారంలోనూ ఉంది కదా!

నమస్కారం నుండే నమనం వచ్చినా ఆధ్యాత్మపరంగా విశేషార్థం దాగియుంది. అది శరణాగతిని సూచిస్తుంది. నాది కాదు, నేను చేసే అనుష్ఠాన ఫలం నాకు కాదు, నీకే చెందాలని తెలివిడి చేస్తుంది. ఈ శరీరం నాకు

కాదని నీకు అంకితం ఇస్తున్నాని నమస్కారంలో ఉంటుంది. న-మమ; నమః అయింది. క్రియద్వారా ఈ భావాన్ని నమస్కారం ద్వారా చూపిస్తున్నాం.

ప్రపంచం అంతా ఈ భావంతోనే ఉంది. ఎవరు, ఎక్కడ నమస్కరించినా ఇట్టిదే గోచరిస్తుంది. ఈ పద్ధతి వల్ల ప్రపంచ ప్రజలందరూ ఒక్క కుటుంబానికే చెందినవారు.

క్రైస్తవులు, మహమ్మదీయులు వంగి నమస్కరిస్తారు. మోకరిల్లి నమస్కరిస్తారు. దానిని Genuflection అని అంటారు.

మహమ్మదీయులు సలాం అంటారు. క్రైస్తవులు సెల్యూట్ అంటారు. ఈ రెండు పదాలలో సత్ ఉంది. ఇట్లా అందరిలో ఐకమత్యం ఉండడం సంతోషదాయకమే. మన మఠంలో శంకరుల పాదుకల దగ్గర సాయంకాలం రోజువారీ ఆదాయ వ్యయాలను చదువుతారు. దానిని దీపనమస్కారమంటారు. మఠంలోని ఏనుగు చెవులతో పాదుకలకు విసురుతుంది. దానిని Torch Light సలాం అనవచ్చు.

ఒక చేతితో నమస్కరించడం ఇతర దేశాలలో ఉండగా మన శాస్త్రాలు అట్టి పద్ధతిని అంగీకరించలేదు.

**ఏకహస్త ప్రణామశ్చ హంతి పుణ్యం పురాతనం**

అనగా ఒక చేతితో నమస్కరిస్తే పొందిన పుణ్యం హరించి పోతుందని అర్థం. సరియైన పద్ధతిలో చేస్తే పాపాలు పోతాయి.

కొన్ని సందర్భాలలో సెల్యూట్ చేయవలసి వస్తుంది. దీనినే కాదనలేము. సైన్యంలో, పోలీసు వ్యవస్థలో ఇట్టిదుంది. అందు జీవితాన్ని దేశానికి త్యాగం చేసే లక్షణం దాగియుంది. మనిషి నిటారుగా నిలబడి చేస్తాడు. ఇట్లా నిలబడడం వీరత్వానికి గుర్తు. కనుక ఇట్టి పద్ధతినీ కొన్ని సందర్భాలలో స్వీకరించాలి.

అట్లాగే వేషధారణ కూడా భిన్నంగా ఉంటుంది.

మహమ్మదీయులు నమస్కరించినపుడు కుడిచేతిని, కొద్దిగా శరీరాన్ని వంచుతారు. క్రైస్తవులు దైవపీఠము లేదా బలిపీఠము దగ్గర, మహాత్ముల దగ్గర మోకరిల్లుతారు. మిగిలిన సందర్భాలలో సెల్యూట్ చేస్తారు. సైన్యం మాత్రం నిటారుగా నిలబడే సెల్యూట్ చేస్తారు. బూట్లను టకటకలాడిస్తూ శబ్దంతో సెల్యూట్ చేస్తారు. ఇది నమస్కరించడమా? అధికారం చూపించడమా? అని ఆశ్చర్యపోతాం. కాని ఇది గౌరవ సూచకమే. పరాక్రమంతో, త్యాగబుద్ధితో మిళితమైంది. కనుక ఎవరు, ఎక్కడ నమస్కరించినా అది వినయభరితమే అని సారాంశం.

## విధేయత - శుశ్రూష

ఇక్కడ కూడా ప్రపంచ ప్రజలందరూ ఒక్కటే. విధేయతను ఆంగ్లంలో Obediance అంటారు. ఇది Obey అని లాటిన్ భాష నుండి వచ్చింది. అనగా ఏకాగ్రతతో వినుట. దానిన శుశ్రూష అని మనమంటాం. గురువునకు శుశ్రూష చేయాలంటారు. దాని అసలర్థం వినుటయే.

ఆంగ్లమైనా, సంస్కృతమైనా అర్థమొక్కటే. విధేయత తరువాత సేవ చేయుట సిద్ధించాయి. వినడం అంటే ఏది విన్నామో దానిని ఆచరణలో పెట్టాలి కదా! పెద్దల మాటలను ఆచరణలో పెట్టినపుడే అది శుశ్రూష అవుతుంది. కేవలం వినడంతోనే సరిపుచ్చుకోకూడదు. గురువునకు ముందు నమస్కరించాలని, అతనినుండి ఉపదేశం పొందాలని, సేవ చేయాలని భగవానుని ఆదేశం.

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా (4.32)**

## ప్రణిపాతం (ప్రణామం)

ప్ర+ని+పాతం=ప్రణిపాతం. పాతం అనగా పడుట. 'ని' చేర్చుట వల్ల ఆ పదానికి ఊతం వస్తుంది. దానికి 'ప్ర' చేర్చారు. ఇంకా ఊనిక వచ్చింది.

చెట్టు కొమ్మను నరికితే అది వెంటనే నేలమీద పడినట్లు అహంకారాన్ని నిర్మూలించి నమస్కారం చేయాలన్నమాట. ఇది ముందు శిష్యుడు చేయాలి.

ఇది ప్రణామమే. ఉత్తర దేశంలో ప్రణామ్ అంటారు.

నమనం=వంగుటయే ప్రణామం. ప్రణామ్‌లో ఉన్న నామమ్, నమనానికి వికృతియే. అదే వణక్కం. నమస్కారంలో ఒక క్రియ ఉంది. దీనిని అభివాదనం అంటారు. ఏ గోత్రంలో జన్మించారో, ఏ సూత్రమో చెబుతారిందులో. ముందుగానే నమస్కరిస్తాం. తన్న పేరు చెప్పడానికి ముందు నమస్కరించిన తరువాత పేరు మొదలైనవి చెబుతారు.

## అభివాదనం

నమస్కరించేవాడు నమస్కరించడానికి ముందు తన గోత్ర వివరాలను ప్రకటించడం అభివాదనం అవుతుంది. పెద్దలు వచ్చినపుడు చిన్నవాని ప్రాణాలు పోతూ ఉండగా అభివాదనం చేస్తే తిరిగి ప్రాణం వస్తుందని మనువన్నాడు:

**ఊర్ధ్వం ప్రాణాః హ్యుత్క్రమంతి యూనః స్థవిర ఆయాతి**
**ప్రత్యుత్థానాఽభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే**

పెద్దలకు నమస్కరించేటపుడు అభివాదనం చేయాలని శాసనం.

ముందు నమస్కరించాలి. నిలబడి, వంగి, రెండు చెవులను చేతులతో పట్టుకొని అనగా ఎడమచేతితో ఎడమచెవిని; కుడిచేతితో కుడిచెవిని పట్టుకొని తనను తాను పరిచయం చేసికోవాలి. తరువాత పాదాలవరకు ఆ చేతులతో స్పృశించాలి. ఇట్లా సర్వార్పణ భావం కన్పిస్తుంది.

నమస్కార ప్రక్రియ, ఒక యోగవ్యాయామం వంటిది. నాడులను శుద్ధి చేస్తుంది. శరీరమంతా స్పృశించుట వల్ల మనస్సునూ శుద్ధి చేసినట్లౌతుంది. తరువాత నమస్కారం పొందేవాని పాదాలను పట్టుకోవాలి.

పాదాలెందుకు పట్టుకోవాలంటే హేతువును చెప్పలేం. అది భక్తి సూచకం. *(రిమోట్ కంట్రోల్ పాదాలలో ఉంటుందని, పాదంలో ఒక్కొక్క ప్రదేశం మిగిలిన శరీరావయవాలతో సంబంధం కల్గియుంటుందని నేటి శాస్త్రజ్ఞు లంటారు. బొమ్మలతో చూపిస్తారు.)*

తన చేతులతో ఇతరుల పాదాలను స్పృశించడం. ఆత్మతో కలిపే ఒక ఎలక్ట్రికల్ సర్క్యూట్ వంటిది. దక్షిణ దేశంలో పాదాలను స్పృశించకుండా దగ్గరగా చేతులనుంచుతారు. ఎందుకంటే అపవిత్రంగా ఉన్నవారు పవిత్రంగా మడిగా నున్నవారిని స్పృశించడం మంచిది కాదని కొద్ది దూరంలో పాదాల దగ్గ నేలను స్పృశిస్తారు. ఆపైన మన అపవిత్రలను ఇతరులకు అంటకట్టడ మెందుకు? అట్లా చేస్తే మన మానసిక అపవిత్రతలు అవతలి వ్యక్తికి సంక్రమిస్తాయి. ఒకనికి విద్యుద్ఘాతం జరిగినపుడు వానిని చేతులతో స్పృశించం కదా! మన పాపకర్మలను అతడు మోయడమెందుకు?

అయితే బాగా తపశ్శక్తి, యోగశక్తి కలవానిని స్పృశిస్తే మన కర్మలూ బూడిదౌతాయి కాని అట్టి వారెక్కడో గాని యుండరు.

ఇతరుల అంతశ్శక్తి మనకు తెలియదు కనుక పాదాలకు నమస్కరిస్తున్నట్లు చూపిస్తే చాలు.

భక్తి పారవశ్యంలో ఇతరుల పాదాలను స్పృశించడం, కౌగలించుకోవడం వేరు. భక్తి తీవ్రత దోషాలను పోగొట్టగలదు. అట్టి భక్తి తీవ్రత ఎక్కడోగాని ఉండదు. ఒక ఆవేశం, భక్తి కాదు. కనుక పాదాలను స్పృశించకుండా ఉండడమే మేలు.

మనం నమస్కరిస్తే అతడు ఆశీర్వదిస్తే మనకు శ్రేయస్సని భావిస్తాం. మనకు మంచి చేసేవానిక్కి మన చెడును సంక్రమింప చేయడం బాగుందా? ఎవరైనా తెలియక ఇట్లా చేస్తే చేయవచ్చు. ఇకనుండైనా ఇతరుల పాదాలను స్పృశించడం కూడదని అంటున్నాను. పీఠాధ్యక్షులను, మఠాధిపతులను

అట్లా స్పృశించకండి. భావంలో పవిత్రత, క్రియలో కంటే ముఖ్యం. కనుకనే జనార్దనుణ్ణి భావగ్రాహియని అన్నారు. అంతేనే కాని బాహ్యాగ్రాహి కాదు. మన భావాలను గ్రహిస్తాడు.

అతడాశీర్వదించినా ఆశీర్వదించకపోయినా ఇబ్బంది లేదు. ఆశీర్వదిం చాలనే భావన అతనిలో లేకపోవచ్చు. మన నమస్కారం పవిత్ర భావనతో ఉంటే నారాయణుడనుగ్రహిస్తాడు.

చేతులతో చెవిని స్పృశించి పాదాల వరకూ వాటిని తీసుకొని వచ్చి స్పృశించాలని అన్నాను. ఇతరులకు నమస్కరించేటపుడు చేతులను మడిచి చేయాలి. అంటే కత్తెర మాదిరిగా చేతుల నుంచాలి. సాధారణంగా ఇట్లా చేయడం లేదు. మన ఎడమచేతితో వారి ఎడమ పాదాన్ని మన కుడి చేతితో వారి కుడిపాదాన్ని స్పృశిస్తున్నట్లుగా కత్తెర మాదిరిగా చేతులనుంచి చేయాలన్నమాట.

**సవ్యేన సవ్యః సంపృష్టవ్యో దక్షిణేన చ దక్షిణః**
**కర్తరీమివవా** అని ఒక పుస్తకంలో ఉంది.

అభివాదనంలో గోత్రకర్తలను స్మరిస్తున్నాం. దానిని ప్రవర అని అంటారు. ఋషి యనగా మంత్రాన్ని విన్నవాడు. గోత్రంలో సాధారణంగా ముగ్గురు కాని ఐదుగురు కాని ఋషులుంటారు. అందు ముఖ్యునితో గోత్రనామం వ్యవహరింపబడుతుంది. ఉదా: కౌండిన్య గోత్రంలో కౌండిన్యుడు ముఖ్యుడు. ప్రవరలో సాధారణంగా తండ్రి, తరువాత అతని కొడుకు, తరువాత అతని కొడుకు ఉంటారు. కాని పితృ తర్పణంలో ముందు తండ్రికి, తరువాత అతని తండ్రికి, తరువాత అతని తండ్రికి తర్పణం ఇస్తాం.

వివాహంలో ప్రవర చెబుతారు. వధూవరులు భిన్న గోత్రాలకు చెందిన వారవుతారు. పై అభివాదనం పద్ధతిని, తర్పణ పద్ధతిని రెంటినీ కలిపి ఇక్కడుంటుంది. ముందుగా గోత్రం చెబుతారు. అందు తండ్రి, అతని కొడుకు,

అతని కొడుకు వరుసలో. తరువాత వంశంలో నున్నవారు. తర్పణంలో మాదిరిగా తండ్రి నుండి కాకుండా ముత్తాత, తాత, తండ్రులను స్మరిస్తారు. తర్పణంలో ప్రతి నామానికి గోత్రం కలిపే యుంటుంది. తర్పణంలో తండ్రి, తాత, ముత్తాత వరుస ఉంటుంది.

అభివాదనంలో అసలు ఋషిని ముందుగా చెబుతారు. గోత్రం చెబుతారు. తరువాత సూత్రం. ఆపస్తంబ మొదలైనవి. తరువాత వేదశాఖను చెబుతారు. ఏ వేదానికి ఎవరు చెందినవాడో ముందుగా ఆ వేదశాఖను అధ్యయనం చేయాలి. తరువాత పేరు చెప్పి భోః అని నమస్కారం అర్పిస్తారు.

ఇట్లా మాటిమాటికీ వేదసూత్ర ఋషి వంశాలను స్మరించుట శ్రేయస్కరం. ఇది మన ఔరసత్వాన్ని సూచిస్తుంది. ఒక స్ఫూర్తిని పొందుతాం. ఫలానా గోత్రానికి తగ్గట్లుగా ప్రవర్తించాలనే బుద్ధి పుడుతంది. తండ్రులకు, పెద్దలకు నమస్కరించినపుడైనా దీనిని చేయాలి.

ఇట్లా అభివాదనం చేయడంలో మన ఋషి వంశం చెప్పి నేను నీకు పరిచయం చేసుకొంటున్నానని చెబుతాడు. నేను నీ ఆశీర్వచనాన్ని కోరుకుంటున్నాననే భావన ఉంది.

ఆశీర్వాదమే ప్రతివచనం. దీనినే ప్రత్యభి వాదనమంటారు. ప్రత్యభివాదనం (ఆశీస్సు) ఎట్లా చేయాలో తెలియని వానికి నమస్కరించకూడదన్నారు. తనకంటె చిన్నవానిపేరు స్మరించి దీర్ఘాయుష్మాన్ భవ సౌమ్య అని అనాలి.

పడుకొని యున్నవానికి, జప, పూజ, హోమాలు చేస్తున్నవానికి, ఒకడు తలంటుకొని యున్నపుడు, పుష్పాక్షతలు, సమిధలు, నేయి ధరించి యున్నపుడు, నీటి పాత్రను ధరించి యున్నవానికి నమస్కరించరాదు.

కొందరికి నమస్కరించినా అభివాదనం చేయరాదు. అనగా అందరికీ గోత్ర ప్రవరలు చెబుతూ నమస్కరించుట కూడదు. సన్న్యాసుల ముందు, ఇంకా నాలుగైదు సందర్భాలలో అభివాదనం పనికిరాదు.

**దేవాన్ నదీం సభాం వృక్షం అగ్నీనపి తథాయతీన్**

**దండవత్ ప్రణమేత్ భూమౌ నాభివాదన మాచరేత్**

ఈ పైవారికి నమస్కరించాలి మాత్రమే. దేవతలకు అనగా ఆలయంలో, పూజామందిరాల దగ్గర, నదులకు (గంగపూజ, సముద్ర పూజ చేసేటపుడు) సభలలో, అభివాదనం పనికిరాదు. అట్లాగే అశ్వత్థ వృక్షాదుల ముందు, అగ్నిముందు పనికిరాదు.

తల్లిదగ్గరే అభివాదనం. ఇతర స్త్రీల దగ్గర అభివాదనం పనికిరాదు. ఇది ముందే చెబితే ఆధునిక స్త్రీలు నామీద కోప పడతారు. కనుక ముందు దేవాదులను చెప్పి వారికే లేదని జాగరూకతతో చెప్పాను. కనుక స్థాయిని బట్టి ఈ భేదం ఉండదు. పెద్దవారైన స్త్రీలందరికీ నమస్కారం పెట్టవచ్చు. అభివాదం, నమస్కారం తల్లికి మాత్రమే. ఇది పెద్దల ఆచారం కూడా. తల్లిపోయిన తరువాత అట్టి స్థానాన్ని గురుపత్నికి, పెద్దన్నగారి భార్యకు ఇచ్చారు.

అవతలి వ్యక్తి బాగా ఎత్తుగా నున్నచోట నున్నా, బాగా క్రింద నున్నా నమస్కరించకూడదు. గురు విషయంలో ఈ నియమం పాటించకూడదు.

కొన్ని వస్తువులు అవతలివాని చేతిలో నున్నపుడు నమస్కరించకూడదు అని చెప్పాను. పురుషులు పై వస్త్రం ధరించి నమస్కరించరాదు. మొలకు కట్టుకొని నమస్కరించాలి. అంటే శరీరాన్ని పూర్తిగా కప్పుకొని నమస్కరించకూడదు. గుండె నర్పిస్తున్నాననే భావనతో ఉంటాడు కనుక పై వస్త్రం లేకుండా చేయాలన్నారు. అటువంటప్పుడు చొక్కానే ధరించరు. నేటి కాలంలో కొంత ఉదారంగా ఉండక తప్పదు.

విద్యలో, కర్మానుష్ఠానంలో, జ్ఞానంలో తనకంటె అధికుడై చిన్న వయస్సులో ఉన్నవారికి నమస్కరించాలి. మిగతా సందర్భాలలో కనీసం మూడు సంవత్సరాలైనా పెద్దవాడై యున్నవానికి నమస్కరించాలి. అయితే లెక్కబెట్టి

నమస్కరించడం కాకుండా మనకంటే పెద్దవయస్సున్న వారికి నమస్కరించాలని అర్థం.

ఈ పద్ధతి వినయాన్ని సూచిస్తుంది.

## దేవనామానికి ముందు, వెనుక

తన పేరు చెప్పటం కంటె ముందుగా ప్రణామం చేయాలని అన్నాను కదా! దేవతల పేర్ల ముందు ఈ నమస్కారాలున్నాయి. ఎక్కడ?

మంత్రాలలో, పంచాక్షరిలో, అష్టాక్షరిలో నమః అని ముందుగా ఉంది. నారాయణాష్టాక్షరి, నమోతో ఆరంభం అవుతుంది. తరువాత నారాయణ పదం. మీరందించే నమస్కారాలను నారాయణునకు బదిలీ చేస్తాం మేము. పరమేశ్వరుడు – నమస్కారం ఇష్టపడతాడు. సాధారణంగా శివుడు అభిషేక ప్రియుడు. మహావిష్ణువు అలంకారప్రియుడు. విష్ణువు జగత్పాలకుడు కనుక మహారాజువలె కిరీటం, కుండలం, పట్టుబట్టలు ధరించి యుంటాడు. శివునకు మాటిమాటికీ నమస్కారాలు. యజుర్వేదంలోని నమక ప్రశ్నలలో ఉన్నాయి. దానిలో కావలసినన్ని నమో నమలున్నాయి. అందువల్లనే రుద్రాన్ని నమకమని అంటారు.

## సన్న్యాసికి అభివాదనం పనికిరాదు

శాస్త్రాలు కూడదన్నాయి. సన్న్యాసి ఎట్లా ఉండాలని చెప్పాను? నిర్నమస్కారం, నిరాశిషం అన్నాను కదా! ప్రజలు ఇష్టాన్ని బట్టి నమస్కరిస్తూ ఉంటారు. అది సరే! అభివాదనం కూడదన్నారు. ఎందుకంటే అతడు నిరంతరం ఆత్మవిచారంలో ఉండాలి కదా! ఎవరు, ఏ గోత్రం వాడు నమస్కరిస్తున్నాడో పట్టించుకోనవసరం లేదు. అందుకే మేము గురు పీఠాన్ని అలంకరించాము. కనుక మాకు అభివాదనం ఇతరులు చేయకూడదు.

ఇది తెలియక మా దగ్గరకు కొందరు వచ్చి అభివాదయే అని అంటారు. పక్కనున్నవారు. కూడదు కూడదని హెచ్చరిస్తూ ఉంటారు. అభివాదనంలో ఋషులు, గోత్రం, సూత్రం, వేదం వస్తూ ఉంటాయి కదా! ఇవన్నీ సన్న్యాసికి అక్కర లేకపోయిందేమిటని నవ్వుతూ ఉంటాను. కాని శాస్త్రవాక్కుని పాటించవలసిందే. అభివాదనంలోని అంశాలను నేను విడిగా అడిగి తెలిసికొంటాను. ఈ ప్రవరను వినడానికి బదులు అట్లా చేస్తూ ఉంటాను. మీ బంధువులు, వృత్తి మొదలైనవి అడిగి తెలిసి కొంటాను. వేదం, ఋషులకు బదులుగా ఫలానా వ్యక్తి మీకేమవుతాడని అడుగుతాను. దీనివల్ల నా స్మరణశక్తి వృద్ధి పొందుతుంది. ఇట్లా పరోక్షంగా గోత్ర సూత్రాలను విచారిస్తున్నాను.

ఏం చేయాలి? మఠంతో ఎంతో ఎందరికో సంబంధం ఉంది. ధర్మపాలనకై డబ్బును ఖర్చు పెడుతున్నారు. ఇట్లా మాకూ మీకూ సంబంధం ఉంది. వారి సంగతులను వాకబు చేస్తే వారికే తృప్తి కల్గుతుంది. మఠాధిపతి, ఏమీ పట్టించుకోకపోతే వచ్చిపోయే వ్యక్తులకు మఠంతో ఏ సంబంధం ఉంటుంది? వాళ్ళూ మా మఠాన్ని పట్టించుకోరుగదా!

అయితే వారు పోషిస్తారని మఠం వృద్ధి పొందుతుందనే భావన మాకుందని భావించకండి. వచ్చినవారికి ధర్మబోధ చేయడం మా కర్తవ్యం. ఇది పాటిస్తే శిష్యులపట్ల అనురాగం ఏర్పడుతుంది. వారిపై వాత్సల్యం చూపించటమూ జరుగుతుంది. ఏదో మనసులో పెట్టుకొని బంధాన్ని ఏర్పరచుకోము.

## అంజలి - చేతులు కలుపుట

గౌరవం ఎట్లా చూపించాలో అనేక పద్ధతుల్ని వివరించాను. మరొక ముఖ్య విషయాన్ని ప్రస్తావిస్తాను. ముఖ్యంగా విదేశీయులు వచ్చినపుడు అంజలించుట మన సంప్రదాయం. గౌరవ భావమే కాక, గౌరవించడానికి అర్హత లేనివానికి కూడా శుభాకాంక్షలను పల్కుటను గమనించండి. దేవ సన్నిధిలో అంజలించుట రానురాను శుభాకాంక్షలకు సంకేతమై అలవాటుగా

మారింది. పెద్దవానికి అంజలిస్తాం. తిరిగి అతడు అంజలిస్తున్నాడు. అంజలి ముద్రను పట్టేటప్పుడు నమస్తే అనడం ఉత్తరదేశ ఆచారమని, దక్షిణ దేశంలో వణక్కం అంటారని చెప్పాను.

చిన్న పిల్లలు కనబడినపుడు అంజలి పట్టరు. పెద్దవారికే అంజలి ముద్ర. మధ్య వయస్సులో వున్నవారు అంజలిస్తారు.

పాశ్చాత్యులు దీనికి భిన్నంగా వ్యవహరిస్తారు. వారు చేతులు కలుపుతారు. వయస్సుతో కూడా నిమిత్తం లేదు. ఇది శుభాకాంక్షాసూచకం. వారు మోకరిల్లినా, సెల్యూట్ చేసినా పరస్పరం చేతులు కలుపుతారు. స్థాయిని బట్టి గాక చేతులను కలిపి కౌగలించుకొని ముద్దు కూడా పెట్టుకొంటారు.

కౌగిలింతలు ముద్దులు మనదేశంలో లేవు. కౌగిలింత మాత్రం ఉత్తరదేశంలో ఉంది. దక్షిణ దేశంలో సదాచారం దీనిని అంగీకరించదు. ప్రాచీన సాహిత్యం పరికిస్తే కర్మానుష్ఠాన పరులు కూడా మగవాళ్ళు మగవాళ్ళను కౌగలించుకోవడం ఉంది. అట్లే ఆడవాళ్ళు, ఆడవాళ్ళను, స్నేహితులు కౌగలించుకోవడం మనం చూస్తున్నదే. పెద్దవాళ్ళు చిన్నపిల్లలను తొడపై కూర్చోపెట్టుకోవడమూ ఉంది.

కాని ముద్దుపెట్టుకోవడం లేదు. మన ఆచారం, నడవడి దానికి అంగీకరించదు.

చేతులు కలపడమూ లేదు. చేతులు చాచి స్వాగతం పల్కుతాం. రామ సుగ్రీవులు కలిసినపుడు స్నేహబంధానికి ముందు

**రోచతే యది వా సఖ్యం బాహురేషా ప్రసారి తాః**

**గృహ్యతాం పాణినా పాణిః మర్యాదా బాధ్యతాం ధ్రువా**

తా: నీవు నాతో సఖ్యం చేయదలుచుకొంటే ఇవిగో నా చాచిన చేతులు. నీ చేతులతో పట్టుకో. అందువల్ల పరస్పర అంగీకారం రక్షింపబడుతుంది.

పనులలో చేయి ప్రధాన సాధనం. అన్ని దేశాలలో ఒకరి చేతిని మరొక చేతితో స్పృశించినపుడు ఏదీ దాచనని, ఇబ్బంది కల్గించననే భావం తొంగి చూస్తోంది. అతడు నా కుడి భుజంరా అని అంటూ ఉంటాం కదా!

నమస్కరించేటపుడు అవతలి వ్యక్తి పాదాలను స్పృశించుట దక్షిణ దేశంలో కంటె ఉత్తర దేశంలో ఉంది. కలి వృద్ధి అయినకొలదీ బాహ్యమైన కశ్మలంతో బాటు మానవ మనస్సులలో కశ్మల భావాలూ, వృద్ధి పొందుతున్నాయి. దోషాలున్న వ్యక్తి స్పృశించినపుడు దీని ప్రభావం అవతలి వ్యక్తిపై తప్పక ఉంటుంది. నూటికి నూరుపాళ్ళు పవిత్రంగా ఉన్నవారిని స్పృశిస్తే అవతలి వ్యక్తిలో దోషాలున్నా అతని దోషాన్ని పోగొట్టగలడు. కాని ఒక సాంక్రమిక రోగం ఉన్నవాడు స్పృశిస్తే అతని రోగం ఇతరులకు ప్రాకదా? ఆరోగ్యవంతులెందరు వానిని స్పృశించినా వాని రోగాన్ని పోగొట్టలేరు కదా! ఒక కుళ్ళిన పండు సెజ్జలో ఉంటే మిగిలిన పళ్ళూ పాడైపోతాయి. అట్లా దురాచారపరుడు, సదాచార పరుణ్ణి పాడుచేయవచ్చు. దక్షిణదేశ బ్రాహ్మణులు పవిత్రతను కాపాడుకోవడం కోసం ఇతరులను స్పృశించరు. అది వారి దేహారోగ్యానికి మంచిదే. కౌగిలింతలు లేవు. దేహస్పర్శ లేనంతమాత్రంచే వారిలో ప్రేమభావం లేదని భావించకూడదు. అతని సంకల్పబలం ఇవతలివానిపై ప్రభావాన్ని చూపుతుంది.

నిప్పుపై నీటిని క్రుమ్మరిస్తే ఆరిపోతుంది. పాత్రలో నీరు పోసి వేడిచేస్తే ఆ నీరు వేడెక్కడం లేదా? నీళ్ళకు నిప్పుకి ప్రత్యక్ష సంబంధం ఉందా? అట్లాగే పైన కూడా. ఈ బ్రాహ్మణాచారాన్ని అందరూ పాటించారు. కనుక దక్షిణ దేశంలో శరీర స్పర్శ లేదు.

మరి ఉత్తర దేశ బ్రాహ్మణులీ ఆచారాన్ని ఎందుకు పాటించరని ప్రశ్న. అలెగ్జాండర్ దండయాత్ర మొదలు విదేశీయులిక్కడకు వచ్చి స్థిరపడడం మొదలైంది. వారి ప్రభావం మన వేష ధారణ మొదలైనవాటిపై పడి యుండవచ్చు.

మంత్రరక్షణ, బ్రాహ్మణులు చేస్తున్నారు కనుక ఈ ఆచారం లేదు. దీనిని తప్పుగా అర్థం చేసుకోవద్దు. రోగి దగ్గరనుండి అంతరిక్షంలో ఎగిరేవాని వరకూ కొన్ని నియమాలను పాటిస్తున్నారు కదా!

ధ్యానం యోగం పట్ల అభిరుచి గల పాశ్చాత్యులూ శరీర స్పర్శను కోరడం లేదని గమనించండి. మనస్తత్వ వేత్తలూ ఈ పద్ధతికి ఓటు వేయడం లేదు.

## చేయి చేయి కలిపినపుడు పవిత్రత ఎక్కడ?

వైదిక సంస్కారాల ద్వారా భార్యభర్తలను కలుపుతారు. పాణిగ్రహణం వివాహంలో ప్రధానమైంది. ఇందు ఇద్దరి చేతులను కలుపుతారు. అట్లాగే ఉపనయన సంస్కారంలోనూ చేతుల స్పర్శ ఉంది. ఉపనయనం కంటే వివాహంలోని పాణిగ్రహణానికే ఎక్కువ ప్రాధాన్యమిస్తారు. వివాహ లక్ష్యమైన స్వధర్మానుష్ఠానం మర్చిపోయి ఇద్దరూ కలిసి కోవడమే ప్రధానమని భావించి ఈ పాణిగ్రహణాన్ని గురించి మరిచిపోతారు. పాణిగ్రహణం ప్రేమసూచకమని భావించడం వల్ల కూడా దాని ప్రాధాన్యాన్ని గుర్తించరు.

ఉపనయనంలోని ధర్మాలను గుర్తించడం లేదు. ఆచార్యునితో ఉండుట, అతణ్ణి సేవించుట; వేదవిద్యను తననుండి గ్రహించుట, భిక్ష చేయుట మొదలైన అంశాలను నేడు పట్టించుకోవడం లేదు. ఆ సంస్కారంలో ఆచార్యుడు, విద్యార్థి పాణిని గ్రహిస్తాడు. వివాహంలోని పాణిగ్రహణం వంటిదే ఇదీ కూడా. పెక్కు దేవతలు తనలో ఉన్నారని, వారు విద్యార్థి పాణిని తనద్వారా గ్రహిస్తున్నారని, రక్షిస్తారని ఒక మంత్రం చదువుతాడు. వివాహంలో పెక్కుమంది దేవతలు ఈమెను తనకోసం రక్షించారని చెబుతూ మా ఉభయులనూ దేవతలు రక్షించాలని గృహస్థ ధర్మం పాటించునట్లుగా దేవతలు అనుగ్రహించాలని ప్రార్థిస్తాడు. ఇట్లా రెండు పాణిగ్రహణాల లక్ష్యమొక్కటే. రెండు ఆశ్రమాలలోనూ దేవతలు నియామకులనే భావనతో మంత్రా

లుంటాయి. ఇట్టి ధర్మాన్ని వధూవరులు, బ్రహ్మచారి పాటిస్తే దేవతల అనుగ్రహం ఉంటుందని తాత్పర్యం.

దీనివల్ల పిల్లవానికి ఉపనయనం ఎట్టిదో స్త్రీకి వివాహమట్టిదని వెల్లడౌతుంది. శిష్యుడు గురువునకు తనను తాను అర్పించుకొన్నట్లుగా, గురువు చేతిని స్పృశిస్తున్నట్లుగా స్త్రీ, భర్త దగ్గర అట్లా ఉండాలనే హితోపదేశం చేసింది మన సంస్కృతి.

ఈ రెండు సందర్భాలలోనూ పాశ్చాత్యుల మాదిరిగా హ్యాండ్‌షేక్ వంటిదుండదు. విద్యార్థిచేతిని గురువు కప్పియుంచి పట్టుకుంటాడు.

అట్లాగే వరుడు వధువు పాణిని కూడా పట్టుకుంటాడు. హేండ్ షేక్‌లో ఇద్దరూ సమానమనే భావన యుంటుంది. కనుక ఒకరి చేతిని ఒకరు పట్టుకొంటారు. వరుడు తన పాణితో ఆమె పాణిని గ్రహిస్తాడు. అదే పాణి గ్రహణం. ఉపనయనంలో వివాహంలో శరణాగతి భావం ఉంటుంది. వివాహంలో స్త్రీ, ఉపనయనంలో బాలుడు శిష్యభావంతో ఉంటారు. మనస్సును, వాక్కును, శరీరాన్ని గురువునకు అర్పిస్తున్నట్లుగా అన్ని పనులు చేయుటకు ప్రధాన సాధనమైన చేతిని శిష్యుడు అర్పిస్తున్నాడు. శరణా గతిని అంగీకరిస్తున్నాననే సూచనతో రక్షిస్తానని గురువే శిష్యుని చేతిని గ్రహిస్తాడు. అట్లాగే వరుడు వధువు యొక్క పాణిని గ్రహిస్తాడు. (పాణినా గ్రహణం)

## చేయి పట్టుకొనుట - ప్రతినిధిగా దండం

ఆచార్యుడు శిష్యుని చేతిని చాలాసేపు పట్టుకొని యుండడు. దండాన్ని తన ప్రతినిధిగా నుంచుతాడు. (మోదుగ దండం వంటివి) మనస్సును నియమించుటను దండం సూచిస్తుంది. శిష్యుని మనస్సును అదుపులో పెట్టేవాడు ఆచార్యుడు. అతడు బ్రహ్మచర్య పాలనను చేసేటట్లు చేయువాడు. ఈ దండము తాను నేర్చుకొన్న విద్యను విద్యార్థిలో పట్టి యుంచునట్లు

చేసేది కూడా. బ్రహ్మచారి దండం వేరు, సన్న్యాసి దండం వేరు.

భార్యకు దండం ఎందుకీయలేదని ప్రశ్న. ఇక్కడే పాతివ్రత్యమహిమ దాగియుంది. స్త్రీ తనను తాను భర్తకు అర్పించుకొంటుంది. అణకువతోనే యుంటుంది. అందువల్ల ఆమెకు ప్రత్యేకంగా దండం నిర్మింపబడలేదు.

## స్త్రీ పురుషుల ప్రత్యేకత

ఒకర్ని ఒకరు కౌగలించుకొన్నా, స్పృశించినా స్త్రీలు స్త్రీలను, పురుషులు పురుషులను మాత్రమే. వివాహంలో వధూవరుల కరస్పర్శ అందరూ చూస్తూ ఉండగా జరుగుతుంది. అందు కామభావం లేదు. శాస్త్రీయమైన కర్మ. పాశ్చాత్యులలో అట్లాకాదు. ప్రాపంచిక విషయాలలో అభ్యుదయాన్ని కోరుతూ వారు కలిసి మెలిసి యుండడం వారి సంస్కృతి కావచ్చు. కాని భారతదేశం చేసుకున్న అదృష్టం వల్ల ఆత్మోన్నతికై అందరూ పాటు పడాలనే భావనను కల్గించడం ప్రత్యేకత. భౌతిక శాస్త్రోన్నతి ప్రధాన ఆహారమైతే ఆధ్యాత్మిక భావన నంజుడు వంటిది వారికి. మనకు ఆధ్యాత్మిక మార్గం ప్రధానాహారం. భౌతిక సంపదకై ప్రయత్నించుట నంజుడు వంటిది. ఎందుకిట్లా సృష్టించాడని పరమేశ్వరుణ్ణి ప్రశ్నించలేం. కాని మన సంస్కృతి లక్ష్యాన్ని మరిచిపోతున్నాం. సంసార సుఖంలోని నియమాలను మనం అర్థం చేసుకోక వారి విచ్చలవిడి తనాన్ని అనుకరిస్తున్నాం. ఇది చాలా విచారకరం. *(ఇటీవల విడాకులు పెరిగినట్లు వార్తలు)*

మనదేశంలో ఈనాడు స్త్రీలు ఉన్నతమైన పదవులలో ఉన్నారు. పాశ్చాత్యులు వచ్చి వారితో చేతులు కలపడాన్ని చూస్తున్నాం. ఇందుకు వారిని శంకించడం లేదు. అయినా ఈ ఆచారం మన సంస్కృతికి విరుద్ధమే. మృదువుగా విదేశీయులకు సూచిస్తే మన సంప్రదాయాన్ని పాశ్చాత్యులూ గౌరవిస్తారు.

అట్లాగే పూలమాలలు వేయడం. పురుషులు పురుషులకు; స్త్రీలు స్త్రీలకు పూలమాలలు వేయాలి. మరొకటి శాలువాలను కప్పడం. పురుషుడు, పర స్త్రీలకు శాలువాలు కప్పడం మంచిది కాదు. స్త్రీలకు దానిని పళ్లెంలో పెట్టి పురుషుడందించడం సబబు.

## 73. అంజలి భేదాలు

రెండు చేతులను కలిపి నమస్కరిస్తున్నామంటే మనస్సును ఏకీకృతం చేసి అర్పిస్తున్నట్లే. అది మొగ్గ ఆకారంలో ఉంటుంది. హృదయమే మొగ్గ ఆకారంలో ఉంటోంది. అనగా హృదయపూర్వకంగా ప్రేమను పంచడమే ఒక అందమైన భావానికి ఒక అందమైన గుర్తు. పువ్వులను తీసుకొని అంజలి ముద్రతో ఈశ్వరునకు అర్పిస్తాం. అదే పుష్పాంజలి. రాత్రియందు పద్మాలు ముకుళించుకొని యుంటాయి. శంకరులు అమ్మవారిని నుతిస్తూ ఆమె పాదాలలోని నఖాలు చంద్రకాంతితో ఉన్నాయి అన్నారు. దేవలోక స్త్రీలు ఆమె పాదాలకు అంజలిని సమర్పిస్తున్నారు. ఇది ఎట్లా ఉందంటే ముడుచుకొన్న కరపద్మాలు అమ్మవారి నఖకాంతియనే చంద్రకాంతికి అర్పిస్తున్నట్లుగా ఉందట:

**నఖై నాకస్త్రీణాం కర కమల సంకోచ శశిభిః**

అంజలిముద్ర కూడా భిన్న భిన్న వ్యక్తులకు భిన్న భిన్న రీతులలో ఉంటుంది. అంజలిని పట్టి గుండె దగ్గర ఉంచుతాం. అంజలి హృదయం దగ్గరే ఉంది కదా! అందరి హృదయ పద్మాలలో ఈశ్వరుడున్నాడు కదా! అయితే గౌరవాన్ని ప్రకటించడంలో ఉన్న స్థితిని బట్టి భిన్నభిన్నంగా అంజలులుంటాయి.

పరమేశ్వరునకు అంజలినర్పించేటపుడు చేతులెత్తి శిరస్సుపైభాగంలో ఉంచేటట్లు చేస్తాం రెండు చేతులూ కలిపే ఉంటాయి. ఇందులోనూ తేడా

ఉంది. ఇష్టదేవతకు నమస్కరించేటపుడు చేతులనెత్తి కలిపి శిరస్సు పైభాగాన్ని తగలకుండా పెట్టాలి. ఇతర దేవతలకు నమస్కరించేటపుడు శిరస్సు పైభాగాన్ని తాకాలి. రెండు కనుబొమల మధ్య ఆజ్ఞాచక్రంలో గురుస్థానం ఉంది. గురువునాజ్ఞనిస్తాడు కదా! కనుక గురువునకు అంజలి నిచ్చేటపుడు కలిపిన చేతులను కనుబొమల మధ్యలో ఉంచాలి.

తండ్రి దగ్గర అంజలి ముద్ర నోటిని తాకాలి. తల్లికైతే పొట్ట దగ్గర పెట్టి నమస్కరించాలి. రాజునకు మూతి దగ్గర. ఇట్లా పెట్టడంలో ఒక ఔచిత్యం దాగియుంది. తండ్రి మనకు అన్నం పెడుతున్నాడు కనుక మూతిదగ్గర. రాజు పాలకుడు కదా! తండ్రి మాదిరిగా రాజునకు. తల్లి తన గర్భంతో మనలను మోసింది.

ఇతరులకు పెట్టేటపుడు పొట్ట దగ్గరే పెట్టాలి. ఇట్లా దేవుని దగ్గర నుండి అందరకూ ఎట్లా నమస్కరించాలో చెప్పాను. దేవునకు వ్రేళ్ళను మడిచి గుండె దగ్గర చూపిస్తున్నట్లుగా పెట్టాలి. ఇతరులకైతే ఆ వ్రేళ్ళు ఇతరులవైపు తిరిగి ఉన్నట్లుగా పెట్టాలి. ఇట్లా ఒక్క నమస్కారంలోనే అనేక సూక్ష్మాంశాలు దాగియున్నాయి.

## ప్రదక్షిణం

మరొక ఉన్నతస్థితి యుంది. అది ప్రార్థన చేయకుండా, పూజ చేయకుండా నిత్యమూ పరమేశ్వరుని నుతిస్తూ పూర్వ కర్మానుగుణంగా విధ్యుక్త ధర్మాలను నిర్వహించే స్థితి అది. ఆ దశలో మనలోని అంతఃకరణం అన్నిటినీ గమనిస్తుంది. అట్టి స్థితి నిరంతరం కలగాలని అమ్మవారిని శంకరులు కోరారు. మనం చేసే అన్ని పనులూ ఈశ్వర పూజగా మారాలనే భావనతో వ్రాసారు.

"ఆత్మాత్వం, గిరిజామతిః, సహచరాః ప్రాణాం శరీరం గృహం"

అనే శ్లోకంలో ఈశ్వరుడే ఆత్మయని అమ్మవారు మనస్సని, ఈశ్వరుని అనుచరులు ప్రాణాలని, శరీరమే అతని గృహమని అన్నారు. ఇంకా

**పూజాతే విషయోపభోగరచనా నిద్రాసమాధి స్థితిః**

**సంచారః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాగిరః**

**యద్యత్ కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం**

ఇంతకూ మనకు కావలసినది "సంచారః పదయోః ప్రదక్షిణ విధిః" మేము ఎక్కడికి వెళ్ళినా అది నీకు ప్రదక్షిణ మగుగాక. పూజలో ప్రదక్షిణను ముఖ్యంగా చేర్చారు.

సౌందర్యలహరిలో శంకరులు అమ్మవారిని నుతిస్తూ చేసే ప్రతి పనీ పూజలో భాగమే అన్నారు.

**జపోజల్పః శిల్పం సకలమపి ముద్రా విరచనా**
**గతిఃప్రాదక్షిణ్య క్రమణమశనాద్యాహుతి విధిః**
**ప్రణామస్సంవేశ స్సుఖమఖిలమాత్మార్పణ దృశా**
**సపర్యా పర్యాయస్తవ భవతు యన్మే విలసి తం**

ఇక్కడ శంకరులు నమస్కారాన్ని, ప్రదక్షిణాన్ని చెప్పారు. ఈశ్వరుని గురించి చెప్పినపుడు నమస్కారం గురించి చెప్పలేదు. ఇక్కడ రెంటినీ పేర్కొన్నారు.

అక్కడ సంచారం ఉండగా ఇక్కడ గతి యుంది. మననడక అంతా స్వామికి ప్రదక్షిణంగానే భావించాలి. సంవేశం అనగా నిద్ర. నిద్రకై పడుకొని యుండుట. సెజ్జపై పడి యుండుట నేను నీకు అర్పించు నమస్కారమే. మనం సాష్టాంగ నమస్కారం చేస్తున్నా; సెజ్జపై పడియున్నా అది తిన్నదిగానే ఉంటుంది.

అయితే రెంటిలోనూ తేడా ఉంది. మనం అలసట చెందినపుడు శయ్యపై ఒరుగుతాం. మనస్సు సరిగా పనిచేయనపుడు, పడుకొనడంలో ఆలోచన

ఉండదు. అయితే నమస్కారం మాటేమిటి?

సెజ్జపై పడుకొన్నపుడు మనవీపు భాగం పడకపై ఉంటుంది. తలదించి పడుకోం గదా!

ఏ పని చేయకుండా నేలపై పడుట నమస్కారంలో ఉంటుంది. నడకయే ప్రదక్షిణం. రెంటినీ చేసినపుడు భగవానుని చింతించాలి. ముందు ప్రదక్షిణం, తరువాత నమస్కారం ఉంటుంది.

ప్రదక్షిణంలో దక్షిణకు కుడివైపని అర్థం. ప్రదక్షిణం అనగా ఒక దేవతా మూర్తిని గాని, మహాత్ముని గాని చుట్టి తిరిగి చేస్తాం. ఉదా: గిరి ప్రదక్షిణం. అవి మనకు కుడివైపున ఉన్నట్లుగా.

సంస్కృతంలో కుడివైపునకు దక్షిణ భాగమని పేరు. తూర్పు ముఖం పెట్టి కూర్చుండగా అతని శరీరం ఈశ్వరాలయం కాగా సాధకుని గుండె స్వామికి మూలస్థానమౌతుంది. కనుక సాధకుని కుడివైపు శరీరంలో కుడివైపు. అందువల్ల దక్షిణం దక్షిణ భాగమైంది.

భగవానుడంతటా ఉన్నాడు. అతని ఆజ్ఞ లేనిదే ఏదీ కదలదు కనుక అతడన్ని వైపులా ఉన్నాడు. కనుక అతని చుట్టూ ప్రదక్షిణం చేస్తూ ఉంటాం. మనం ఎటు తిరిగినా అతని కేంద్ర స్థానం మారదు. గురుత్వాకర్షణ శక్తి గలవానిగా (Centre of Gravity) గుర్తించాలి.

## గ్రహాల కదలిక - ప్రదక్షిణం

ఇంకా ప్రదక్షిణం ఎందుకు చేయాలో చెబుతా. ఈ ప్రపంచం నిరంతరం తిరుగుతోంది. తన అక్షంపై (Axis) తాను తిరుగుతూ అదే సమయంలో సూర్యుని చుట్టూ తిరుగుతోంది.

భూమే కాదు, అన్ని గ్రహాలూ తిరుగుతున్నాయి. జ్యోతిశ్శాస్త్ర ప్రకారం భూమిని మినహాయించి సూర్యచంద్రులు కలుపగా నవగ్రహాలున్నాయి. కాని

ఖగోళ శాస్త్రం ప్రకారం సూర్యచంద్రులును విడిచి భూమిని కలిపి తొమ్మిది రాహుకేతువుల నిందు లెక్కించలేదు. ఇటీవల పరిశోధనల ప్రకారం యురేనస్, నెప్ట్యూన్, ప్లూటోలను చేర్చలేదు తొమ్మిదింటిలో.

భూమి, ఇతర గ్రహాలు తమ అక్షం చుట్టూ తిరుగుటను చక్రగతి యంటారు. సూర్యుని చుట్టూ గ్రహమార్గం గుండా గుండ్రంగా చుట్టి వచ్చుట భ్రమణము (Revolution).

భూమి పడమరనుండి తూర్పునకు తన అక్షంపై తిరుగుతుంది. ఇట్టి భ్రమణం వల్లనే రాత్రి, పగలనే వ్యవహారం. భిన్న దేశాలలో రాత్రింబవళ్ళలో భేదాలకు ఈ భ్రమణం కారణం. కాలంలో తేడా వస్తుంది. పడమరనుండి తూర్పునకు తిరగడం వల్ల సూర్యచంద్రులు తూర్పువైపునుండి పడమర వైపునకు తిరుగుతున్నట్లుగా కన్పిస్తారు. భూమి, ఇతర గ్రహాలు పడమర నుండి తూర్పునకు తిరగడం వల్ల ఇది ప్రదక్షిణానికి విరుద్ధంగా ఉంటుంది. అంటే అప్రదక్షిణం. శాస్త్రాలు అట్టి అప్రదక్షిణం మనం చేయడాన్ని చెప్పవు.

ప్రదక్షిణం అనగా గడియారం తిరిగినట్టు. అప్రదక్షిణం అనగా దానికి విరుద్ధం. అమ్మవారికి గతిశక్తి, చలనం ఉంది. ఆమె శక్తివల్లనే గ్రహాలన్నీ గిరగిరా తిరుగుతున్నాయి. ఆమె అయ్యవారి ఎడమప్రక్కన ఉంటుంది. ఆమె మాదిరిగానే గ్రహాలు కూడా ఎడమవైపునకు ఇట్లా తిరగాలని ఈశ్వరుని ఆజ్ఞ. ఇట్లా సూర్యుని చుట్టూ తిరుగుట అనాదినుండీ ఉంది. ఆ ధర్మం సౌర కుటుంబంలో ఉన్నా మనకూ వర్తించదా? అందువల్ల పూర్వులు ఈశ్వరుని స్థానాన్ని దృష్టిలో పెట్టుకొని అతణ్ణి కేంద్రంగా భావించి ప్రదక్షిణం చేయాలన్నారు. మన లక్ష్యం అతణ్ణి చేరుకోవాలి. కనుక నిరంతర భ్రమణం నుండి విముక్తికై అతడు మనకు కుడివైపున ఉండేటట్లుగా ప్రదక్షిణం చేయాలన్నారు. అపుడు శాంతి లభిస్తుంది.

భూమి తన అక్షంపై తాను తిరుగుతున్నట్లుగా మనమొక్క ప్రదేశంలో

ఉండి తిరగాలి. ప్రదక్షిణం చేసేటపుడు కొద్ది నిముషాలపాటైనా మనలో భగవానుడున్నాడని మనము అతనిచుట్టూ తిరుగుతున్నామని అతడు మనకు కేంద్రస్థానంలో ఉన్నాడని భావించాలి.

గడియారంలోని చేతులవంటి ముళ్ళు గడియారం బయట తిరగవు. లోపలే వాటి లక్ష్యం గడియారంపైని అంకెలు వేసే ఒక బిళ్ళ కేంద్రస్థానం పైనే. ఆ కేంద్రబిందువు అచలం. అది నిర్దేశింపబడి యుంటుంది. మిగిలిన ఆ చేతిముళ్ళు ఆ కేంద్రం చుట్టూ తిరుగుతాయి. మనకు మన లక్ష్యమూ అట్లా ఉండాలి.

గ్రహాలు చక్రంవలె తిరుగుతాయి. చుట్టి వస్తాయి కూడా అప్రదక్షిణంగా. అట్లా తిరగడమే విశ్వనియమం. కుడివైపునకు కాకుండా ఎడమవైపునకే. ఇంతకు ముందు దేవుని చుట్టూ తిరగాలని, విశ్వనియమం ప్రకారం ఆత్మ చుట్టూ అని. అయితే రెంటికీ తేడా ఉంది. విశ్వ నియమాన్ని మనిషి దాటగూడదు కదా! అంతటితో ఆగిపోకూడదు. అట్లాగే అనుసరించి దాటగలగాలి. అనగా సవ్యస్థితిని చేరాలి. అది ధర్మాధర్మాలకు అతీతం.

జడమైన గ్రహాలుగా వాటి గ్రహగమనం మాదిరిగా జీవుడుండకూడదు. అందుకే మూలవస్తువు మనకు అన్నివైపులా కుడివైపున ఉండునట్లుగా మనం ప్రదక్షిణం చేయాలి. శక్తి ప్రభావం వల్ల గ్రహాలట్లు అప్రదక్షిణంగా తిరగవచ్చు. కాని జీవంతో ఉన్న మనం శక్తియొక్క విలాసాలెట్లున్నా శక్తి అణగి శాంత స్వరూపం వైపు అనగా పూర్ణత్వం వైపు, అనగా కేంద్ర బిందువైన పరమేశ్వరునకు ప్రదక్షిణం చేయాలి. మాండూక్యోపనిషత్తు ఆపూర్ణత్వాన్ని సత్యం – శివం – అద్వైతంగా పేర్కొంది. శాంత శివం కుడివైపున ఉంటుంది. మనకూ అట్టి శాంత స్థితి కావాలి కనుక అతడు మనకు కుడివైపున ఉన్నట్లుగానే తిరగాలి. తిరుగుట, చలనమూ ఇదంతా శక్తి విలాసమే. శాంత స్థితిలో అన్నీ అంతం కావాలి.

గ్రహాలు తిరిగినట్లు మనమూ తిరిగితే ప్రపంచానుభవమే మిగులుతుంది. ఆత్మానుభవం చిక్కదు. ఎంతవరకూ ప్రపంచంలో ఉన్నామో అంతవరకూ కర్మలను చేస్తూ ప్రాపంచిక వ్యవహారాలను దాటగలగాలి. అదీ ప్రదక్షిణ లక్ష్యం. ఇది జడమైన గ్రహాలకు, జీవమున్న జీవునకు తేడా.

ప్రపంచం తిరిగేటట్లని అన్నాను కదా! పరుగు పందాన్ని చూడండి. అప్రదక్షిణంగానే ఉంటుంది. భౌతిక శక్తి అట్లాగే ఉంటుంది. ఆత్మతో సంబంధం లేదు. అపుడు గ్రహగమనం మాదిరిగానే పరుగులు తీస్తున్నాడు. అపుడట్లాగానే చేయాలి. ఇప్పుడీ పద్ధతిని మారిస్తే శరీరానికి మంచిది కాదు. గోపురంలో మెట్ల నెక్కుతాం కదా! అవి ఎడమవైపుకి తిరిగి ఉంటుంది. విదేశీయులు కూడా ఇట్టి పద్ధతులను చూసి ఆశ్చర్య చకితులౌతున్నారు.

## ప్రదక్షిణం అనుసరించి నమస్కారం

ప్రదక్షిణం పూర్తయిన తరువాత సాష్టాంగ నమస్కారం చేయాలి. దీనిని ప్రదక్షిణ నమస్కారమని అంటారు. ఏ దిక్కుకి తిరిగి చేయాలి? తూర్పువైపు, లేదా పడమర వైపు తిరిగిన దేవతలకు ఉత్తరపు వైపున చేయాలి. ఉత్తరం, దక్షిణం తిరిగిన దేవతలకు తూర్పువైపున ఇది చేయాలి. అనగా దక్షిణవైపు, పడమరవైపు కూడదని అర్థం. ఎవరి కైనా మనం ప్రదక్షిణం చేయకపోయినా ఉత్తరపు వైపునగాని, తూర్పువైపున గాని సాష్టాంగం చేస్తాం.

మరొక ముఖ్యవిషయం. అనేక దేవతలకు అనేక సన్నిధులు (నిలయాలు) ఉంటాయి. ప్రతి దేవతలకు సాష్టాంగం చేయకూడదు. అంజలి పట్టితే చాలు. ఎందుకంటే భిన్న దేవతలు భిన్న భిన్న దిక్కులను చూస్తారు. ఒక దేవతకు సాష్టాంగం చేస్తే మరొక దేవతపైపు కాళ్ళను చూపించినట్లౌతుంది కదా! కనుక ధ్వజ స్తంభం దాటిన తరువాత ప్రధాన దేవత సమక్షంలోనే సాష్టాంగ నమస్కారం చేయాలి. మిగతా దేవతలకూ చెందుతుంది. ఆలయంలోనే విడిగా మరొక దేవతకు ధ్వజస్తంభం ఉండగా అక్కడా చేయవచ్చు. సాధారణంగా అమ్మవారి సన్నిధి ఉంటుంది.

ఆపైన ప్రదక్షిణం నెమ్మదిగానే చేయాలి. నెలలు నిండిన గర్భిణి చేతిలో నూనె పాత్ర పెట్టుకొని ఎట్లా నిమ్మదిగా నడుస్తుందో అట్లా చేయాలి. మనసు భగవానునిపై కేంద్రీకరింపబడియుండాలి. వేగంగా నడిస్తే మన మనస్సూ అంతకంటే వేగంగా తిరుగుతుంది.

లోగడ చెప్పినట్టు మన గమనం శివశాంతస్థితికి దారి తీయాలి. శక్తియొక్క చలనం, శివశాంత స్థితిలో కలియాలి. ప్రదక్షిణం అనగా చలనం కదా! అప్రదక్షిణంగా గ్రహగతులున్నాయి. ప్రదక్షిణంగా జీవగతి యుండాలి. గ్రహాలు వేగంగా తిరుగుతూ ఉంటే ప్రదక్షిణంలో మన గమనం నెమ్మదిగా సాగాలన్నమాట.

## శాస్త్రవిధులు హేతువాదానికి అందవు

పై వివరణలంత ముఖ్యం కావు. పూర్వులు ఆధ్యాత్మిక శాస్త్రం యొక్క నిజతత్త్వాన్ని తెలిసికొన్నవారు. వారందించిన శాస్త్రాలను అనుసరిద్దాం. అవి మన బాగు కోసమే కదా! హేతువులన్నింటనీ వెదకడం వ్యర్థం. అయితే మన బుద్ధి ప్రతిదానికి శంకిస్తూ ఉంటుంది. పూర్వులు అర్థరహితంగా, ప్రయోజన రహితంగా చెబుతారా? వారు చెప్పినట్లు నడవడం వల్లనే సుఖశాంతులతో జనులు వర్థిల్లుతున్నారు. ఈ ప్రశాంతత, మిగతా దేశాలలో కనబడదు. సాధారణ ప్రజలలోనే మహాత్ములూ ఉంటారు. వారి ఉనికియే కృపను చూపిస్తుంది.

ప్రతి దానిని శంకించడం మొదలైన కొలదీ దుఃఖస్థితి దాపురించింది.

మానసిక భావం బాహ్యంగా క్రియారూపంలో ఉంటోంది. ఇది తరతరాల నుండి ఈ ఆచారం కొనసాగి లోనున్న ఆత్మశక్తి వృద్ధి పొందునట్లు చేస్తోంది. అందువల్ల సాష్టాంగం చేసినా, పంచాంగం చేసినా వినయాన్ని కల్గించేవే. అదే అసలైన సంపద.

## వినయ మహిమ

మన సంప్రదాయంలో వినయానికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చారు. విద్య, అధికారం, డబ్బు అందం మొదలైన వాటివల్ల ఇతరులకంటె తానధికుడనని భావించడం సహజమైనా అది గౌరవ ప్రదంగా ఉండదు. అందుకే ఎంత ఎదిగితే అంత ఒదగాలన్నారు. మాటిమాటికీ విద్యావినయాల గురించి ప్రాచీన గ్రంథాలు చెబుతాయి. "విద్యా వినయ సంపన్న" అనే మాట గీతలో ఉంది.

ఎక్కడ వినయం ఉంటే అక్కడ ఈశ్వర కృప ప్రవహిస్తుంది. వినయ సూచకమైనదే నమస్కార ప్రక్రియ. నమస్కరించడానికే, పెద్దల ఆశీస్సులు పొందడానికే సుదూర ప్రాంతాలకు వెళ్ళేవారు.

## వయః పరిమితి

మనకంటె వయసులో మూడు సంవత్సరాలైనా పెద్దగా నున్నవారికి సాష్టాంగ నమస్కారం చేయాలని మిగిలినవారికి కేవల నమస్కారం చేయాలని కట్టడి. మూడు సంవత్సరాల నియమం ప్రక్కకు పెట్టినా పెద్దవారు కనబడితే నమస్కరించాలి. కనీసం. కొన్ని సందర్భాలలో మనకంటే తక్కువ వయస్సున్న వారికి నమస్కరించాలని శాస్త్రాలన్నాయి. ఉదాహరణకు పెద్దన్నగారి భార్య తనకంటె చిన్నదైనా ఆమెకు నమస్కరించాలి. కారణమేమంటే ఆమె తల్లితో సమానం కనుక. అట్లా గురుపత్ని విషయంలోనూ. మనకంటె ఎక్కువ వయస్సున్న పెద్దవాని భార్యకు ఆమె వయస్సుతో నిమిత్తం లేకుండా నమస్కరిస్తాం. కారణమేమంటే వారు దంపతులు కనుక. మూడేళ్ళు పెద్ద అనే పై నియమం జ్ఞానులు, భక్తులు, సన్న్యాసులు, ఆచార్య పీఠాన్ని అలంకరించినవారి పట్ల చూపకూడదు. అట్టివారు మన కంటె చిన్నవారైనా నమస్కరించాలి. ఈ జాబితాలో గురువుగారి కొడుకు కూడా చేరాడు.

మనమా దంపతులకు ఎట్లా నమస్కరిస్తామో ఆ ఉభయులు కలిసి ప్రత్యభివాదం చేయాలి. అనగా ఆశీర్వదించాలి.

## నమః అని ఒక్కమాటు అనకూడదు

మార్కండేయ పురాణంలోని సప్తశతిలో అమ్మవారిని ఉద్దేశించి నమస్తస్యై... నమో నమః అని చాలాసార్లు వస్తుంది. ఒక్క నమో అని అనరు. నమోనమః అనడం ఆచారం. మామూలు సంభాషణలలోనే సహస్ర నమస్కారాలంటూ. ఉత్తరాలు వ్రాసేటపుడు అనంతకోటి నమస్కారాలని వ్రాస్తాం.

సాష్టాంగం గాని, పంచాంగం గాని చేసేటపుడు నాల్గుసార్లు చేయాలని పెద్దలంటారు. అవతలి వ్యక్తి వద్దన్నంతవరకు సాష్టాంగాలు చేయడం వైష్ణవ సంప్రదాయం.

ఈ క్రియ, వినయంతో చేసేది, ఇంకా వినయసంపద కావాలని చేసేది. ఆ భావన లేకుండా చేస్తే శారీరక వ్యాయామంలా ఉంటుంది. ఆత్మానుభవం పొందాలని భగవానుడనలేదా? కేవలం శారీరక బలమే ఉంటే పశువు లకు మనకూ తేడా ఏముంటుంది? కనుక వినయసం పద సంవృద్ధి పొందుగాక.

## ముక్తిని ఏది ప్రసాదించునదో

తైత్తిరీయ ఉపనిషత్తులో భృగువల్లిలో, తన్నమ ఇత్యుపాసీత, నమ్యన్తే ఽ స్మైకామాః, తద్బ్రహ్మేత్యుపాసీత అనే మంత్రం ఉంది. అనగా బ్రహ్మ స్వరూపమగు ఆకాశము నమన గుణము కలదని ఉపాసించాలి. ఈ విధంగా ఉపాసించువానికి భోగింపదగిన విషయములన్నీ లోబడుతున్నాయని అర్థం.

పరమేశ్వరుణ్ణి నమస్కారంగా భావించి పూజించమంటున్నాడు. అన్ని కోరికలు తీరుతాయట. ఏమిటి దీనర్థం! కోరికలు తీర్చుకోవడానికే నమస్క రిస్తున్నాం కదా! అయితే అన్నీ తీరుతున్నాయా? కోరిక తీరినా ఆత్మ, తృప్తి పడుతోందా? కోరికల వెంట పరుగిడుతున్నాం కదా! కనుక మనకు తెలివి

యుంటే కోరికలనుండి విముక్తికై కోరాలి. అపుడు మంత్రంలోని కోరికలే నమస్కరిస్తాయన్నమాట సార్థకమౌతుంది. నీవు కోరికలను ఇట్లా త్యజించావు. మాపట్ల కనికరంతో చూడమని అవే అనేటట్లుగా ఉండాలన్నమాట. అట్లా శ్రుతి అందంగా, ఆలంకారికంగా చెప్పింది.

జ్ఞాన వయోవృద్ధుల దగ్గరకు రోజూ వెళ్ళి నమస్కరించి వారికి సేవ చేస్తే, దీర్ఘాయుర్దాయం, కీర్తి, బలం, జ్ఞానం కల్గుతాయని మనుస్మృతి చెప్పింది.

**అభివాదనశీలస్య నిత్యం వృద్ధోప సేవినః**
**చత్వారితస్య వర్ధంతే ఆయుర్విద్యా యశోబలం**

మరొక పాఠం ఉంది. ఆయుః ప్రజ్ఞా అని. విద్యకు బదులు ప్రజ్ఞయని. ఉత్తమ జ్ఞానము ప్రజ్ఞ. విద్యకు చదువుతోబాటు ఈ అర్థమూ ఉంది.

సాష్టాంగ నమస్కార ఫలం వంద యజ్ఞాలను చేసిన దానికంటె గొప్పదని అన్నారు. యజ్ఞాలు చేస్తే మరల జన్మ వస్తుంది. కాని నమస్కరిస్తే జన్మ రాహిత్యమే.

నమస్కారం యొక్క గొప్పదనాన్ని అప్పయ్య దీక్షితుల వారందంగా చెప్పారు.

**వపుః ప్రాదుర్భావతః అనుమితమిదం జన్మని పురా**
**పురారే! న క్వాపి క్వచిదపి భవంతం ప్రణతవాన్**
**నమన్ముక్తః సంప్రత్యహమతనుః అగ్రేప్యనతిమామ్**
**ఇతీశ క్షంతవ్యం తదిదం అపరాధ ద్వయమపి**

-కువలయానందం

తా: ఓ పరమేశ్వరా! రెండు తప్పులను చేసాను క్షమించు. గత జన్మలో నేను నమస్కరించకపోవడం వల్ల ఇప్పుడు జన్మనెత్తాను. ఈ జన్మలో నేను నీకు నమస్కరిస్తే ఇక జన్మ ఉండదు కనుక అపుడు నీకు నమస్కరించే అవకాశమే లేదు కదా! కనుక నా తప్పులను క్షమించు.

భాగవతం చివర ఒక శ్లోకం ఉంది:

**నామ సంకీర్తనం యస్య సర్వపాప ప్రణాశనం**
**ప్రణామో దుఃఖ శమనః తం నమామి హరింపరం**

శ్లోకంలో మొదటి వాక్యం మొదట నామం, రెండవ వాక్యం మొదట ప్రణామం ఉంది. మధ్యలో ప్ర - నాశం = ప్రణాశనం ఉంది. నామం - ప్రణామం - ప్రణాశం - ఇది వినడానికి చాలా బాగుంది కదా!

శ్లోకంలో మొదటి సగం, హరినామ సంకీర్తనం పాపాలను పోగొడు తుందని. అంతటితో శ్లోకం ఆగిపోవచ్చు కదా! సబబే. శ్లోకంలో రెండవ సగం, నమస్కారం యొక్క గొప్పదనాన్ని వివరించి పూర్తిచేసింది. ప్రణామో దుఃఖశమనః అని. అనగా నమస్కరిస్తే దుఃఖం పోతుందని; తం నమామి హరింపరం = అందువల్ల హరికి నమస్కరిస్తున్నానని.

పాపాలు తొలగిపోతే దుఃఖాలు తొలగిపోవా అని ప్రశ్నించవచ్చు. పాపాలు పోతే నిజాయితీతో కూడిన జీవితాన్ని గడపవచ్చు. అంతమాత్రంచే దుఃఖం పోదు. దుఃఖమనగా ఏమిటి? పరమాత్మతో ఐక్యం కాకపోవడమే. నీతి నిజాయితీలతో బ్రతకడం వల్లనే పరిపూర్ణత్వం రాదు. అది ఎప్పుడు రాదో ఏదో వెలితి ఉండనే ఉంటుంది. జీవ బ్రహ్మైక్యం సిద్ధించనంతవరకూ అతృప్తియే. అట్టి పరిపూర్ణత్వ స్థితిని ప్రసాదించేది నమస్కారం.

నమస్కారం పెట్టడంలోనే శరణాగతి యుంది. నమస్కార క్రియకు ఉన్నత స్థానాన్ని ప్రసాదించి భాగవతాన్ని ముగించిన వాడు శుక మహర్షి

పాప కర్మఫలాలు తొలగాలంటే నమస్కారాన్నే ఆశ్రయించాలి. మనంతట మనము భగవానునితో కలవలేం. మన భారాన్ని అతడే మోయాలి. శరణాగతి చేయడమే మనవంతు. ఇది భాగవత సందేశం.

గీతలో భాగవతవీరుడైన భగవానుడు అర్జునునితో చెప్పినది కూడా ఇదే. శరణాగతి చేస్తే ఏం చేస్తానన్నాడు.

**అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి**

అన్ని పాపాలనుండి విముక్తి నిస్తానన్నాడు. అదేమాట భాగవతంలో సర్వపాప ప్రణాశనం అని ఉంది. చివరగా భగవానుని మంగళకర వాక్కులను వినండి. మా శుచః = దుఃఖ పడవద్దు. ఈ మాట, దుఃఖ శమన అని భాగవతంలో ఉంది.

శుక మహర్షి భాగవతాన్ని శరణాగతి శాస్త్రంగా ముగించబోయి నమస్కారంతో దానిని సూచించాడు.

భగవదైక్యమే నమస్కార లక్ష్యం.

## నమస్కారం తనంతట తానే ఉపకరిస్తుంది

నమస్కరించి దానికి బదులుగా ఏదో కోరడం తెలివి తక్కువతనం. ఎప్పుడైతే నమస్కరించామో వినయమనే ఫలాన్ని ఇచ్చింది కదా! అదే అదృష్ట ఫలం. భాగ్యఫలం. శంకరులు కనకధారాస్తవంలో అమ్మవారిని ప్రార్థించినా తాను విడిగా ఏమి కోరుకున్నారో గమనించారా? నీకు నమస్కరించడమే గొప్ప ఐశ్వర్య మన్నారు. నమస్కార సంపద నిమ్మన్నారు.

**త్వద్వందనాని మామేవ మాతరనిశం కలయంతు**

## మనస్కారం

త్యాగరాజస్వామి వారు ఎందరో మహానుభావులు, అందరికీ నమస్కారా లని పాట వ్రాసారు కదా! అట్లాగే మీరందరూ పెద్దలకు నమస్కరించండి.

ఇట్లా చెబుతున్నానంటే సభలలో చేయండని కాదు సుమా! అది మాకూ ఇబ్బందే. ఇతరులకూ ఇబ్బందే. దేశకాల పరిస్థితులను గమనించి నమస్కరించండి. (దేవసన్నిధిలో ఇతరులకు నమస్కరించకూడదు కూడా).

గుంపు మధ్యలో ఉంటే మానసికంగా నమస్కరించినా, చాలు. శారీరకంగా నమస్కరించలేనపుడు మానసికంగా భావించండి. ఇది నమస్కారం యొక్క మనస్కారం.

## ఆర్థికాభివృద్ధికి అంతం లేదు

కేవలం నమస్కారం గురించి ఇంత సుదీర్ఘంగా ఎందుకు చెబుతున్నానంటే నేడు రానురాను వినయ సంపద, మర్యాద, క్షీణిస్తున్నాయి. స్వేచ్ఛ, సమభావం, ఆత్మగౌరవం అనే మాటలే వినబడుతున్నాయి. వీటివల్ల ఒకరు వినడం తగ్గిపోతోంది. బాధ్యతలను విస్మరించి కేవలం హక్కులపై పోరాడుతున్నారు. ఆర్థికాభివృద్ధి సాధించడంలో క్రొత్త సిద్ధాంతాలను తప్పు పట్టడం లేదు. దేనికైనా ఒక హద్దు అంటూ ఉండాలి కదా! మర్యాద అనగా హద్దును గుర్తిస్తే తీవ్ర సంఘర్షణలు తగ్గుతాయి. శాంతి, సౌఖ్యం, ఐకమత్యం, పరస్పర ప్రేమలు వృద్ధి పొందుతాయి. దీనికంతటికీ మనం వినయ సంపదను కోరాలి.

ఆర్థికాభివృద్ధి ఒక్కటే మన గమ్యమా? కాదు. డబ్బు సంపాదనకు ఒక పరిమితి ఉంటేనే సంపూర్ణ జీవితం పరిఢవిల్లుతుంది. వినయంతో పెద్దలను సేవించినపుడు మాత్రమే వారి మాటలను ఆచరణలో పెట్టగలిగినపుడు మాత్రమే సిద్ధిస్తుంది. ఆ వినయమే జీవితానికి పునాదిగా ఉండాలి. నేడందరూ వినయవంతులు కాదని చెప్పడం లేదు. ఈనాడు స్వేచ్ఛా జీవితమే నాగరికతయని భావిస్తున్నారు. పరస్పర గౌరవాలు సన్నగిల్లుతున్నాయి. అయినా ఎంత అధికారమున్నా, డబ్బున్నా చాలామంది ఎవరో ఒక స్వామి దగ్గర మోకరిల్లుతున్నారు. నాస్తికులమని, హేతువాదులమని భావించే వారు కూడా తమలో నున్న పెద్దలకు నమస్కరిస్తూనే ఉన్నారు. వారిని పొగుడుతూనే ఉన్నారు. కనుక ఎవరైనా ఈ గడ్డలో పుడితే సహజ లక్షణాన్ని విస్మరించడం లేదు. ఆ నమస్కారం, సరియైన వ్యక్తికి చేస్తే తానూ, సంఘమూ బాగుపడ

దానికి అవకాశం వస్తుంది. నారాయణుడే అందరిలో సద్బుద్ధిని ప్రసాదించు గాక!

(స్వామివారు మాట్లాడుతూ ఉండగా అనారోగ్యంతో బాధపడుతూ నమస్కరించ లేకపోయానని బాధపడే వ్యక్తిని గూర్చి ఇట్లా అన్నారు.)

పైన చెప్పినదంతా ఆరోగ్యవంతులైనవారి నుద్దేశించిందే. అనారోగ్యంతో బాధపడుతూ శ్రమపడి నమస్కరించకండి. ఇట్టివారు మానసికంగా చేస్తే చాలు. శారీరకంగా చేయలేకపోతున్నామనే భావనయే మంచి ఫలితాన్నిస్తుంది. శారీరకంగా చేసినవాడు యాంత్రికంగా చేస్తాడు. మానసికంగా చేసినవాడు పూర్తిగా మనస్సును ఏకాగ్రం చేసి చేస్తాడు. కనుక ఏ నియమానికైనా కొన్ని మినహాయింపులుంటాయి.

భౌతిక సంపద ఎంత వృద్ధి చెందితే అంత గొప్ప దేశమని; ఆధ్యాత్మిక ప్రగతిని గూర్చి పట్టించుకోవడం లేదు. దీనికంతటికీ దురహంకారం కారణం. ఆ రోగం పోవాలంటే నమస్కారమే దానికి విరుగుడు. సంసారమనే చీకటి పోవాలంటే ఇది మొదటి మెట్టు.

నేను ఉపదేశాన్ని అహంకారంతో చెబుతున్నానా? అంతస్తు పెరగాలని, స్వేచ్ఛా స్వాతంత్రాలు, ఆత్మగౌరవం మొదలైన మాటల కోలాహలం ప్రబలంగా ఉన్న రోజులలో సంఘర్షణాత్మక వాతావరణం చూసి రాను రాను వినయ సంపద దూరం కావడం చూసి మాట్లాడవలసి వచ్చింది.

ఈ మఠాధిపత్యం అనుకోకుండా తటస్థించింది. ఇతరులకు నమస్కరించే అవకాశం నాకు లేకపోయిందని, ఏమిటీ జీవితం అని బాధే. నన్ను చూసి వినయ సంపదను వృద్ధి చేసుకోండని సుదీర్ఘంగా చెప్పలసి వచ్చింది.

నమస్కరించే భాగ్యం మీకు కల్గింది. నాకట్టి భాగ్యం లేదు. మీకు శ్రేయస్సు కలగాలని నారాయణునకు నమోనమః అంటూ నమస్కరిస్తున్నా.

# ప్రాచీన కాలంలో ఎన్నికలు

## వేదాలలో ప్రజాస్వామ్యం

పూర్వకాలంలో అంతా రాజు గుప్పిట్లోనే పాలన ఉండేదని, ప్రజలే విధంగానూ పాలు పంచుకోలేదని చాలామంది భావిస్తారు. రాజని వ్యవహరించినపుడు, ఒక్క రాజే కాదు, అతని మంత్రులు కూడా పరిధిలోకి వస్తారు. రాజు, అతని కుటుంబ సభ్యులు మంత్రులు, ఉన్నతాధికారులు అన్ని నిర్ణయాలను తీసుకొని అమలు పరిచేవారని భావిస్తారు. పాశ్చాత్య ప్రభావానికి లోనైన కొందరు చారిత్రక పరిశోధకులు బ్రాహ్మణులు రాజును తమ గుప్పిట్లో పెట్టుకొని నడిపించే వారని వ్రాసారు.

ప్రజాస్వామ్యమనగా ప్రజలు కూడా భాగస్వాములై నడిపించే వ్యవస్థ గురించి పాశ్చాత్యులవల్లనే తెలిసిందనీ వ్రాస్తూ ఉంటారు.

అనాదినుండి (వేదాలలో) ప్రజల అభిప్రాయాన్ని పరిగణనలోకి తీసుకొన్నట్లు ఆధారాలున్నాయి. సభ, సమితి, విదథ అనే నిర్వాహక సంస్థలను వేదాలు పేర్కొన్నాయి. వీటిల్లో విద్వాంసులు సమావేశమై చర్చించి నిర్ణయాలను రాజునకు నివేదిస్తూ ఉండేవారు. వీరి సలహాలననుసరించి రాజు పరిపాలించేవాడు. ఇవి బ్రాహ్మణులు, క్షత్రియులతోనే నింపబడ్డాయని పాశ్చాత్య చరిత్రకారులూ వ్రాయలేదు. అందు సంఘంలోని వివిధ వర్ణాలకు చెందిన పెద్దలుండేవారు.

యజుర్వేదంలో రుద్రాధ్యాయం ఉంది కదా? (తైత్తిరీయ సంహిత -

నమకం) ఇందు సమస్త చరాచర వస్తు ప్రపంచానికి నమస్కరించడం ఉంటుంది. నమోనమః అనే పేరుతో . పరమాత్మ అన్నిటా ఉన్నాడని అందర్నీ పేర్కొనడం జరిగింది. ఇందు సభలకు నమస్కారం, సభాపతులకు నమస్కారం అని ఉంది. పై సభయే ఈ సభ. సభను నడిపేవాడు సభాపతి.

ఈనాడు సంగీత సభలని అంటాఉన్నారు కదా! నేను సభకు వెడుతున్నానని అనగా సంగీత కచ్చేరీకి వెడుతున్నాడని అర్థం. కాని వేదంలో సభయంటే నేటి శాసనసభయే.

ఇందు ప్రముఖులుండి ప్రజల యోగక్షేమాలను విచారిస్తారు కనుక పూజ్యస్థానమైంది.

చిదంబరంలో నటరాజు కొలువుండే సభను కనక సభయని అంటారు. ఇలాంటి సభలు ఇంకా నాల్గున్నాయి. మధురైలో రజతసభ, తిరునల్వేలిలో తామ్రసభ; తిరుక్కుట్రాలంలో చిత్రసభ ఉన్నాయి. ఇవన్నీ శిల్ప శోభితాలు. ఇందు సభాపతి, నటరాజే.

మనం చిదంబరాన్ని నటరాజాలయం అంటాం. అక్కడున్న అర్చకులు (దీక్షితులు) దీనిని సభా నాయకర్ కోవిల్ అని అంటారు. ఈశ్వరుడు సభా నాయకుడు, లేదా సభాపతియే కాదు, ఆయనయే సభ. ఇట్టి సభకు కూడా నమస్కారమని అర్థం చేసుకోవాలి. మన సంకల్పాలు భగవత్ సంకల్పాలనే మాట ఈనాడే పుట్టలేదు.

ఈ పై సభలలో (ప్రజల సభ) పాల్గొనేవారికి మూడు అర్హతలుండాలి. మంచి నడవడి, మంచి బుద్ధి, స్పష్టమైన ఉచ్చారణ లేదా వాక్పు పుణ్యము ఇట్టి లక్షణాలు పట్టుబడాలనే ప్రార్థనతో కూడిన మంత్రాలున్నాయి. ఋషులకు మేధ, నడవడిక ఉన్నట్లు మనకు తెలుసు. ప్రజలకు సేవ చేయాలనే భావనతో ఇందు కొందరు సభలనలంకరించేవారు. చక్కగా మాట్లాడేవారున్న శక్తిని విదథ ప్రసాదించుమనే ప్రార్థనలున్నాయి.

పంచరుద్రమని ఋగ్వేదంలో ఉంది. ఇందు కూడా అట్టి ప్రార్థన లున్నాయి. పై లక్షణాలున్నవాడు సభేయుడు. రాచపుట్టుకతోబాటు, సభేయుడై రాజుండాలని మంత్రాలన్నాయి.

ఋగ్వేదం చివరలో ఈ సభేయులు ఎట్లా చర్చిస్తారో, ఎట్లా అమలు పరుస్తారో అనే విషయాలున్నాయి. ఇందలి సూక్తులు అందరికీ ఆమోద యోగ్యంగా ఉన్నాయని ప్రపంచ దేశాలు కీర్తించాయి. ప్రజా క్షేమమే మీ లక్ష్యంగా మీ భావాలు ఏకమగుగాక. ఉన్నతమైన భావాలతో, కలిసి మెలిసిన మనస్సుతో ముందుకు సాగండి. మీ చిత్తము లేక మగుగాక, కలిసి నడవండి, కలిసి మాట్లాడండి అనేవి.

ఈ సభలలో వివిధ సంఘాలలోని పెద్దలుండేవారు. అందు బ్రాహ్మణ పురోహితులే ఉన్నారనడం సబబు కాదు. పురోహితులతో బాటు గ్రామణి, సేనాని వంటి ముఖ్య అధికారులుండేవారు. గ్రామ ప్రజల బాగోగులను చూడటం గ్రామణి పని. సేనాని, యుద్ధ కార్యాలను వీక్షించేవాడు. అతడు సాధారణంగా క్షత్రియుడై యుండేవాడు. గ్రామణి యనగా బ్రాహ్మణుడే యై యుంటాడని భావించనవసరం లేదు.

రాజునకు పట్టాభిషేక సమయంలో అన్నివర్గాల ప్రతినిధులూ పాల్గొనే వారు. ఇట్లా రాచరికం, ప్రజాస్వామ్యం కలబోసిన వ్యవస్థగా సాగేది.

## వర్ణంలో పెద్దల వ్యవస్థ

ఒక్కొక్క వర్ణంలో ఒకొక్క పెద్ద చాలా వ్యవహారాలను చక్కబెట్టే పద్ధతి మనదేశంలో చాలాకాలం నుండి యుంది. అంటే కులపెద్ద. నాట్టాణ్మై అని ఇతనికి తమిళంలో అంటారు. ప్రతి కులానికి ప్రభుత్వ వ్యవహారాలలో భాగస్వామ్యం ఉండేది.

కుల అంటే విడిగా ఒక కుటుంబం. రాష్ట్రం, లేదా జనపదం మొత్తం

రాజ్యాన్ని సూచిస్తుంది. గ్రామప్రాంతాలుండేది జనపదమనే వ్యవహారం ఉంది. ఈ రెంటి మధ్య శ్రేణి యుండేది. ఒక వృత్తికి సంబంధించిన వ్యవస్థ. శ్రేణినుండే తమిళంలో చేనేత వృత్తిలోనున్న వారిని చేనియర్ అని అంటారు. అనేక వృత్తులున్నా ఈ చేనేత పనివారు ఒక క్రమశిక్షణతో ఉండడం వల్ల వారికే ఈ పదం రూఢికెక్కింది. శ్రేణులకొక ప్రత్యేకత ఉంది.

ఇట్లా ఆనాడు ప్రజాస్వామ్య పద్ధతులున్నాయని, స్వయంపాలన ఉండేదని చెప్పడానికి ఈ విభేదాలను చెప్పాను. ఇదంతా పాశ్చాత్యులు కన్ను తెరవకముందే ఒక పద్ధతిలో సాగేపాలన ఉండేదని గుర్తించండి. ఇక్కడున్న ప్రజలు పాలితులే కాదు, పాలనలోనూ భాగస్వామ్యం వహించారు.

## అర్హత ప్రధానము

పాలన అంటే ఆషామాషీ వ్యవహారం కాదు. ప్రభుత్వము నడుపుట, శాంతి భద్రతలను సంరక్షించుట, చట్టాలను తయారు చేయుట, ఆచరణలో పెట్టునట్లు చేయుట మొదలైన పనులకు విద్యార్హతలు, లౌకికమైన తెలివితేటలు, సమయస్ఫూర్తి, అనుభవం ఎన్నో ఉండాలి. ఇంటిని చక్కదిద్దాలన్నా ఎంతో కష్టపడుతున్నామో ఆలోచించండి. ఇక రాజ్య వ్యవహారం మాటలా? ఇంటినే నిర్వహించలేనివారు, ఒక పెద్ద రాజ్యాన్ని నిర్వహించగలరా?

అందువల్ల ప్రతివాడు వేలు పెట్టదగదు. పై అర్హతలున్న కొద్దిమందికే సాధ్యం.

## రాష్ట్రానికి పెద్ద - రాజు

పరిపాలన చేసేవారికి క్రమశిక్షణ తప్పని సరి. ప్రజలలో క్రమశిక్షణ కలిగించాలి రాజు. దేశం పట్ల ప్రేమానురాగాలు, భక్తి, విధేయత ప్రజలకు

ఉండాలి. దేశంతో మమైకమైన భావన ప్రధానం. దేశం అంటే మట్టి, పర్వతాలతో, నదులతో కూడినదే మాత్రం కాదనే భావన ఉండాలి.

ఇవి చక్కబడాలంటే రాజ్యానికి, ఒక పెద్ద ఉండాలి కదా! అతన్ని రాజు అని అన్నారు. ఈ పదవి వంశపారంపర్యంగా వచ్చేది పూర్వకాలంలో చిన్నప్పటినుండి అతనికి తర్ఫీదు ఈయబడేది. నాయకత్వ లక్షణాలు సహజంగా వచ్చేవి. నేర్పేవారు కూడా అందుకే రాచరిక వ్యవస్థ చాలాకాలం సాగింది.

అయితే ఇష్టం వచ్చినట్లు ఆ రాజు ప్రవర్తించడానికి వీలు లేదు. ప్రాచీన కాలం నుండి వస్తున్న ధర్మశాస్త్ర నియమాలను, నీతిశాస్త్ర (రాజనీతి) నియమాలను తప్పక పాటించవలసిందే. కట్టుబాట్లతో, నియమాలతో సాగేది. అతడు రాజ గురువులను సంప్రదించేవాడు, అంతేకాదు మంత్రులను, మేధావులను, సలహాలిచ్చే సభలో నున్న సభ్యుల మాటలను అంగీకరించే వాడు. అనుసరించేవాడు.

## నగరాధ్యక్షుడు

ఒక్కొక్క ప్రాంతం యొక్క బాగోగులు విచారించడానికి స్థానిక ప్రభుత్వం ఉండేది. అయితే ప్రతి స్థానిక సంస్థకు ఒక్కొక్క రాజంటే కప్పలతక్కిడ వ్యవహారమై పోతుంది. స్థానిక వ్యవస్థలో ఆయా ప్రాంత పరిపాలన సాగుతూ ఉన్నా కేంద్రం యొక్క అదుపాజ్ఞలలోనే సాగేది. కేంద్రవ్యవస్థ తప్పనిసరి. స్థానిక సభలలో పరస్పర వైషమ్యాలు లేక పరస్పర సహకార భావంతోనే సాగేవి. మొత్తం రాష్ట్రం యొక్క శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని సాగేది. దేశానికి జాతీయ గౌరవం నిమిత్తం ఒక రాజు పాలించేవాడు. దేశంలో ఉన్న ప్రతి చిన్న ప్రాంతానికి ఒక్కొక్క రాజుండవలసిన అవసరం లేదు. ప్రజలలో తన దేశం అనడం కంటె తన ప్రాంతం అభివృద్ధి కోసం అఖ్ఖులు

చూస్తూ ఉంటారు కదా! స్థానిక వ్యవస్థ ఈ అవసరాన్ని తీర్చేది.

ముందు తన కుటుంబం, తరువాత తన గ్రామం లేదా పట్టణం, తరువాత దేశం గురించి ఆలోచిస్తాడు సగటు మానవుడు. మహాత్ములేమంటారంటే మొత్తం ప్రపంచాన్నే ఒక కుటుంబంగా భావించాలంటారు. భావిస్తారు. తన పట్టణం అంటే అందలి నదులు, పర్వత ప్రాంతాలు, చెట్లు, ఆలయాలు, వీటితో తోటి ప్రజలపై మమకారం, ఉండడం సహజం. మొత్తం దేశమంతటినీ ఇట్లా సగటు మానవుడు తనదని చూడలేడు. కనుక ఎక్కడో ఉన్న రాజుకంటే తనకందు బాటులో నున్న పాలకులపట్ల, అధికారులపట్ల ఎక్కువ అనుబంధం కల్గియుంటారు.

అయితే స్థానిక సభలకూ ఒక పెద్ద ఉండాలి. ఇతనికేమీ కిరీటం పెట్టరు. రాజుకున్న బాధ్యతలూ ఇతనికి ఉండవు. ఇతడు స్థానిక వ్యవహారాలను తీర్చి దిద్దడానికి ఔరసత్వం అవసరం ఉండదు. రాజు మాదిరిగా ఇతనికి శిక్షణ అక్కరలేదు. స్థానిక సమస్యలను పరిష్కరించడానికి ఔరసత్వం ఉంటే లేని పోని చిక్కులు తెచ్చుకొన్నట్లవుతుంది. దేశం మొత్తం శాంతిభద్రతల రక్షణ, శత్రుదండ యాత్రలనుండి కాపాడుకోవడం మొదలైనవి ఎన్నో రాజునకుంటాయి. అట్టి సమస్యలు స్థానిక ప్రభుత్వంలో ఉండవు. వీటికీ ఔరసత్వ నియమం ఉంటే అదేదో మనకెందుకులే ఎవరో చూసుకొంటారనే నిర్లక్ష్య భావన సామాన్య జనులలో ఏర్పడుతుంది. గ్రామ, పట్టణ పరిపాల నలో అతడేకం కాలేదు. అందువల్ల లేదు.

మొత్తం దేశానికి సలహాలిచ్చే సభ్యులతో కూడిన సభలుండగా, మామూలు పట్టణ వ్యవహారాలకు చిన్న చిన్న సభలుండేవి. రాజసభలలో కేవలం సలహాలనీయగా నిర్ణయం మాత్రం రాజుదే. కాని స్థానిక పరిపాలన వేరు. ఇందలి సభయే నిర్ణయాలు చేసేది. సభలలో సభ్యులున్నా ఒక పెద్ద, వీరిని అదుపులో ఉంచి వ్యవహారాలను నడిపేవాడు.

## పంచాయితీలలో ఎన్నికలు

రాజు, అతని సలహాదారులు, స్థానిక సభలలోని సభ్యులు కలిసి మొత్తం రాజ్యాన్ని నడిపేవారు.

సలహాలిచ్చే సభలలోని సభ్యులు ఎవర్ని పడితే వారిని నియమించవచ్చా! కాదు. రాజసభాసభ్యులను చాలా అర్హతలున్న వారినే ఎన్నిక చేసేవారు. స్థానిక సభలోలనూ అర్హత కలిగినవారినే సభ్యులుగా ఎన్నుకొనేవారు. వీరికి ఒక ఎన్నిక పద్ధతి యుండేది. ఈ ఎన్నిక, ఎన్నుకొన్నవారికి ఒక తృప్తి నిచ్చేది! మనం ఫలానా వారిని ఎన్నుకొన్నాం, ఎన్నుకొనగలిగాం అని ప్రజలలో ఒక తృప్తి కలిగేది.

ఈ ఎన్నిక విధానమే ప్రజాస్వామ్య పద్ధతికి వెన్నెముక. ఇది చోళుల కాలంలో ఉండేది. మనమూ ఎన్నుకొంటున్నాం. అయితే వారి ఎన్నికలకు, మన ఎన్నికలకూ తేడాను వివరిస్తాను.

రాజు పట్టాభిషిక్తుడైనపుడు అతని తండ్రి రాజ్యంలో ఉన్న సలహాదారు లితనికి బాసటగా ఉండేవారు. వారు ఉద్యోగ విరమణ చేసిన వెనుక పరిపక్వత పొందిన రాజు సలహాదారులను తానే నియమించుకొనేవాడు.

అయితే పంచాయితీ ఎన్నికలలో ప్రజలే సభ్యులను ఎన్నుకొనేవారు. ఎవరో నియిమించిన వారు కాదు. అదే చోళుల కాలంలోని ప్రత్యేకత.

## ప్రజాప్రభుత్వం - ప్రజాస్వామ్యం

కాని నేడు (1949లోనివి ఈ ఉపన్యాసం) స్థానిక సంస్థలలోనేగాక, శాసన సభలలో, లోక్‌సభలో ప్రజలే అందర్నీ ఎన్నుకొంటున్నారు కదా!

మనం ఎన్నుకొనేటపుడు ప్రజలందరికీ తిన్నగా ప్రభుత్వంలో బాధ్యత ఉండదు. దానిని కొంతమంది ప్రతినిధులకు కట్టబెడుతున్నాం.

అన్ని వర్గాల ప్రజలుండాలనే అభిప్రాయాన్ని అమలు పర్చలేకపోతున్నాం.

ఇట్లా అనేవారూ తక్కువ ఉండడం వల్ల ఆచరణలో సాధ్యం కావడం లేదు.

పోనీ, విద్యావంతులనే ఎన్నుకొందామన్నా అందరూ స్వార్థరహితంగా ఉండగలరా? నిరక్షరాస్యులకంటే వీరే మేలని భావించినా అమలు పర్చలేకపోతున్నాం.

## చోళుల కాలంలో పంచాయితీ ఎన్నికలు

ఎవరో, ఎవర్నో నియమించడం కంటె ప్రజలే స్థానిక సభ్యులను ఎన్నుకొనేటట్లు చోళుల కాలంలో ఉండేది. రాజులు నియమించే పద్ధతి కాదు. అర్హత కల వారికే ఓటుహక్కు అనే పద్ధతినీ పాటించక ఎన్నికలుండేవి.

క్రీస్తుపూర్వం మూడు లేక నాల్గవ శతాబ్దంలో తమిళనాడుని చేర, చోళ, పాండ్యులు పరిపాలించేవారు. ప్రాచీన సంగం సాహిత్యం కూడా పెక్కుమంది చోళరాజులను పేర్కొంది. పురాణ ప్రసిద్ధుడైన ముచుకుంద చక్రవర్తి తిరువారూర్‌ని రాజధానిగా చేసుకొని పాలించాడని మనునీతి చోళుడనే రాజుండేవాడని అట్లే కరకాలచోళుడు, కోబెంగట్ చోళుని గురించి సాహిత్యంలో ప్రస్తావించబడింది.

చోళుల తరువాత క్రీ.శకం తరువాత ఐదవ శతాబ్దంలో పల్లవులు పాలించారు. తొమ్మిదవ శతాబ్దం మధ్యభాగంలో విజయాలయ చోళుడు రావడం, మరల చోళరాజ్యం తల ఎత్తింది. ఇక రాజరాజ నరేంద్ర చోళులు కాలంలో వారి రాజ్యమూ బాగా విస్తరిల్లింది. వారి తరువాత నాల్గువందల సంవత్సరాలు చోళరాజ్యం కీర్తి పతాకాలతో రెపరెపలాడింది.

## ఎన్నికలు - రాతిశాసనం

నేను చెప్పే ఎన్నికల విధానం విజయాలయచోళుని తరువాత వచ్చిన పరాంతక చోళుని కాలంలో ఉండేది. వేయి సంవత్సరాల వెనుక (920లో) వేయబడిన శాసనంలో ఈ ఎన్నికల విధానం పూస గ్రుచ్చినట్లు చెప్పబడింది.

ఇది కంచీపురానికి దగ్గరలో నున్న ఉత్తర మేరూర్‌లో ఈ శాసనం ఉంది.

ఇది నేటిలో లోక్‌సభకు, శాసనసభల ఎన్నికకు సంబంధించినది కాదు. చోళ రాజ్యంలో అనేక సభలుండేవి. నాటి స్థానికమైన ఎన్నికలకు చెందిందే.

## వారి రాజ్యంలో విభాగాలు

నేటి జిల్లా, తాలూకా, ఫిర్కాల మాదిరిగా ఆనాడు విభజనలుండేవి. అందు పెద్ద విభాగం మండలం. ఆ మండంలో వయనాడుండేది. ఇది 18 స్థానిక సంస్థలుండేది. వయనాడులో మరల కూట్రం, కొట్టం, చివరగా ఊరు అనే విభాగం ఉండేది. ఊరనగా గ్రామమే కదా! ఆనాడు వ్యవసాయానికే పెద్దపీట వేసేవారు, వ్యాపారానికి తక్కువ అవకాశం ఉండడం వల్ల పట్టణల సంఖ్య తక్కువగా ఉండేది. అసలు పట్టణాల కంటె ఈ గ్రామాలే కలకలలాడుతూ ఉండేవి. ఉత్తర మేరూర్ అటువంటి ఒక గ్రామం. అయితే చిన్నది మాత్రం కాదు. శాసనాన్ని బట్టి ఇందు 32 విభాగాలుండేవి. నేటి వార్డుల వంటివి. ఈ వార్డుల పద్ధతి నేడు పట్టణాలలో ఉంది.

ఆ గ్రామంలో ప్రతి వర్ణానికి, వృత్తికి ఒక పెద్ద ఉండేవాడు. అతణ్ణి నాట్టాణ్మె అనేవారు. ఇంతకు ముందు శ్రేణులను గుర్తించి చెప్పాను. అట్టి శ్రేణులలో ఒక్కొక్క పెద్ద వుండేవాడు. ఇందు వర్తక శ్రేణులను నాగరం అనేవారు. అందువల్ల రామనాథ పురంలోని వారిని నాట్టుకోట్టె అనేవారు. వీరందరూ వర్తక శ్రేష్ఠులు. అట్లే ప్రాచీన తమిళదేశంలో తమ వర్ణవ్యవహారాలను కల్పించే బ్రాహ్మణుల సభ ఉండేది. ఇట్లా ఒక్కో వర్ణం యొక్క సమస్యలే కాకుండా గ్రామంలోని అన్ని సమస్యలను అనగా వ్యవసాయం, నీటిపారుదల మొదలైనవాటిని అన్నిటిని ఒక ఊరులో నున్న సభ చక్కబెట్టేది. ఇందన్ని వర్ణాలకు ప్రాతినిధ్యం ఉంది. దీనిని ఊరుసభ యనేవారు లేదా గ్రామసభ. వీటి సంగతులే ఆతి శాసనాలలో ఉన్నాయి.

## గ్రామసభా నిర్మాణం

ప్రతి ఊరు, కొన్ని కుడుంబులుగా పట్టణాలలో వార్డుల మాదిరిగా విభజింప బడి యుండేది. ఇట్టి విభజన ఆదిత్య చోళుని ఱాతిశాసనంలో ఉంది. ఈ శాసనం చంద్రలేఖా చతుర్వేది మంగళంలో ఉంది. ఇది ఉత్తరమారూర్ శాసనానికి 50 సంవత్సరాల వెనుకటిది. ఒక్కొక్క కుడుంబం నుండి ఒక్కొక్క ప్రతినిధి యుండేవాడు. ఈ ప్రతినిధుల నెన్నుకొనేవారు ప్రజలు. వీరిని రాజు నియమించేవాడు కాదు. ఈ సభలలో సభ్యత్వం ఔరసత్వంగా సంక్రమించింది కాదు. ప్రభుత్వం నియమించినదీ కాదు. ఎన్నికలే.

అందు నేటి బ్యాలెట్ పద్ధతి ఒకరకంగా ఉండేది. ఇందు ప్రతివ్యక్తి ఓటు వేసేవాడు కాదు. వివరిస్తా.

## ఱాతిశాసనాల వివరాలు

గ్రామాలలో ఎట్లా ఎన్నుకొనబడేవారో అనేక తామ్రశాసనాలలోను, ఱాతిశాసనాల లోను వివరింపబడింది.

మాయవరం తాలూకాలో ఒక శివాలయం ఉంది. అందలి శివుని పేరు కుట్రమ్ పోరుత్తీశ్వరర్. అనగా తప్పులను క్షమించేవాడని అర్థం. ఇందలి ఱాతి శాసనంలో తన తప్పును క్షమించమని ఎవరైనా తనగురించి ప్రార్థించవచ్చు. కాని ప్రజాజీవితంలో మచ్చలేని జీవితాన్ని గడపాలనే చక్కని మాట ఉంది. ఇందు సభ్యుల అర్హత గురించి ఉత్తర మేరూర్‌లో ఉన్నట్లుంది. ఒక వయస్సు దాటిన తరువాత సభలలో సభ్యునిగా ఉండకపోవుట, అతని బంధువులు కొంతకాలం సభ్యులుగా ఉండకపోవుట మొదలైన వివరా లున్నాయి.

ఈ శాసనాలు ఉత్తమ చోళుడు, సుందర చోళుడు, మొదటి రాజరాజు,

మొదటి రాజేంద్రుడు, మొదటి కులోత్తుంగుని కాలానికి చెందినవి. అట్లాగే రాగిశాసనాలు కూడా. విపులంగా ఉత్తరమేరూర్ శాసనం చెప్పింది.

ఈ గ్రామంలో రెండు సంవత్సరాల వ్యవధిలో రెండు శాసనాలున్నాయి. మొదటిది సంక్షిప్తంగా రెండవది విపులంగా పేర్కొంది. ఇదే పరాంతక చోళుని కాలానికి చెందింది.

ఏదైనా ఒక ప్రదేశంలో అవకతవకలు జరిగితే చోళరాజు తగిన అధికారులను పంపి సరిదిద్దేవాడు. ఇది వేయి సంవత్సరాలు వెనుకటి మాట. మొదటి ఒక అధికారిని రెండు సంవత్సరాల తరువాత మరొక అధికారిని పంపినట్లుంది. ఈ అధికారులు ఎన్నికల నిర్వహణను వహించినట్లు స్పష్టమైంది.

## బ్రాహ్మణ, వేలాల అధికారులు

పైవారిలో ఒకడు వేలాల కులానికి చెందినవాడు. మరొకని పేరు చివర సోమయాజి అని ఉంది. శాసనంలో సోమాశి. బ్రాహ్మణుడని గుర్తు చేసేవే సోమాశి, క్రమవిద్వాన్ (క్రమపాఠి), భట్టన్ అనే పదాలు.

వేద ఉచ్చారణను గట్టి చేసేదే క్రమపాఠం, వర్ణం, జట, ఘనం అనే విధానాల ద్వారా వేదపాఠం ఉంటుంది. స్వరలోపం, వర్ణలోపం లేకుండా చేసే పద్ధతులవి. లోకంలో క్రమపాఠి, ఘనపాఠి, జటావల్లభ అనే పేర్లను వింటాం. తమిళ దేశంలో క్రమపాఠి ని క్రమవిద్వాన్ అంటారు. చోళరాజు శాసనాలలో పెక్కుమంది క్రమవిద్వాంసుల ప్రస్తావన వస్తుంది. ఎందరో వేద విద్వాసులున్నట్లు స్పష్టం.

నేటి అయ్యర్, శాస్త్రి, వర్మ పదాల మాదిరిగా పూర్వం భట్టన్ అని వ్యవహారం ఉండేది. క్షత్రియులను చివర వర్మన్, వైశ్యులకు చివర గుప్త, బ్రాహ్మణులకు శర్మ అని ఉండేవి. మహారాష్ట్రలో భట్టోజీ, కర్ణాటకలో భట్, బెంగాలులో భట్టాచార్య అనే పదాలుంటాయి. వీరందరూ బ్రాహ్మణులు.

## సభ్యులకు అర్హతలు

ఉత్తర మేరూర్ శాసనంలో సభ్యులకు అర్హతలిట్లా ఉంటాయి. 1. పన్నుకట్టడానికి వీలైన కొంత భూమి ఉండాలి. 2. తన స్థలంలో తానే కట్టుకొన్న ఇల్లు ఉండాలి. 3. వయస్సు అరవై దాటి యుండకూడదు. 30 సంవత్సరాల లోపు ఉండకూడదు. రెండవ శాసనంలో వయస్సు 60 నుండి 70 వరకు 30 నుండి 35 వరకూ అని మార్చింది. అంటే ఒక శాసనం చేసిన తరువాత అట్లాగే దీనినుంచకుండా చేర్పులు మార్పులు చేస్తారన్నమాట.

## సవరణలకు వీలైనవి, వీలుకానివి

ఆనాడు ధర్మశాస్త్రాల ప్రకారమే ప్రజాపాలన ఉండేదనే విషయాన్ని విస్మరించకూడదు. రాజులను గూర్చి, మనునీతిని దాటనివాడు, పాటించే వాడనే ప్రశస్తులున్నాయి. అందువల్ల కొన్ని ముఖ్యమైన సవరణలను చేసేవారు కాదు.

మనుస్మృతిని ధర్మశాస్త్ర మన్నారే కాని నీతిశాస్త్రమనలేదు. ఇందలి ధర్మాలు మొత్తం సంఘానికి, వ్యక్తులకు సంబంధించినవే. ధర్మంలో ఒక భాగంగానే రాజనీతిని పరిగణించేవారు.

తరువాత వచ్చిన శుక్రనీతి, అర్థశాస్త్రం రాజనీతికే ప్రాధాన్యం ఇచ్చినా అవి కూడా ధర్మ శాస్త్రానికి లోబడే ఉన్నాయి. రాజనీతి శాస్త్రంలో కొన్ని సడలింపులుంటాయి. అయితే అవి ధర్మ శాస్త్ర మూలాలాను ఛేదించేవిగా ఉండేవి కావు. ఎక్కడైనా ధర్మశాస్త్రానికి విరుద్ధంగా కొన్నిటిని ప్రతిపాదిస్తే విద్వాంసులు వాటిని తిరస్కరించేవారు. 14 విద్యలలో ధర్మశాస్త్రం ఒకటి. అర్థశాస్త్రం కంటె పైమెట్టులో ఉండేది. అందుకే ఆనాటి రాజులు మనుధర్మ శాస్త్ర ప్రవర్తకులగా చెలామణి అయ్యేవారు.

ధర్మశాస్త్రమనే పేరును కాపాడేవారు. కొన్ని సవరణలున్నా అట్టివి అదనపు

కొమ్మలుగా, రెమ్మలుగా పరిగణించేవారు. వేరున కెట్టి ప్రమాదమూ లేకుండా చూసేవారు. కొన్ని కొమ్మలను నరకడం ఎటువంటిదో సవరణలు చేయడం కూడా అట్టిదే. అటువంటిదే పైన చెప్పిన వయస్సు సవరణ (సభ్యుల మూడవ అర్హత).

## శాస్త్రజ్ఞానము

నాల్గవ అర్హత – వైదిక ధర్మం పట్ల పూర్తి అవగాహన ఉండాలి. అనగా విద్వాంసుడై యుండాలి. కొందరికి శాస్త్రజ్ఞానం ఉన్నా అమలు పరచలేరు. అందుకే మొదటి రెండు అర్హతలను పేర్కొన్నారు. అనగా సభ్యులకు ఆస్తి యుండాలి. అది అక్రమంగా సంపాదించిన ఆస్తి కాకూడదనే నియమాన్ని గుర్తించండి. సభ్యులుగా ఎన్నుకొనబడిన తరువాత కూడా అక్రమంగా సంపాదించకూడదు.

అట్లా ధనం విషయంలో పవిత్రత ఉండేది. నైతికమైన విలువలను పాటించడం జరిగేది.

## జీవితకాలమూ సభ్యుడు కాదు

ఈ ఎన్నికలు ప్రతియేటా జరుపబడుతూ ఉండేవి. ఒక సంవత్సరంలో ఒక మాటు ఎన్నుకొనబడిన తరువాత వరుస మూడు సంవత్సరాలలో నిలబడకూడదు. 3 సంవత్సరాల తరువాత ఎన్నుకొనబడవచ్చు.

ఎందుకిట్లా చేసారో గమనించండి. అధికార దాహం పనికిరాదు కదా! ఎక్కువకాలం అధికారంలో ఉంటే అనేకనర్థాలు ప్రాప్తిస్తాయి. ధన విషయంలోనూ పవిత్రను కాపాడడం కోసమే.

## బంధువుండకూడదు

చివరి నియమం ఏమిటంటే ఎన్నుకొనబడిన సభ్యులలో ఒకనికి మఱొకరితో బంధుత్వం ఉండకూడదు.

## ధన వ్యయంలో నియమం

ఈ నియమాల విశిష్టతను సమీక్షిద్దాం. సభ్యునకు కొద్దిపాటి భూమి యుండుట, భూమిపై పన్ను కట్టుట ఉండాలి. భూమి ఎప్పుడైతే ఉందో పన్ను కడతాడు కదా! పన్ను గురించి మరల చెప్పాలా? కాని ఆ రోజులలో రాజమాన్యాలుండేవి. బ్రాహ్మణుని మొదలు కొన్ని వృత్తులవారికి మాన్యాలుండేవి. వీటికి పన్నులుండేవి కావు. దీనిని ఇరైయిలి అనేవారు తమిళంలో. ఇరై యనగా పన్ను. అనగా దానంగా వచ్చిన భూమిని కలిగి యుండరాదన్నమాట. అనగా స్వీయసంపాదనతోనే భూమిని కలిగి యుండాలి. లేదా తాత తండ్రుల ఆస్తి కావచ్చు.

## ఆదర్శవంతమైన ధర్మం - ఆచరణలో ఎంత?

సభ్యులకు, ఆస్తికి సంబంధం ఏమిటి? ఏమీ లేనివాడు నిలబడకూడదా? సమానమైన హక్కుల గురించి మాట్లాడేటపుడు సబబే. కాని రోజువారీ రాజకీయ వ్యవహారాలలో కొన్ని నియమాలు తప్పవు.

కొన్నిటిని సవరించడంలో వెనుకడగు వేయలేదు. కొన్నిటిని తు.చ. తప్పక పాటించేవారు కూడా. ఆదర్శమనేది ఆచరణాత్మకంగా ఉండాలే కాని ప్రదర్శించడానికి కాదు. ఈ దృష్టిలో వర్ణాలని, ఆశ్రమాలని విభజన చేసారు. సవరించడం అంటే అధర్మానికి జెండా ఊపడం కాదు. ఏ ధర్మమైనా కఠినంగానూ ఉండకూడదు. మరీ వదులుగానూ ఉండకూడదు. రాజనీతిలోను ఇదే పద్ధతి కొనసాగాలి. నిత్యవ్యవహారంలో ఉండేది రాజనీతి. అర్థశాస్త్రకాలం నుండి చోళుల వరకూ పాలన మానవ మనస్తత్వాన్ని దృష్టిలో పెట్టుకొని సాగింది.

ఈనాటి రాజనీతికి, ఆనాటి ధర్మశాస్త్రానికి సంబంధం లేదు.

## మహమ్మదీయుల, తెల్లదొరల కాలంలో

మహమ్మదీయుల కాలంలో వారి మతంపట్ల అచంచల విశ్వాసంతో ఉండేవారు. మన ధర్మ శాస్త్రం మాదిరిగా వారికి షరియత్ ఉంది. దానినుసరించి న్యాయనిర్ణయాలు చేసేవారు. దానికీ మన ధర్మ శాస్త్రానికీ పోలిక లేదు. వారు మన ధర్మాన్ని, మతాన్ని అణచడం కోసం అహరహమూ ప్రయత్నించేవారు. కనుక హిందువుల పట్ల అవైదికంగానే వారి పాలన సాగేది.

అయితే మరొక విధానాన్ని పాటించేవారు. బలవంతంగా మతాన్ని మార్చినా, మారబడని వారిపట్ల కొంత ఉపేక్షా భావం వహించి వారి వారి ధర్మాలను వారు పాటిస్తున్నా తల దూర్చేవారు కాదు. వారు రాకముందు వర్ణాలలో ఏ కట్టుబాట్లుండేవో అవే కొనసాగుతూ ఉండేవి. కులపెద్దలు తీర్పులు చెప్పడం, వాటిని మనవారు పాటించడం జరుగుతూ ఉండేది. తిన్నగా నవాబు దగ్గరకు వెళ్ళిన సందర్భాలు తక్కువ. అంటే వర్ణవ్యవస్థ కూకటి వ్రేళ్ళతో పెకలింపబడలేదు.

హిందూ సంఘానికి అన్వయించే రాజ్య నియమాలను ఏర్పాటు చేయడానికి ముందు మన ధర్మ శాస్త్రాలను విరుద్ధంగా మాత్రం ఉండేవి కావు. మతం మారనివారి పట్ల వారి నియమాలను రుద్దేవారు కాదు. ఎందుకంటే బహుళ సంఖ్యలో నున్న హిందువులను ఏలడంలోని చిక్కులను గమనించారు.

కత్తి చూపి మహమ్మదీయులు మనలను మార్చగా తెలివిగా హిందూ ధర్మాన్ని నాశనం చేయడం తెల్లదొరల వంతైంది. ఉద్యోగాలీయడం, వారి విద్యను వ్యాప్తి చేయడం వల్ల మనవాళ్ళు మన ధర్మాన్ని విడిచి పెట్టేటట్లు చేసారు. చరిత్ర, భాషా పరిశోధనల పేరిట మనలో మనకే ఏవగింపు, కలిగించేటట్లు చేసారు. ఒకవేళ హిందువుగా పైకి కన్పిస్తున్నా మన శాస్త్రాలను

పట్ల మనకు విశ్వాసం లేకుండా చేయగలిగారు. కొంతమందిని వారి మతంలోకి మార్చారు కూడా.

రాజ్యానికి, మతానికి సంబంధం లేకుండా చేసారు. పాశ్చాత్య దేశాలలో రోమన్ క్యాథలిక్ మతం లూథరన్ మతం ఉన్నా చర్చిని, రాజ్యాన్ని విడదీసి చూపించి రాజ్య విషయాలలో మత ప్రసక్తి లేకుండా చేసారు. రాజ్య విషయాలలో ఈనాటి చర్చి పరిమితంగా జోక్యం చేసుకొంటోంది. ఉదా: ఇంగ్లండు రాజు క్రొత్త బిషప్పు వర్గాలను ఏర్పాటు చేయడం, కొన్ని పదవులనీయడం, పట్టాభిషేక సమయంలో పెద్ద పీఠాధిపతులు పాల్గొనడం వంటివి నామమాత్రంగా ఉంటాయి. అంతేనే కాని మత నాయకులు ప్రభుత్వం చేసే చట్టాలలో జోక్యం చేసుకోరు. షరియత్ వంటిది క్రైస్తవులలో లేదు. క్రీస్తుకు పూర్వమున్న హిబ్రూలలో మన ధర్మ శాస్త్రం వంటిది, షరియత్ వంటి నీతి శాస్త్ర గ్రంథము ఉండేది వారికి. కాని ఇది జుడాయిజం, క్రైస్తవంగా చీలిపోయింది. క్రీస్తు, నీతిగురించి శీలం గురించి ప్రవచించినా పై ధర్మశాస్త్రాల వంటి దానిని ఈయలేదు. కాని చాలాకాలం నుండి మతనాయకుడైన పోప్‌నకు; రాజునకు తగాదాలుండడం వల్ల మతం, రాజనీతి విడివిడిగానే ఇంగ్లండు వంటి దేశాలలో ఉన్నాయి. ప్రభుత్వం కూడా మత విషయాలతో జోక్యం చేసుకోదు. మత రహితంగానే మన సెక్యులర్ ధోరణిలో ఉంటుంది. యూరప్ దేశాలలో ఆధునిక శాస్త్రం బాగా అభివృద్ధి చెందింది. ఆధునిక శాస్త్ర సంగతులకు, వారి మత సూత్రాలకు పొంతన లేకపోవడం వల్ల వారి మతారాధన బలహీనమైనంది. కాని మహమ్మదీయులలో అట్లా కాదు మత నియమాలను వారుల్లంఘించరు.

## ఆస్తిననుసరించి ఓటుహక్కు

అందరికీ ఓటుహక్కును వారు ప్రసాదించారు. ఆస్తి కలవాడే ఓటు వేయడానికి అధికారియనే మాటను వారంగీకరించలేదు.

కాని ధరావత్తుగా కొంత పైకం ఎన్నుకొనబడేవాడు చెల్లించాలి. ఇది కూడా నియమించకపోతే ప్రతి వ్యక్తి ఎన్నికలను ఆషామాషీగా తీసుకొంటాడు. అయితే బీదదేశమైన మనదేశంలో ఈ ధరావత్తును చెల్లించలేని వారుండడం వల్ల అందరూ సమానులనే భావనకు తూట్లు పడుతోంది కదా! అప్పుచేసి ఎన్నికలలో ధారాళంగా డబ్బును ఖర్చుపెట్టడం వల్ల అవినీతిని ప్రోత్సహించి నట్లే కదా! అందుకనే పూర్వులు పన్ను కట్టే యోగ్యత కల కొంత భూమి, స్వీయధనంతో ఇల్లైనా కట్టాలనే నియమాన్ని ఉంచారు.

## లంచానికి తక్కువ అవకాశం

ఆస్తి కలవారు సాధారణంగా లంచాలకు కక్కుర్తి పడరు. ఈ అభి ప్రాయంతో కొందరేకీభవించక పోవచ్చు. లక్షలు గడించినవాళ్ళు లంచాలు పుచ్చుకోవడం లేదా అని ప్రశ్నించవచ్చు. ఇట్లా డబ్బుకై పరుగెత్తడం ఇటీవల బాగా ప్రబలింది. పూర్వం ఇంతగా లేదు. ఆధ్యాత్మిక దృష్టి ఎప్పుడైతే సన్నగిల్లిందో విలాస వస్తువులపై మోజు అంతగా పెరిగింది. కాగితపు కరెన్సీ, డబ్బు దాచుకొనే బ్యాంకింగ్ వ్యవస్థ వల్ల ప్రజలలో అక్రమంగా సంపాదించింది దాచుకోవడం, (బినామీ పేర్లతో దాచడం) మొదలైనవి బయలుదేరాయి. పూర్వులు మనకంటె నీతి నియమాలను పాటించే వారనడంలో సందేహం లేదు. మితిమీరిన కోర్కెలు వారికి లేవు. దాచుకొనే సదుపాయాలూ పూర్వం లేవు. అందువల్ల వాళ్ళు లంచాలకు మరగలేదు. ఈనాడు ప్రతి వ్యక్తి చేయి చాస్తున్నాడు.

అందరూ సమానమనే ఈ కాలంలో క్యాషియర్ వంటి ఉద్యోగాలకు ముందుగా సెక్యూరిటీ డిపాజిట్లు చెల్లించాలి కదా! దీనివల్ల అర్హుడైన బీదవానికి ఆ ఉద్యోగం దక్కుతోందా? అపుడు సమానత్వానికి అర్థం ఉందా? అయినా మానవ స్వభావాన్ని గుర్తించారు. ఒప్పగించిన ద్రవ్యాన్ని ఆ ఉద్యోగి కాజేసి ఉడాయిస్తే ప్రజల ద్రవ్యాన్ని అపహరిస్తే తగు రక్షణకై ఈ సెక్యూరిటీ

డిపాజిట్టు ఉండాలనే షరతును ఏర్పాటు చేసారు. సభలోని సభ్యుడు లంచాలు తీసుకొన్నా అతనిపై చర్యను తీసుకోవడానికి అతనికున్న ఆస్తి ఉపయోగిస్తుంది.

లంచాన్ని తమిళంలో కైయూటని అంటారు. అంటే చేతిని పోషించడం. (తెలుగులో చేతిని తడపడం). విస్తట్లో అన్నం పెడితే ఏ రకం బియ్యమో చెప్పగలం. నోట్లో తిన్నగా ముద్ద పెట్టినపుడు చెప్పగలమా? అట్లాగే చేతిలో డబ్బును ఎవ్వరికీ తెలియకుండా కుక్కినపుడు జమా ఖర్చులలో చూపించనపుడు అది చేతిని తినిపించడమే అవుతుంది.

కనుక ధరావత్తు కట్టినవారి పట్ల మోజు చూపిస్తున్నారని, కట్టనివానికి అవకాశం ఈయడం లేదని చెప్పనవసరం లేదు. ఒక సభ్యుడు అక్రమంగా డబ్బుఖర్చు చేస్తే అతని ఆస్తిని జప్తు చేయవచ్చు. అందుకే తగినంత భూవసతి, ఇల్లు ఉన్నవానినే ఎన్నుకోవాలనే నియమం పెట్టారు. ఇక్కడ వ్యక్తి యొక్క గౌరవాగౌరవాలతో నిమిత్తం లేదు. ప్రజల సొత్తును కాపాడడమే లక్ష్యం.

ఆపైన ఆస్తిపరుడు, ఎక్కడికో పారిపోడు కదా! ఇది దానంగా వచ్చినదైతే దానిమీద అతనికి మోజు ఉండకపోవచ్చు. కాని సొంత ఆస్తి అట్లా కాదు.

ఆనాడు వేదపాఠాలతో, ప్రశాంతంగా, జీవించేవారు బ్రాహ్మణులు. అటువంటి వారిపట్ల సొంత ఆస్తి ఉండడం అనే నియమం కొంత సడలింపబడింది. వారికి తక్కువ ఆస్తి ఉన్నా ఎన్నుకొనబడేవారు. ఇది సడలింపు మాత్రమే. మినహాయింపు కాదు. ఆస్తి ఉండడం అనే నియమం అందరికీ సమానమే.

## సంపదను నిర్వహించుటలో అనుభవం

గ్రామ సంపదను తగు విధంగా, తెలివిగా, జమాఖర్చులు నిర్వహిస్తూ ఎట్లా కాపాడాలో తెలుసుకోవాలి. అట్టి అనుభవం ఉంటుందనే ఉద్దేశ్యంతో వారికీ సొంత ఆస్తులుండాలని విధించారు. అనుకోకుండా అక్రమంగా వచ్చిన

వానికి ఎట్లా ఖర్చు పెట్టాలో వేటికి ఖర్చు పెట్టాలో తెలియదు. విచ్చలవిడిగా ఖర్చు చేస్తాడు. అందుకే పై నియమం.

సొంత ఇల్లు కట్టుకొని, దానికి పన్నుకట్టేటపుడున్న శ్రద్ధ, పన్ను కట్టనవసరంలేని ఇంటిపై ఉండదు. తన భూమి కాకుండా, ఇతరులకు చెందవలసిన దానిని తన వశం చేసుకొని వాడితే ప్రజాధనాన్ని దుర్వినియోగం చేసి నట్లవుతుంది. నిజాయితీ పరుడనే ముద్ర చెరిగిపోతుంది. తాను నిజాయితీతో ఉండడమే కాదు, నిజాయితీతో ఉన్నట్లు ఇతరులకు ఆదర్శప్రాయంగా ఉండాలి.

## వయస్సు - అర్హత

ఓటుహక్కునకు తగినంత వయస్సని అందరూ నిర్ణయించారు. ఇంత వయస్సని చెప్పలేదు. ఈనాడు ప్రతిపార్టీ వారూ వయసును కుదించాలని ఎన్నికలలో పాల్గొంటారని చౌకబారు ప్రచారానికి లోనై ప్రవర్తిస్తున్నారు. దీనివల్ల అనుభవం లేని వారి సంఖ్య ఎక్కువౌతోంది. 21 సంవత్సరాలు లేదా దాటినవారు అర్హులని ఇంతకుముందటే దానిని కనీసం 18 సంవత్సరాల వయస్సునకు కుదిస్తున్నారు కదా!

అయ్యా! మీరు మఠంలో కూర్చొని ప్రజలలో వచ్చిన వికాసాన్ని గుర్తించేలేకపోతున్నారని మీరు నన్ను ప్రశ్నించవచ్చు. మునుపటికంటె ప్రజలు చాలా తెలివిగా ఉన్నారని సైన్సు వృద్ధి చెందుతోందని, సాంకేతిక రంగాలు అభివృద్ధి చెందాయని, ప్రపంచ జ్ఞానం ఎక్కువైందని మీరు వాదించవచ్చు.

మీరు చెప్పిన మాట నిజమే. బుద్ధి వికసించిందని అంటున్నారు. జీవితం ఏమిటి? ఎట్లా ఇది సఫల మౌతుంది? అనే విషయాలలో నేటివారికి అవగాహన ఉందా? ఆపైన సైన్సు అభివృద్ధి చెందిన కొలదీ మానవత్వపు విలువలు అడుగంటడం లేదా? నేను మఠానికే చెందవచ్చు. కాని నా దగ్గరకు వచ్చినవారినుండి ఈ క్షీణదశను విని తెలిసికొంటున్నా.

ప్రజల సమస్యలను తీర్చడానికి ప్రపంచ జ్ఞానము, జీవితానుభవం రెండూ ఉండవలసిందే. కనుక వయస్సును నిర్ణయించారు. దీనిననుసరించే మొదట 30 సంవత్సరాలు ఉండాలన్నారు. రెండు సంవత్సరాలు తరువాత 35 సంవత్సరాలు ఉండాలన్నారు. కాని నేడు వయస్సును బాగా కుదించ డానికి అన్ని పార్టీలవారూ సమర్థిస్తున్నారు.

ఈనాడు ఫలానా వయస్సు దాటితే ఓటు హక్కు లేదని లేదు. ఎంత వయస్సు వచ్చినా ఓటు, ఈనాడు వేయవచ్చు, సభ్యుడవచ్చు. వయస్సు మీద పడుతున్న కొలదీ శరీరంలో, మనస్సులో మార్పులు వస్తాయి. రకరకాల రోగాలు చుట్టుముట్టుతాయి. ఇదంతా ఎందుకలే అనే వైరాగ్య భావమూ వృద్ధి పొందుతుంది. అట్టి ప్రవృత్తి పాలనకు దోహదం చేయదు. సభ్యునకు క్రమశిక్షణ, చురుకుతనం ఉండాలి కనుక ఫలానా వయస్సు దాటితే సభ్యునిగా ఎన్నుకొనరాదనే నియమం ఇదివరకు పెట్టారు.

మొదట 60 అన్నారు. దానిని 70కి పొడిగించారు. వయస్సు మీరిన కొలదీ అనుభవం గడిస్తాడని పెంచారు. ఉద్యోగాలలో 58 లేక 60 తరువాత విరమణ చేయాలని ఆంక్ష ఉంది కదా! శారీరకంగా పనులు వేగవంతంగా చేయలేక పోయినా బుద్ధి పనిచేస్తుంది కనుక అట్టి వారి సలహాలు ఉపయోగిస్తాయి కనుక సభల ఎన్నికలలో 60 నుండి 70 వరకూ పెంచారు.

## పెద్దల లక్షణాలు

పెద్దలకు సభాప్రాతినిధ్యాన్ని పాశ్చాత్యదేశాలూ గుర్తించాయి. పెద్దల సభ గురించి ఒక శ్లోకం ప్రసిద్ధంగా ఉంది.

**నసాసభా యత్ర న సంతి వృద్ధాః**
**నతే వృద్ధాః యే నవదంతి ధర్మం**
**నసధర్మో యత్ర నసత్యమస్తి**
**న తత్ సత్యం యత్ ఛలేనానువిత్తం**

అనగా వృద్ధులు లేని సభ సభయే కాదు. కేవలం వయస్సు ఎక్కువుంటే సరిపోతుందా? ఎవరు ధర్మం స్పష్టంగా చెప్పలేకపోతున్నారో వారు వృద్ధులే కాదు. ధర్మశాస్త్రంలో పండితులైన వారు మాత్రమే చెప్పగలరు. అనుభవం కలవారే అట్టి సభను అలంకరించాలి.

## ధర్మానికి సత్యమే మూలం

ఒక క్రమశిక్షణ మనకు మంచిని కలిగించినపుడు అదే ఆచరణలో ధర్మమని అంటాం. ఒక పద్ధతి అంటే అపుడు చూడడానికీ బాగుంటుంది. వరుసగా ఒక క్రమపద్ధతిలో దీపాలను అలంకరిస్తే కనువిందుగా ఉండదా? ఏమాత్రం వంకర వచ్చినా సొగసుగా ఉండదు. అనగా కంటికి హృదయానికి అనుబంధం ఉంది. రెంటికీ నచ్చాలి. మన కన్ను క్రమపద్ధతిలో వస్తువులున్నాయా అని చెప్పగలదు. మనకు తెలియకుండానే చెప్పే శక్తి మన హృదయానికి ఉంది. అట్లా వేదశాస్త్రములు సత్యాన్ని చెబుతాయి. వాటికి బాహ్యమైన మనస్సు అర్థం చేసుకోగలదు. మనం చేసేవి ధార్మిక కార్య క్రమాలుగా కనబడినా లోనున్న సత్యంతో జతపడి యుండాలి. అపుడే జీవితానికి సంపూర్ణత్వం. లేనిచో ఈశ్వర పాదారవిందాలను చేరలేం. అందుకే **"న స ధర్మో యంత్ర న సత్యమస్తి"**. ఈ ధర్మం సత్యం మీద ఆధారపడిందని పెద్దలకు తెలుస్తుంది. కనుక వారు సభలను నిర్వహించగలరు.

అయితే వేదశాస్త్రజ్ఞానం నుండి సత్యంపై ఆధారపడిన ధర్మాలను తెలిసి కొన్నంత మాత్రంచే వారుపదేశించడానికి అర్హత వస్తుందా అంటే కాదు. తెలిసి కొన్న దానిని ఆచరణలో పెట్టినపుడే జీవిత పరమార్థం అని తిరువళ్ళువర్ అంటారు. లేకపోతే వారి మాటలు వాగాడంబరాన్ని సూచిస్తాయి. అట్టివారిది మిథ్యాచారమని గీత చెప్పింది. కేవలం సత్యం గురించి చెప్పడం కాదు. అది హృదయాలను కదిలించదు. అది ఆచరణలో ఉండి చెప్పగలిగినపుడు మాత్రమే ఫలిస్తుంది. అందుకే న **తత్** సత్యం

యత్ ఛలేనానువిత్తం. అంటే మోసగాని మాటలు సత్యం కావు.

మొత్తం శ్లోకం యొక్క సారాంశం. పెద్దలు లేనిది సభ కాదు. ధర్మం చెప్పలేనివారు పెద్దలు కాలేరు. సత్యరహితమైనది ధర్మం కాలేదు. కపటి చెప్పేది సత్యము కాలేదు.

ఇట్టి శ్లోకాన్ని లోక్‌సభలో, శాసనసభలలో సూక్తిగా వ్రాస్తే బాగుండును. అన్ని దేశాలూ పాటించవలసిందే.

లోకంలో జ్ఞాన శీల వయోవృద్ధులనే మాట వుంది. వయస్సును బట్టి వయోవృద్ధులంటున్నాం. జ్ఞానం ఉంటే ఆ పదానికి జ్ఞానాన్ని చేరుస్తున్నాం. ఆ జ్ఞానాన్ని ఆచరణలో పెట్టినవానికి శీలపదం చేరుస్తున్నాం. అట్టి వృద్ధులు; సభ్యులు, సభేయులుగా ఉండాలి. అందుకే చోళుల కాలంలో దీనికి ప్రాధాన్యమిచ్చారు. అట్టివారిని సభ్యులుగా ఎన్నుకోవాలన్నారు. అంటే జ్ఞానం, దానిని ఆచరణలో పెట్టుట, దానికి తోడు నిజాయితీ, పవిత్రతలుండాలి.

## కొంతమంది పెద్దలకు మినహాయింపు

ఆత్మజ్ఞానులైనా లోకక్షేమం కోసం ఋషులు ప్రాపంచిక విషయాలను పట్టించుకొనేవారు. ఎంత తపస్సంపన్నులో అంత ప్రపంచజ్ఞాన సంపన్నులు కూడా. వసిష్ఠాది ఋషులు పురోహితులై కొన్ని తరాలవరకూ ఉన్న రాజులకు సలహాలిస్తూ ఉండేవారు. వారికి వయస్సుతో నిమిత్తం లేదు. కలిలోనే వార్ధక్యబాధ.

ఈ కాలంలోనూ కొందరికి వయస్సు మారినా బుద్ధి చురుకుగానే ఉండేది. ఉదా: బెర్నార్డ్‌షా. అట్లే చర్చిల్. ఇతడు ఇంగ్లండు ప్రజలను ప్రపంచ యుద్ధానికి సన్నద్ధం చేసాడు. జీవితాంతం గాంధీగారు చురుకుగానే ఉండేవారు. అది వారి నిరంతర రామనామ జపపారాయణ ఫలమే. ప్రసిద్ధ ఇంజనీర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు సునిశిత బుద్ధి కలిగియుండేవారు. ఇట్లా

అక్కడక్కడ వృద్ధులు నిత్య యువకులుగా మానసికంగా ఉన్నా సాధారణంగా వయస్సునకు పరిమితి పెట్టడం సహజం. ఒక రక్షక భట ఉద్యోగం ఈయాలంటే ఎత్తు, లావు, బలం చూస్తారు కదా! ఒకడు పొట్టిగా ఉండి ధైర్యసాహసాలున్నా మా లెక్క ప్రకారం ఇంత ఎత్తు ఉండాలి కనుక పనికి రావని అంటున్నారు కదా! అట్లాగే ప్రభుత్వోద్యోగులకూ వయఃపరిమితి ఉంది.

## గ్రామసభ్యుల ధర్మాలు

స్థానిక సభ్యులకు, శాసన సభ్యులకు అప్పుడప్పుడు సమావేశాలుంటాయి. వారు ప్రభుత్వోద్యోగుల మాదిరిగా రోజూ కార్యాలయాలకు వెళ్ళనవసరం లేదు. అయినా వయోధర్మాన్ని గుర్తించి 70 సంవత్సరాలవరకు పరిమితిని పూర్వులు విధించారు.

## బాగా వృద్ధులు - సలహా సంఘం

కొందరు ఎంత పెద్ద వారైనా, వారి బుద్ధి పాదరసంలా ఉంటే సలహాలిచ్చే సామర్థ్యం ఉంటే వారిని సలహా సభ్యులుగా నియమించి వారి బుద్ధి నైపుణ్యాన్ని వినియోగించుకోవచ్చు. అది శాసనసభ వంటిది కానక్కరలేదు. ఎవరినైనా వారి దగ్గరకు పంపి వారి సలహాలను ప్రభుత్వం సేకరించవచ్చు. లేదా వారంతట వారే ఎవ్వరూ అడుగకపోయినా సలహాలీయవచ్చు.

అటువంటి పెద్దలు అన్ని రాజకీయ పార్టీలలోనూ ఉంటారు. పార్టీల పరంగా ఏర్పడిన ప్రభుత్వంతో ఇది ఎంతవరకూ సాధ్యమౌతుందో, ఎంతవరకూ చట్ట సమ్మతమో ఆలోచించండి.

ఆనాటి నెహ్రూగారు తమ పార్టీకి చెందని పెద్దలను తన మంత్రివర్గంలో చేర్చుకొన్నారు. (ఉదా: అంబేద్కర్, శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ, జాన్ ముత్తయ్)

కాని ఎన్నికలన్నీ పార్టీపరంగా జరుగుతున్నాయి. పార్టీలతో నిమిత్తం లేని పెద్దలను వినియోగిస్తే బాగుంటుంది.

## ఎన్నుకొనబడని వారిని శాశ్వతంగా ఉంచడంలో చిక్కులు

ఉత్తర మేరూర్ శాసనం మరొక చక్కని విషయాన్ని గుర్తించింది. ఏదైనా ఎవరైనా మంచి పద్ధతులను ప్రవేశపెడితే, త్యాగాలు చేస్తే ఇక మామూలు ప్రజలు అతణ్ణి గ్రుడ్డిగా నమ్మి రానురాను అతడు తప్పులు చేసినా అతన్ని వెనకేసుకొని వచ్చే పద్ధతికి అడ్డు కట్టవేసింది. పై నాయకులు శాశ్వతంగా అధికార స్థానాలలో ఉండిపోతారని భావించి ఒకమాటు ఎన్నుకొనబడినవాడు మరల మూడు సంవత్సరాల వరకు పోటీకి నిలబడకూడదని విధించింది.

సభా నిర్వహణలో ప్రత్యేకంగా నియమింపబడిన సభలుంటాయి (Commitees). అది ఒక వృత్తిగా ఉండడం, సభల చర్చలలో పాల్గొనడం ఉంటుంది కనుక ఎక్కువ వయస్సున్నవారిని నియమిస్తే యువకులకు అవకాశం లేకుండా పోతుంది. తక్కువ వయస్సున్నవారిని నియమిస్తే వారికి తగినంత అనుభవం ఉండదు కనుక వయఃపరిమితిని విధించారు.

## విద్యార్హతలు

ఇక నాల్గవది విద్యార్హత. ఆనాటి విద్య శాస్త్రవిద్యయే. ప్రతీదీ శాస్త్రంలో ముడిపడి యుండేది. భరతశాస్త్రం, విజ్ఞాన శాస్త్రం మొదలైనవి అయినా శాస్త్రాలంటే నాడు వైదిక శాస్త్రాలనే లెక్కపెట్టేవారు. తరువాత ధర్మశాస్త్రం, నీతిశాస్త్రం వచ్చాయి. తరువాత పురాణాలు, భూగోళం, చరిత్ర, లెక్కలు, రసాయన భౌతిక శాస్త్రాలు. అన్ని శాస్త్రాలు కళలు, చతుష్షష్టి కళలు (64) పరిధిలోకి వచ్చాయి. ఇట్లా ఎన్ని శాస్త్రాలున్నా ఒక శాస్త్రం అభ్యసించినవానే శాస్త్రి అని పిలిచేవారు. వేద, ధర్మ, ఆచారాలకు ప్రాధాన్యం ఉండేది.

## ఇది బ్రాహ్మణులకేనా?

సభ్యునకు వేదశాస్త్ర పరిజ్ఞానం ఉండాలని అన్నారు. అయితే సభ్యులందరూ బ్రాహ్మణులేనా? మిగిలినవారికి ప్రాధాన్యం లేదా? అని మరల ప్రశ్నించవచ్చు. అటువంటప్పుడు ప్రజాస్వామ్యమెట్లా అవుతుంది?

కాని గ్రామసభలలో అన్ని వర్ణాలకూ ప్రాతినిధ్యం ఉంది. గ్రామంలో ఉన్న 30 వార్డులనుండి 30 మందిని ఎన్నుకొనేవారు. ఆనాడు ప్రతి వర్ణానికి ప్రత్యేక వార్డులుండేవి. బ్రాహ్మణులు అగ్రహారంలో నివసించేవారు. అట్లాగే అనియర్ వీధి (చేనేత), కరుమర్ (కంసాలులు), చనర్ (కల్లు గీత మొ॥) వారికి ప్రత్యేక వీథులుండేవి. ప్రతి కుడుంబనకు (వార్డు) అగ్రహారం ఉండేది కాదు. ఒకే అగ్రహారం. ఒకవేళ వీరు రెండు మూడు వీథులలో ఉన్నా ఇద్దరు లేక ముగ్గురు సభ్యులు మాత్రమే ఉండేవారు. మిగిలిన వారందరూ అనేక వర్ణాలకు చెందినవారు.

ఆస్తి విషయంలో బ్రాహ్మణులకు కొంత సడలింపు ఉండేది. ఇతడు వేదశాస్త్ర నిపుణుడై యుండాలి. అందు నైపుణ్యం ఉండాలి. వేదం బ్రాహ్మణుడే చదివినా వేదవిజ్ఞానానికి అందరికీ అర్హత ఉంది. లేకపోతే సేక్కియార్, అప్పర్, నమ్మాళ్వార్ వంటి మహానుభావులే పుట్టియుండేవారు కాదు.

చదువు రాకపోయినా విజ్ఞానవంతులకు కొదవలేదు. అట్టివారికి ఎప్పుడూ కొదవలేదు.

ఒకనాటి రాష్ట్రపతి, రాజేంద్రప్రసాద్ ఎన్నుకొనబడిన సభ్యులకు కనీస విద్యార్హతలుండాలని తన అభిప్రాయాన్ని బాహాటంగా చెప్పాడు.

శాసనసభ అనే పదంలో శాసనాలు చేస్తారని అర్థం కదా! న్యాయాధీశులకు న్యాయశాస్త్ర పరిజ్ఞానం ఉండవద్దా? శాసనాలబట్టి వారి తీర్పులుండవా? న్యాయవాదులు వాదించడం లేదా? అటువంటిది శాసనసభలో శాసనాలు చేయాలంటే న్యాయ విషయ పరిజ్ఞానం సభ్యులకుండవద్దా?

సాంఘిక జీవనంలో అనేకాంశాలుంటాయి. రైల్వేలు, తపాలా, పన్నులు, నీటిపారుదల మొదలైనవి ఎన్నో ఉంటాయి. వీటిపట్ల కొద్దిపాటి అవగాహన లేకుండా శాసన సభ్యులుంటే ఎలా?

## గుండెకాయవంటి నియమం

సభ్యుడు, పవిత్రమైన ద్రవ్యం కలిగి యుండాలన్నారు. ధార్మిక క్షేత్రంలో అనాదినుండి ఎంతో ఉన్నత స్థితిలో ప్రజలుండేవారు. మొగస్తనీసు మొదలైనవారు ఎందరో విదేశీ యాత్రికులు ఆనాటి ప్రజల నైతిక ప్రవర్తనను వేనోళ్ళ కొనియాడినట్లు చరిత్ర వెల్లడిస్తోంది.

ధార్మిక ప్రవర్తననుండి తప్పినవానిని సభ్యత్వం నుండి తొలగించేవారు. మరల ఇక ఎన్నికలలో నిలబడడానికి అర్హతను పోగొట్టుకొనేవాడు. ఇతణ్ణే కాదు, ఇతని బంధువులు కూడా ఎన్నికలలో పాల్గొనే అర్హతను కోల్పోతారనే కఠిన నియమం ఉంది.

ఈనాడు నేరం మోపబడినా ఎన్నుకొంటున్నారు. నేరం, ఋజువు కానంతవరకు అతణ్ణి నేరస్థుడనలేమని వాదిస్తున్నారు. *(నేర చరిత గలవారు శాసన సభలలో లోక్‌సభలో కొన్ని వందలమంది ఉన్నారని పత్రికలే ఘోషిస్తున్నాయి. మరల మరల అట్టి వారినే ఎన్నుకొంటున్నాం)* అనేక మాయోపాయాల వల్ల న్యాయస్థానంలో నేరాలు నమోదు చేయబడడం లేదు. పెద్ద పెద్ద నేరాలు చేసినా తెలివిగా చేసి సాక్ష్యాలు లేకుండా చేసి తప్పించుకుంటున్నారు. *(ఇక తీర్పులు చెప్పడానికి కొన్ని సంవత్సరాలు పడుతోంది)*

## అవినీతికి ముఖ్య కారణం

ఎన్నికలలో పవిత్రంగా ఎన్నుకోవడం దుర్ఘటమై పోతోంది. అందరికీ ఓటుహక్కును ప్రసాదించారు. ఆనాటి నీతి నియమాలు సన్నగిల్లడం వల్ల, ఓట్లు వేసేవాళ్ళు చాలామంది బీదవాళ్లై యుండడం వల్ల డబ్బులు తీసుకొని

ఓటు వేస్తున్నారు. బాహటంగా లంచాలీయడం తీసి కోవడం, పూర్వకాలంలో అంతగా ఉండేది కాదు. ఎంత అపకీర్తి దేశానికి తీసుకొని వస్తున్నారో గమనించడం లేదు. కళంకితులను శాసనసభలకు పంపిస్తున్నారు. పెట్టిన ఖర్చు తిరిగి రాబట్టుకోవడం కోసం ఎన్నుకొనబడినవారు పదింతలు, అక్రమ మార్గాలలో సంపాదిస్తున్నారు.

ఈ పుణ్యభూమిలో ఇట్టి పనులను చూస్తూ ఉంటే చాలా బాధగా ఉంది. కొనేవాడు, కొనబడేవాడు అందరూ కళంకితులై అపకీర్తిని తీసుకొని వస్తున్నారు. అన్ని పక్షాలూ అదే మార్గం పడుతున్నాయి. కాని ఓటును ఒక్క పార్టీకే వేస్తారు కదా! అంటే మరొక పార్టీని మోసం చేసినట్లే కదా! ఇది ఇంకా ఘోరమైన నేరం. అంతేకాదు, ఏ పని జరగాలన్నా లంచాలమయమై పోయిందేమిటి?

నేను రాజకీయాల గురించి మాట్లాడడం సబబు కాదని తెలుసు. కాని రాజకీయాలకు ధర్మానికి సంఘర్షణ వచ్చినపుడు, మంచి గుణాలను పాతర వేస్తూ ఉంటే ఎట్లా ఉపేక్షించగలను? ధార్మిక భావనను కలిగించడం మా మత ధర్మం కాదా!

లాకుల తలుపులు తెరుచుకొన్నపుడు నీరు వేగవంతంగా ఎట్లా ప్రవహిస్తుందో అట్లా స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ప్రజలు విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నారు. ఎన్నుకొనేవానికి, ఎన్నుకొనబడినవానికీ ఎట్టి అర్హత లేకుండా సాగిపోతుంది. ఈ ఎన్నికల విధానం నానాకశ్మలంగా ఉంది. ఎన్నికల పేరుతో పరస్పర ద్వేషాలతో ముంచెత్తుతున్నారు. పెద్ద ప్రజాస్వామ్య దేశమని మురిసిపోతున్నామే కాని, అందు జీవకళ లేకుండా పోతోంది.

అంతకంటె ఆధ్యాత్మిక దారిద్ర్యం నన్ను ఎక్కువగా కలవరపెడుతుంది.

ఇక చోళ శాసనాలలో ఐదవ నియమం పవిత్రమైన సంపాదన కలిగి యుండడం వల్ల ఆనాటి సంఘం కలుషితం కాలేదు. డబ్బు విషయంలో

కక్కుర్తి పడదని నమ్మకమున్నపుడే సభ్యునిగా ఎన్నుకొనబడేవాడు. లేనిచో తిరస్కరించేవారనే విషయాన్ని తప్పక గుర్తించండి. అపవిత్రునకు ఎన్నికలనుండి శాశ్వత బహిష్కారమే.

## పవిత్రత

ఆర్థిక విషయంలో చాలా నిక్కచ్చిగా ఉన్నా విద్య, వయస్సు, నైపుణ్యం, ఋజుత్వం వంటివి ఉన్నా ఏదో ఒక లొసుగు కన్పిస్తూనే ఉంటుంది. అయినా మనం సర్దుకొని నిర్వహణ బాధ్యతను అప్పగిస్తాం. మొత్తం మీద మచ్చలేని జీవితాన్ని గడిపినవాడే ప్రశంసార్హుడు.

ఆనాడు వేదశాస్త్రాల పట్ల అచంచల విశ్వాసం, భక్తి తాత్పర్యం, వినయం, క్రమశిక్షణ మొదలైన లక్షణాలు చాలామందిలో ఉండేవి. ఈనాడు భోగభాగ్యాలకై,. విలాస వస్తు సంపాదనకై వెంపర్లాడుతున్నట్లు ఆనాడు లేదు. సాదాసీదా జీవనం, డబ్బున్నవారూ గడిపేవారు. ఉన్నత భావాలతో ఉండేవారు.

## జీవితాంతం సభ్యత్వం ఉండేదా?

ఒక మాటు సభ్యునిగా ఎన్నుకొనబడిన తరువాత మరల మూడు సంవత్సరాలు అతడు ఎన్నికలలో నిలబడేవాడు కాడు. శాసనంలో ఆరవ, ఏడవ నియమం ప్రకారం సభ్యునిగా ఒకడుండగా వారి బంధువులు సభ్యులుగా ఎన్నుకొనబడకూడదనే నియమం ఉంది. ఇదంతా ఆర్థిక విషయాలలో పవిత్రతను సూచిస్తుంది. బంధు ప్రీతి పనికి రాదని, ఒకే కుటుంబ సభ్యులు గద్దెనాక్రమించకూడదనే అభిప్రాయంతో ఈ నియమాలను ఏర్పాటు చేసారు.

మూడు సంవత్సరాల నియమం ఎందుకు పెట్టారు? అతడా అధికారంలో

పాతుకొని పోకూడదనే. చాలా కాలం ఉంటే తాను చేసిన తప్పులు కప్పిపుచ్చుకోవడానికి అవకాశం వస్తుంది కదా! అందుకని వద్దన్నారు. ఇష్టం ఉన్నవారిపై మమకారం, ఇష్టం లేనివారిపై పగ తీర్చుకోవటం వంటివి ఉండకూడదని వ్యవధి నుంచారు.

## ఐదు సంవత్సరాల నియమం

నేడు ప్రతి ఐదు సంవత్సరాలకూ ఎన్నికలున్నాయి. ఇవి శాసనసభలకు, లోక్ సభకు ఉంటాయి. వీటి పరిధులు విస్తృతంగా ఉండడం వల్ల, కొంతకాలం ఉంటేనే పరిస్థితులను అవగాహన చేసుకోలేడు కనుక ఈ నియమం పెట్టారు. కాని స్థానిక సభలు చిన్నవి. జనసంఖ్య కూడా పరిమతం. సమస్యలూ పరిమితమే. ఆనాటి పంచాయితీ సభల కాలం ఈనాటి శాసనసభలకు వర్తించదు. ప్రతి సంవత్సరమూ శాసనసభల ఎన్నికలను నిర్వహించడమూ కష్టమే కదా!

అయితే ఐదు సంవత్సరాలు శాసనసభా సభ్యునిగా ఉండి తరువాత కూడా అతణ్ణే ఎన్నుకొనడం సబబుగా ఉందా? ఆలోచించండి.

## కొత్త రక్తం వద్దా?

పంచాయితీ సభలో ఒక మాటు ఎన్నుకొనబడిన తరువాత మూడు సంవత్సరాల వరకూ అతడెన్నికలలో పాల్గొనకూడదంటే క్రొత్తవారికి అవకాశం ఇచ్చినట్లైంది కదా! సచ్చరిత్రులు, విద్యావంతులు, నైపుణ్యం కల కొత్తవారు రావడానికి అవకాశం లభించింది. ఇది మన ఊరిసభ అనే అభిమానం, ప్రేమ అందరిలోనూ ఏర్పడుతుంది. ఎవరో ఏదో చేస్తారులే, మనకెందుకులే అనే ఉపేక్షాభావం లేకుండా చేస్తుంది.

## ధార్మిక పాలనలో ముఖ్యాంశం

సభ్యునిగా ఒకడుండగా వారి బంధువులు సభ్యులుగా పాల్గొనకూడదనే నియమం యొక్క ఆంతర్యమేమిటి? ఆర్థిక విషయాలలో పవిత్రత నిమిత్తమై అన్ని అర్హతలున్న బంధువులు సభ్యులుగా ఉండకూడదనడంలో అర్థం ఉందా అని ప్రశ్నించవచ్చు.

పాత సభ్యుల దగ్గర బంధువులు ఎన్నుకొనబడితే పాత సభ్యుల తప్పిదాలను కప్పి పుచ్చడానికి వీరు ప్రయత్నిస్తారు. ఆపైన వారు చేసిన తప్పులనే వీరూ కొనసాగించవచ్చు, సమర్థించవచ్చు కూడా. వీరు తమదగ్గర బంధువులకు రాబోయే సభ్యులకు ఉపకారాలు చేయవచ్చు. వీటిని దృష్టిలో పెట్టుకొని ఆ నియమం ఏర్పడింది. ఇది ధార్మిక పాలనకు వెన్నెముక ఉంటుంది.

## రాజుపదవి - స్థానిక సంస్థ

అందుకే ఒక్క రాజరికానికే ఔరసత్వం ఉంచారు. స్థానిక సంస్థలలో నిషేధించారు.

రాచరికం పరంపరగా వచ్చినా అనేక సలహాలిచ్చే సంఘాలుండేవి. ఇవి శాస్త్ర నియమాలను పాటించేవి. రాజిష్టం వచ్చినట్లు ధర్మాలను మార్చడానికి వీలులేదు. రాజుకంటె ధర్మశాస్త్రం మిన్న అనే భావం ఉండేది. అట్లే అర్థశాస్త్ర, నీతిశాస్త్రాలు. వీటిని ఆధారంగా తీసుకొనే అదనంగా కొన్ని నియమాలను పాటించేవారు. మిగతా దేశాలలో రాజు తప్పు చేయడనే సూక్తి ప్రచారంలో ఉంది. The King can do wrong. మన దేశంలో ధర్మశాస్త్రాన్ని అతిక్రమించిన రాజులను గెంటివేసారు. ఉదా: అసమంజసుడు, వేనుడు మొదలైనవారు. వీరి నియంతలుగా ప్రవర్తిస్తే పదవులనుండి వీరిని తొలగించలేదా! పై సలహా సభ్యులే వీరిని పదవీ భ్రష్టులను చేసారు.

అయితే అట్టి సలహా సంఘాలు ఏర్పాటు చేసి స్థానిక సభలలో తండ్రి, కొడుకుల పాలనను ఏర్పాటు చేయవచ్చు కదా అని ప్రశ్నించవచ్చు. అనేక స్థానిక సంస్థలలో ఇట్టిది వీలు పడుతుందా? సలహా సంఘంలోనూ చిక్కులు వస్తాయి. సలహా సంఘ సభ్యులకు ఔరసత్వం, మరల సలహా సంఘ సభ్యులను నియంత్రించడం కుదురుతుందా? దీనికంతం లేదు. అందుకే కేంద్రంలోనే తండ్రి - కొడుకుల ఔరసత్వం, సలహా సంఘ సభ్యులను నియమించడానికే పరిమితమైంది.

ఈనాడు రాచరికం లేదు, జమీందారీ వ్యవస్థ లేదు. కాని ఈనాడు ఎన్నుకొనబడినవారు ఒక కొత్త జమీందారీ వ్యవస్థకు శ్రీకారం చుట్టారు.

అయితే ఆనాడు రాజులకు, యువరాజులకు విద్య, పరిపాలనానుభవం, వంశానికి మచ్చ తీసుకొని రాకూడదనే భావనలుండేవి. కాని ఈనాటి మంత్రులు, వారిసంతానానికి, వారి బంధువర్గానికి అట్టి అర్హతలు చాలా తక్కువగా ఉన్నాయి. ఒక సామాన్యుడు, మంత్రిగా మారిపోయి అధికారబలంతో కోట్లను వెనకేసుకొంటున్నాడు. ఇక వారి బంధువర్గం గురించి చెప్పేదేముంది. *(పత్రికలనిండా ఇవే వార్తలు)*

ఇక సంక్షేమ రాజ్యంలో అనేక పథకాలు - పనులు చేసి పెట్టడానికి లంచాలు - లాలూచీలు ఇట్లా ఎన్నో అవకాశాలు. ఎరలను చూపించడం, లోబరుచుకోవడం, బెదిరించడం, హత్యలు ఇట్లా ఎన్నో సాగిపోతున్నాయి. తమ పార్టీయే గెలవాలని అడ్డదారులు తొక్కుతున్నారు. ఒక పార్టీలో అనేక కక్షలు, కుతంత్రాలు, గద్దె దింపడాలు, అల్లర్లు, హాహాకారాలు - ఇట్లా ఎన్నో. మొత్తం ఆశయాలకే గుండుసున్న చుట్టడం, ఎవరు ఎవర్ని దింపుతారో, ఎవరు ఎవర్ని మ్రింగుతారో అనే సందేహాలతో, ద్వేషాలతో సాగిపోతోంది నేటి వ్యవస్థ. అయినా ప్రజాస్వామ్య దేశం అని మురిసిపోతున్నాం.

అందువల్లనే ఉన్న సభ్యులకు దగ్గర బంధువులుండరాదని శాసించింది. *(దీనినుండి ఇకనైనా నేర్చుకోగలమా? నేర్చుకోం)*

## శాశ్వతంగా తరిమివేయడం బంధువర్గాన్ని కూడా

ఒక మాటు నిలబడితే మూడు సంవత్సరాల వరకు ఎటూ నిలబడకూడదని చెప్పాం కదా. అతడు సభ్యునిగా పనిచేసినపుడు తప్పుగా ప్రవర్తిస్తే మూడు సంవత్సరాల తరువాత కూడా నిలబడడానికి హక్కును కోల్పోతాడు. అంటే శాశ్వతంగా. దీనిని గమనించారా?

అట్టివానినే కాకుండా అతని బంధువులు ఎన్నికయ్యే అవకాశాన్ని కోల్పోతారు. ఇక్కడ బంధువులంటే అతని తండ్రి, కొడుకు, సోదరుడు, మామగారు, బావగారు, మేనల్లుడు, అల్లుడు, మేనమామ మొదలైనవారు. ఇట్లా అందరికీ అనర్హత వస్తుందని భావిస్తే అతడు తప్పు చేయడానికి సాహసిస్తాడా? ఇది తప్పక గమనించండి.

## పంచ మహాపాతకాలు

అట్లాగే అతడు పంచ మహాపాతకాలు చేసినా బహిష్కరింపబడగినవాడే. బ్రహ్మహత్య, సురాపానం, బంగారాన్ని దొంగిలించటం, గురు భార్యతో సంగమం, పైవారితో కూడియుండుట. ఇక్కడ బ్రాహ్మణ హత్య అనే మాటను విపులార్థంలో గ్రహిస్తే ఎవర్ని చంపినా అని. బంగారాన్ని దొంగిలించడమే కాదు, దేనిని దొంగిలించినా. గురుపత్ని సంగమమే కాదు, ఎవరితో వ్యభిచరించినా - ఇట్లా విపులార్థాన్ని గ్రహించి అట్టి సభ్యులను వెలివేసేవారు.

మరొకటి వుంది. ఆతతాయులను దూరంగా ఉంచేవారు. ఆతతాయిలు అంటే ఇల్లుకు నిప్పు పెట్టుట, విషమిచ్చుట, శస్త్రం లేనివానిని చంపుట, ఇతరులు ఆస్తులను, భార్యను అపహరించుట మొదలైనవి. వీరందరూ పంచ మహాపాతకాలను చేసేవారిలా పరిహరింపదగినవారే. అర్జునుడు కౌరవులను ఆతతాయిలుగా పరిగణిస్తూ అట్టి వారిని చంపినా పాపం వస్తుందని భయపడ్డాడు.

పై అందరూ గ్రామ సభలో బహిష్కరింపబడేవారు.

## శాస్త్రాలు - న్యాయము

పై పనులను శాస్త్రాలు, పాపం అని అన్నాయి. నేరాలుగా న్యాయశాస్త్రం చెబుతోంది. శాస్త్రాలలో చెప్పినవన్నీ నేటి న్యాయశాస్త్రాలలో ఉండవు. ఆనాడు, పాపం అంటే ఈనాడు న్యాయధిక్కారమంటున్నారు. ఇది నేటి వ్యవహారం.

ఆనాటి ధర్మశాస్త్రాలు, రాజ్య పరిపాలన పద్ధతులూ రెండూ ఒక్కటే. న్యాయశాస్త్ర ప్రకారమిది, ధర్మశాస్త్ర ప్రకారమిది అని వింగడించనవసరం ఉండేది కాదు.

శాస్త్రాలు పరిహారం చెప్పినా తిరిగివాడు చేయకుండా చేయలేవు. ప్రాయశ్చిత్తాలు విధిస్తాయి. సంఘంలో అట్టివి పనికిరావని న్యాయశాస్త్రాలు శిక్షలను విధిస్తాయి. అందుకే శిక్షాశాస్త్రం యొక్క ఆవశ్యకత.

అందుకే శాసనాలలో కొంత వెసులుబాటుంది. శాస్త్రం ప్రకారం చెప్పిన ప్రాయశ్చిత్త కర్మలను చేసికొని శుద్ధి పొందినవారు సభ్యులుగా ఉండవచ్చుని, పై తీవ్రమైన పాపాలు చేసినవారు అనర్హులని చెప్పింది. ఎవరు అనర్హులు? పంచ మహాపాపాలు చేసినవాడు, వ్యభిచరించుట, గ్రామ సంక్షేమానికి విరుద్ధంగా పనిచేసినవాడు అనర్హులని చెప్పింది.

గ్రామ ఆదాయాల లెక్కలలో తప్పుడుగా చూపించినవాడు, తప్పుడు సాక్ష్యాలు చెప్పినవాడు, అక్రమ సంపాదన పరుడు మొదలైనవారు కూడా అనర్హులే!

## ఇంకా కొన్ని అర్హతలు

ఎవడైనా నీచమైన పనిచేస్తే శరీరం నిండా వాతలు పెట్టి గాడిదపై ఎక్కించి ఊరేగించేవారు. అవమాన భారంతో అతడెప్పుడూ అట్టి పనులు చేయకుండా ఉంటాడనే.

ఇక కారాగారంలో నేరగాండ్రకు సకల సదుపాయాలూ కల్పిస్తే క్రొత్త అల్లుళ్ళుగా మేపుతూ ఉంటే అక్కడే ఉండడానికి ఇష్టపడతారు కదా! దయ చూపించడానికీ ఒక హద్దు అంటూ ఉంది. ఇట్లా దయ చూపిస్తే నేరాన్ని ప్రోత్సహించినవాళ్ళమౌతాము. పై శిక్షలు అమలు పరచడం వల్ల ఎందరికో భయ భక్తులుండేవి.

## ఆనాటి ఎన్నికల విధానం

ఒక ముఖ్యమైన విషయాన్ని ప్రస్తావిస్తాను. ఇది మనకు కొత్తగా, వింతగా అనిపించవచ్చు.

సభ్యులు ఓట్లు అడగడం వంటిది ఆనాడు లేదు. ఓట్లు వేసే పద్ధతి లేదు. ఇదేమి పద్ధతని ఆశ్చర్యపడుతున్నారా?;

తమకు ఓటు వేయండని ప్రచారమూ లేదు. నేను నిలబడ్డానని ఎవ్వడూ అనడు. మరి ఎట్లా? శాసనం చూడండి.

ఆనాటి మనునీతి చోళుని యొక్క ఔరసులు, ధర్మశాస్త్రం నిర్దేశించిన నియమాలనే పాటించారు. అర్హత గల అభ్యర్థులను గుర్తించి, అనర్హులను ప్రక్కనబెట్టి ఒక జాబితా తయారు చేసేవారు. వీరిలో ఒక్కొక్క వార్డు (కుడుంబం) నుండి ఒక్కొక్క ప్రతినిధిని ఎన్నుకొనేవారు.

## ఎన్నిక - నిర్వహించువారు

ఈనాడు ఎన్నుకొనబడిన వారితో సభలు జరుపబడుతూ ఉండగా, ఒక్కొక్కసారి వీరికాలం కొన్ని రోజులలో ముగుస్తుందనగా, అనగా పూర్తికాలం ముగియకుండగనే ఒక్కోసారి ఎన్నికలు జరుగుతున్నాయి. ఎందుకంటే పాలకపక్షం, పదవిలో ఉన్నపుడు అవకాశాలన్నీ అంది పుచ్చుకోడానికి ఇట్లా చేస్తుంది. ఇందు మూలంగా పార్టీ రాజకీయాలున్న ఈ కాలంలో ప్రతిపక్షం

వారి కంటె పాలక పక్షానికి, వారి ప్రచారానికి, ప్రలోభాలకు ఎక్కువ అవకాశం ఉంది.

అట్టి అవకాశం ఈయకుండా ఉన్న సభ్యులను రాజీనామాలు చేయండనే వారు. తరువాత మధ్యవర్తులు, ధర్మకృత్య సభా నిర్వాహకులు రాబోయే ఎన్నికలను నిర్వహించేవారు.

ఏమిటా సభలు? గ్రామసభ, 30 వార్డుల సభ్యులతో ఉండేది. గ్రామం, 12 చేరులుగా విభజించిపబడియుండేది. ఒక్కొక్క చేరిలో స్వధర్మప్రకారం వృత్తి చేసుకునేవారు ఉండేవారు. బ్రాహ్మణ అగ్రహారం ఒక చేరి.

గ్రామ సభా సభ్యులు, ఏడాది తరువాత రాజీనామా చేసేవారు. మరల ఎన్నికలు వచ్చే మధ్యకాలంలో ఈ ధర్మకృత్య సభా సభ్యులు, మధ్యవర్తులు నడిపేవారు. వీరి కాలం కొన్ని రోజులుండేది. మధ్యలోనే ఎన్నికలు జరగాలి.

ఒక మూల సభ్యులుండగా మరల సభ్యుల నెన్నుకోవడం కాకుండా తటస్థంగా ఉండే కాలం కొంత ఉండేది. లేకపోతే ఉన్నవారు, రాబోయే వారిని ప్రభావితులను చేయవచ్చు కదా! అందుకని ధర్మకృత్య సభా నిర్వహణ మధ్యలో ఉండేది. వీరిలో ఒక్కొక్క వర్ణంలో ఒక్కొక్క సదాచారపరుడుండే వాడు. వీరిలో ఒక్కొక్కరు స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకొనేవారు కాదు. పక్షపాత రహితంగా ఉండేది.

వీరే కాకుండా ఎన్నికలు సజావుగా సాగడానికి మధ్యవర్తులుండేవారు. రాజోద్యోగులు పర్యవేక్షిస్తూ ఉండేవారు. ఇంతకుముందు వేలాల, భట్ట ప్రస్తావనలు తీసుకొని వచ్చాం. అంటే అన్నివర్ణాలవారూ ఉన్నట్లే కదా!

ఇప్పుడొకడు నిలబడడం, అంగీకారాన్ని మరొకడు తెలపడం, పై వాణ్ణి అభ్యర్థిగా పేర్కొనడం జరుగుతోంది.

ఆనాడట్లా కాదు. తనంతట తాను నిలబడినట్లు ఎవ్వడూ చెప్పేవాడు కాదు. ధర్మసభా నిర్వాహకులు వారిని ఎన్నుకొనేవారు. ప్రజాభిప్రాయాన్ని గుర్తించి ఫలానా వారని పేర్కొనేవారు.

నేడు ఉద్యోగానికి దరఖాస్తు పెట్టినట్లుగా అయ్యా, నేను నిలబడుతున్నానని ఎవ్వడూ అనేవాడు కాదు. ఎన్నికలలో తనంతట తాను నిలబడకపోయినా ఫలానా వాడుంటే బాగుండునని ఒకడనగా, మరొకడు ఆమోదముద్ర వేయగా ఎన్నుకొనబడడం గౌరవ ప్రదంగానే ఉంటుంది. అయినా ఆనాటి పద్ధతిని గమనించండి.

## ఎన్నికల విధానం

32 వార్డులలోని అర్హులైన సభ్యుల పేర్లను ఒక్కొక్క తాటాకుపై వ్రాసేవారు. ఒక్కొక్క వార్డులోని సభ్యుల పేర్లున్న తాటాకులను ఒక్కొక్క కట్టగా కట్టేవారు. ఇట్లా 32 కట్టలు రాగా గ్రామసభలో ఎన్నికలుండేవి.

ఇది నేటి విధానానికి విరుద్ధం:. ఈనాడు వివిధ పార్టీలవారు స్వతంత్రులుగా పోటీ చేస్తున్నారు. ఇక ఎన్నికల ప్రచారం, సత్యసమ్మతంగా సాగుతోందా? లెక్కలేనన్ని వాగ్దానాలు, పరస్పర దూషణలు ప్రలోభాలు, ఎన్నెన్నో జరుగుతున్నాయి కదా! కాని ఆనాడివి లేవు.

ఈ ఎన్నికల సభలు ఆలయ సభలలో జరిగేవి. అంటే ఈశ్వరుడే సాక్షి. భగవత్ సమక్షంలో ఎన్నుకొనబడుతున్నాననే తృప్తి ఉండేది. ఆ బాల వృద్ధులు దీనిని చూస్తూ ఉండేవారు. శాసనంలో "సబాల వృద్ధం" అని ఉంది. అంటే అందరి సమక్షంలో ఈ ఎన్నిక. మనదనే భావన అందరిలోనూ ఉండేది.

ఈ తాటాకు కట్టలను, ఒక్కొక్క వార్డునకు చెందినవాటిని తీసుకొని వచ్చి ఒక్కొక్క కుండలో వీటిని వేసేవారు. ఇది నేటి బ్యాలెట్ బాక్సు వంటిది.

ఆనాటి అర్చకులు పవిత్రంగా ఉండేవారు. వారిని నంబియార్‌లని అనేవారు. వీరు వేదికపైనెక్కి పర్యవేక్షించేవారు. వీరిని దేవప్రతినిధులుగా భావించేవారు. ఇక మధ్యవర్తులూ ఉండేవారు.

ఒక్కొక్క వార్డులోని సభ్యుల పేర్లు గల కట్టను, ఆ కులపెద్ద ఒక కుండలో ఉంచేవాడు. అనగా ఒక్కొక్కడు విడిగా ఎన్నుకొనబడేవాడు కాదన్నమాట. వీటిని అర్చకుడు అందరికీ చూపించేవాడు.

జనుల మధ్యలో ఒక పిల్లవాణ్ణి పిలిచి ఆ ఓటును (ఓలై) తీయమనేవారు. అది తీసి మధ్యవర్తికి ఇచ్చేవాడు. అతడు తీసిన ఓటును, అందలి పేరును చదివేవారు.

రాగద్వేషాలు లేని ఈ పిల్లవాడే ఒక విధంగా కారకుడయ్యాడు. దీనిని పరమేశ్వరాజ్ఞగా భావించేవారు.

భగవదనుజ్ఞతో ఇదంతా ఆలయంలో అర్చకుని సమక్షంలో జరిగేది. బైబిల్‌లో (8.2) Out of the mouth of babes and sucklings last thou ordained strength ఉంది. చంటి పిల్లవాని నోటినుండి పరమేశ్వరుని శక్తి బహిర్గతమౌతోందని అర్థం.

మనం బాలవాక్కు బ్రహ్మవాక్కని అంటాం. అప్రయత్నంగా ఓలైని తీసేవారు. ఆ పేరును పదిమందికీ వినిపించేవారు. ఈ పద్ధతి పక్షపాత రహితమని, శంకించడానికి వీలులేదని అందరూ నమ్మేవారు.

వారి పేర్లు నమోదు చేయబడేవి. దీనివల్ల స్వధర్మపరులు ఎన్నుకొనబడేవారు.

## వ్యక్తిని బట్టిగాదు

వర్ణాన్ని బట్టి, అతని స్థాయిని బట్టి కాకుండా కేవలం నీతి, నిజాయితీలను బట్టి ఎన్నుకొనబడేవారు. ఈనాడు ధర్మం, ఉదాత్త చరిత్రలకు ప్రాధాన్యం లేకుండా పోతోంది. ఈనాడు వ్యక్తులకు పార్టీలకే ప్రాధాన్యం.

ఈనాడు కొందరికి రాజకీయ పరిజ్ఞానం, సచ్చరిత్ర వుండవచ్చు. కాని

వీటికి ప్రాధాన్యం ఈయకుండా కేవలం వక్తృత్వం వల్ల, మాటల గారిడీల వల్ల పైవాణ్ణి ఇతడు ఓడించవచ్చు. ఈ పైపై మెరుగులకు ప్రాధాన్యం ఇస్తున్నారు. ప్రజలు మోసగింపబడుతున్నారు.

ఆనాడు ధర్మమే కొలబద్దగా ఉండేది.

## ఎక్కువ ఓట్లు

ఎక్కువ ఓట్లు వచ్చినవారిని ఎన్నుకొంటున్నాం. ఆనాడట్టిది లేదు. ఈనాడు తక్కువ ఓట్లు వచ్చినవాడు, అవక తవకలు జరిగాయని, ఏదో ఒక కారణం చెప్పి పైవాడి ఎన్నిక సరికాదని న్యాయస్థానానికి ఎక్కుతున్నాడు. ఇవి ఆనాడు లేవు.

అధిక సంఖ్యాకులు, అల్పసంఖ్యాకులనే విభజన ఈనాడేర్పడుతోంది. పాలకపక్షం, ప్రతిపక్షం అనివార్యమౌతోంది. ప్రతిపక్షాన్ని వైరివర్గంగా పరిగణిస్తున్నారు. ఎట్లా ఓడించాలా అని శతవిధాల ప్రయత్నం చేస్తున్నారు. ప్రతిపక్షాలు చెప్పిన మంచి సలహాలను కూడా పాలకపక్షం పెడచెవిన పెడుతోంది. అట్లాగే పాలకపక్షం చేసిన మంచి పనులను, ప్రతిపక్షం నోరారా కీర్తించలేక పోతోంది. కేవలం విమర్శలు, ప్రతి విమర్శలతో నిండిపోయింది. అటువంటి కలహాలకు తావులేని ఎన్నికలను చోళులు ప్రవేశ పెట్టారు. ఆ ఎన్నికను కుడవోలై అనేవారు.

ఏ ఒక్క ఏడాదిలో సభ్యుడు అక్రమంగా ప్రవర్తించినా అతడిని శాశ్వతంగా బహిష్కరించేవారు.

ఈ పద్ధతి, ఆచంద్రతార్కారం జరగాలని భావించారు. దురదృష్టవశాత్తు సాగలేదు.

## పాలనలో విభజనలు

పాలన వివిధ శాఖలుగా చీలియుండేది. దానిని వారియం అనేవారు. అంటే ఈనాటి కమిటీ, లేదా బోర్డు. ఇట్టివి 30 వరకూ ఉండేవి. ఇందు పన్నెండింటిని సంవత్సర వారీయములనేవారు. ఇవి సాధారణంగా పాలనను చూసేవి. మిగిలినవి 12 తోటవారియములు, పొలాలు, తోటలు మొదలైనవాటిని చూసేవి. మిగిలినవారు నీటిపారుదలను చూసేవి.

30లో మొదటి పన్నెండువాటిని అనుభవం, వయస్సు, విద్య కలవారికి అప్పజెప్పేవారు. మధ్య వయస్కులకు, శారీరక బలం ఉన్నవారికి మిగతా వాటిని అప్పజెప్పేవారు.

ఇది కాకుండా పోన్‌వారియం, పంచవారియమ్ అని ఆర్గురు సభ్యులతో ఉండేవి. వీరు 30 మంది నుండి ఎన్నుకొనబడేవారు. వీరు కూడా మడవోలై పద్ధతిలో ఎన్నుకొనబడేవారు.

పూర్వకాలంలో పండిన పంటలో ప్రభుత్వానికి ఐదవవంతు పన్నుగా చెల్లించేవారు. అది ధాన్యరూపంలో డబ్బురూపంలో ఉండేది. కనుక గ్రామాదాయాన్ని పంచవారం అనేవారు.

విత్తనాల పంపిణీని తోట వారియం సభ్యులు చూస్తూ ఉండేవారు. పంచవారియం సభ్యులు పన్నులు వసూలు చేసేవారు. భూమి పన్ను, వర్తకం పన్ను మొదలైవాటిని ప్రభుత్వోద్యోగులే వసూలు చేయవలసి వచ్చినప్పటికీ ప్రజల అభిప్రాయాలను, ఫిర్యాదులను గ్రామ మహాసభకు, పంచవారానికి పోన్‌వారియమ్‌లకి అందజేసేవారు. ఇట్లా శాసనాలలో లేకపోయినా ఊహించవచ్చు.

## ఆదర్శంగా

ఎందుకింత చెప్పవలసి వచ్చిందంటే వీటిని ఆధారంగా తీసుకొని కొన్ని నవలలను వ్రాయవచ్చు. చలన చిత్రాలను తీయవచ్చు. ఆదర్శప్రాయంగా ఉంటుంది కదా!

ఈనాటి ప్రజాస్వామ్య వ్యవస్థ పాశ్చాత్యుల ఒరవడిలో సాగుతోంది. పంచాయతీ ఎన్నికలనుండి, ఢిల్లీ ఎన్నికల వరకూ ఒకే ఎన్నికల విధానం అమలు పరచబడుతోంది. అయినా ఆనాటి ఎన్నికలలో ధర్మానికి, నీతికి, సత్ప్రవర్తనకు ఎట్టి ప్రాధాన్యం ఇచ్చారో గమనించండి. పై వాటిల్లో కొన్నిటినైనా అమలు పర్చలేమా? ఆలోచించండి.

## బాధాకరమైన అంశాలు

ప్రజల ప్రభుత్వం, ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రభుత్వం, ప్రజల కొరకు ప్రభుత్వం అనే నినాదం వింటున్నాం. కాని ఇది అజ్ఞానుల ప్రభుత్వంగా మారుతోంది.

క్రమశిక్షణ, కనుమరుగౌతోంది. ఈ క్రమశిక్షణా రాహిత్యం, దేనికి దారి తీస్తుందోనని బాధపడుతున్నా. ఏదైనా ఒక రోగం వస్తే దానికి తగిన మందును సేవించుట కంటె పథ్యానికి ప్రాధాన్యం ఈయాలి కదా! ఈనాడు తెల్లదొరలు పాలించడం వల్ల ఒకరోగం రాగా, స్వాతంత్ర్యం రోగవిముక్తినిచ్చింది. పూర్తి స్వస్థత రావాలి కదా! ఈ దశలో ప్రజల మనస్సులను, ప్రతినిధుల మనస్సులను సక్రమ మార్గంలో పెట్టగలిగినపుడు స్వాతంత్ర్య ఫలాన్ని సంపూర్ణంగా అనుభవించగలం. ఇట్టి దశలో అభ్యర్థులకు తగిన విద్యార్హత, అనుభవం, నీతి నియమాలతో పని లేదంటే దేశం, కుక్కలు చింపిన విస్తరిలా మారుతుంది.

కనీస అర్హతలు లేకుండా ఎన్నుకోబడుతున్నారు. చిన్నచిన్న గ్రామాలలోని ప్రజలు కూడా లంచాలకు గురియైపోతున్నారు. ఇదంతా ఓట్లకోసం వారి మనస్సులను పాడుచేస్తున్నాం. విద్యావంతులకంటె అవిద్యావంతులను పాడుచేయడం సులువు. అనేక ప్రలోభాలకు గ్రామప్రజలు గురైపోతున్నారు. ఇది ప్రజా సంక్షేమానికి దారి తీస్తుందా? చెప్పండి.

డబ్బుతో గెలిచినవాడు, తాను పెట్టిన ఖర్చును రాబట్టడం కోసం, మరల ఎన్నికలలో నిలబడడం కోసం అక్రమార్జనకు పరుగులు తీస్తున్నాడు. ఇది జననాయకం కాదు, ధననాయకం.

ఇక ఓట్లు, సీట్లు గురించి చూడండి. అనేక పార్టీలు, అభ్యర్థులూ ఉండడం వల్ల ఓట్లు చీలిపోతున్నాయి. ఇక గెలిచినవానికి 25 లేక 30 శాతం ఓట్లు వస్తున్నాయి. 500 మంది సభ్యులుంటే ఈ చీలికలవల్ల పాలకపక్షానికి 150 లేక 200 సీట్లు వస్తున్నాయి. అనగా 50 శాతం సీట్లు కూడా రావడం లేదు. ఉన్నవాటిల్లో పెద్దపార్టీగా పిలువబడుతోంది. దానికి తక్కువ శాతం ఓట్లు వచ్చినా పరిపాలిస్తోంది. అట్టి పార్టీకి 25 శాతం ఓట్లు వచ్చినా అనగా 75 శాతం మంది తిరస్కరించినా వీరే పాలక పక్ష సభ్యులౌతున్నారు. ఇట్లా లోక్‌సభలో సంపాదించినా, అన్ని రాష్ట్రాలలోనూ ఈ పాలకపక్షానికి అంతశాతం రావచ్చు, రాకపోవచ్చు కూడా.

ఇక ఎన్నికలలో మొదటిస్థానం ఒకనికి, రెండవస్థానం ఒకనికి అంటూ అనురూపమైన ప్రాతినిధ్యం (Proportional Representation) పెట్టాలన్నా చిన్న చిన్న సంఘ సభ్యులనెన్నుకోవడంలో వీలు పడుతుంది. కాని శాసనసభలకు లోక్‌సభలకు ఎన్నికలకూ కుదరదు.

ఇట్లా ప్రజాస్వామ్యం అనే పేరుతో ఎన్నో విలువలకు తిలోదకాలిస్తున్నాం. మురిసిపోతున్నాం.

## పరిపక్వమనస్కులకు బాధ్యత

రాజకీయ నాయకులు యువకులను రెచ్చగొడుతున్నారు. స్వార్థ ప్రయోజనాలకు వాడుకోవడం చూస్తున్నాం. భావి నాయకులని వారిని పొగుడుతున్నారు.

ఒక రోగికి రోగం పోయిన తర్వాతనే అతనికి ఇంటి బాధ్యతలను అప్పగిస్తాం. రోగిని, పిల్లవానిని అందలం ఎక్కించరు కదా. వారి బుద్ధి, మనస్సు, శారీరక బలం పరిపక్వత చెందినపుడే బాధ్యతలు. ఈనాడు రాజకీయ పరిజ్ఞానం విషయంలో ప్రజలందరూ పిల్లవాని మాదిరిగానే ఉన్నారు. తెల్లదొరల ప్రభుత్వం మనలను బానిసమనః ప్రవృత్తులు కలవారిగా మార్చింది. మనలను మనం కాకుండా చేసింది. సంస్కృతీ సభ్యతలపట్ల మమకారం లేకుండా చేసింది ఎదగని వారిని ఎదిగేటట్లు పార్టీలు, ప్రజలలో మార్పులు తీసుకొని రావాలి. దేశం పట్ల అవగాహన, అనుభవం, నీతి నిజాయితీలు లేకుండా వీరికి అధికారం కట్టబెడుతున్నాం. ప్రమాదాలను ఊహించలేకపోతున్నాం.

అంతకంటె లంచం, అవినీతి, పార్టీ కలహాలు మొదలైనవాటివల్ల జాతిని నిర్వీర్యం చేస్తున్నాం. ఒక మూల అందరూ సమానులే అంటూ వర్ణ ద్వేషాలను, వర్గ ద్వేషాలను ప్రోత్సహిస్తున్నాం. పార్టీ సభ్యులను మార్చడానికి రకరకాల మాయో పాయాలను పన్నుతున్నాం. అయినా పెద్ద ప్రజాస్వామ్య దేశమని మురిసిపోతున్నాం.

స్థానిక సంస్థలలో పార్టీ రహితమైన ఎన్నికల వ్యవస్థ ఉన్నా బాగుండును. పైపైన పార్టీ కతీతమన్నా గ్రామ పంచాయితీలలో కూడా పార్టీలు చొరబడుతున్నాయి. ఇక్కడే కంపు గొడుతూ ఉంటే ఈ దుర్గంధం శాసనసభలకు లోక్‌సభకూ ప్రాకుతోంది.

సభ్యులకు పార్టీనుండి డబ్బురావటం, దానినతడు మ్రింగివేయడం, లేదా విచ్చలవిడిగా ఖర్చు పెట్టి పైకి రావడం, పెట్టిన డబ్బును తిరిగి రాబట్టుకోవడం కోసం నానా తంటాలు, పరస్పర ద్వేషాలు, ఇతరులనెలాగోలాగ అణగద్రొక్కడం మొదలైనవి ఎన్నో జరుగుతున్నాయి. ఆనాటి నీతి నిజాయితీలతో కూడిన ఎన్నికల విధానాన్ని గమనించారు కదా!

ఒక వ్యక్తికి చుట్టూ రాజకీయాలు తిరిగితే అతడు కొందరికి అనుకూలంగా కొందరికి ప్రతికూలంగా పనులు చేస్తూ ఉంటాడు. ఎక్కడ తన గొప్ప చెప్పుకోవడానికి వీలుండదో, అక్కడ ఈనాటి ఓట్లు వేయడం ఉండదు. డబ్బులు విరజిమ్మడం, అనవసరం వాగ్దానాలు చేయడం కూడా ఉండవు.

## మరొక లోటు

ఈనాడు చాలామంది ఒకర్ని ఎన్నుకొన్నా అతడు నీతిమంతుడని నమ్మకం లేదు. పడిన ఓట్ల సంఖ్యను బట్టే అతడు గెలిచినట్లుగా లెక్కిస్తున్నారు. కాని ఆనాడు ఒక వార్డులోని సభ్యులందరూ సచ్చరితులైతేనే వారి పేర్లను ఒక్కొక్క తాళపత్రంపై వ్రాసేవారు. అందొకణ్ణి ఎన్నుకొనేవారు. అట్టి వారెందరో ఉన్నా ఆ ఒక్కణ్ణే ఎన్నుకొనేవారనే మాట. దోషంగా ఎంచనవసరం లేదు.

అర్హత కలవారిలో నంబియార్లను సంప్రదించి ఎన్నుకోవచ్చు. అయినా తగాదాలకు తావిస్తుందని ఈ తాళపత్ర పద్ధతిని ప్రవేశపెట్టారు. అదైనా పిల్లవాణ్ణి తీయాలన్నారు.

ఈనాటి గణిత శాస్త్రజ్ఞులు కూడా మామూలు పద్ధతులలో సమాధానం రాక ఏదో సహజ జ్ఞానం వల్ల అంతర్ జ్ఞానం వల్ల సమస్య తీరిందని అంటున్నారు కదా! దానిని వారు ప్రాయశః జరుగునదగిన స్థితి (Probability Test)యని అంటున్నారు కదా! అట్లాగే భగవత్ సంకల్పమని, అది పిల్లవాని ద్వారా నెరవేరుతుందని ఆనాడు భావించారు.

ఏదైనా ఏవో కొన్ని లోటుపాటులుంటాయి. ఇదంతా మాయా ప్రపంచమే కదా! కనుక ఏ వ్యవస్థలోనైనా ఏవైనా లోటుపాట్లుంటాయి. ఆనాటి ఎన్నికలలోనూ ఏవో లోపాలుండవచ్చు. (ఇది భగవత్ సంకల్పం కాదనేవారుండవచ్చు, ఇదొక లాటరీగా భావించవచ్చు). ఉదాహరణకు 70, 80 దాటినా కొద్దిమందికి బుద్ధి తీక్ష్ణంగానే ఉంటుంది. అట్టి వయస్సు మీరినవారిని ఆనాడు ఉపయోగించవచ్చు కదా; అది లోపం కాదా అని ప్రశ్నించవచ్చు. అయినా అట్టివారిని సలహా సభ్యులుగా నియమిస్తే, మొత్తం పరిపాలనకు మరొక సలహా సభ్యులను నియమించవలసి వస్తుంది. ఇట్లా దీనికి అంతం ఉండదు. ఇవి పంచాయితీ ఎన్నికలు కనుక ఏవో లోపాలున్నా పరిమిత జనంతో సర్దుబాటు చేసుకోవచ్చు. కాని శాసనసభ, లోక్‌సభ ఎన్నికలలో కుదరదు. ఎంతమందిని ఒప్పించగలం? కొన్నిటిని అమలు పరచలేకపోయినా చెడు ప్రవేశించకుండా నివారించగలిగేవారు.

ముఖ్యమైన విషయం ఏమంటే బంధువులను దూరంగా ఉంచడం (అది ఈనాడు లేదు)

పై పద్ధతులను తు.చ తప్పక నేడూ పాటించాలని నేను చెప్పడం లేదు. ఆ నియమాలలో ఉన్న తత్వాన్ని గమనించండి. ముఖ్యమైన వాటిని అమలు పర్చండి

## రామరాజ్యం

రాముడు కొత్తగా రాజనీతిని సృష్టించలేదు. తన అభిప్రాయాలే చెల్లుబడి కావాలని పట్టుపట్టలేదు. శాస్త్రాలు నిర్దేశించిన మార్గాలలోనే నడిచాడు. మనువు చెప్పిన మార్గంలోనే అడుగు వేసాడు.

యౌవరాజ్య పట్టాభిషేకం రామునకు చేస్తానని దశరథుడనేటపుడు రాముడన్ని విధాల తగినవాడని తెలిసినా ప్రజల అభిప్రాయాలను అడిగాడు

కదా! అందు మ్లేచ్ఛ ప్రతినిధులు కూడా ఉన్నట్లుంది. వారు వేద ధర్మానికి లోబడినవారు కాదు. కనుక అడగబడేవారి అర్హత, అనర్హతలను చూడకుండా అభిప్రాయాన్ని అడిగాడు కదా! ఇక్కడ ప్రజాప్రతినిధులనే అడిగాడు. అందరు ప్రజలను కాదు. తన నిర్ణయాన్ని ఎవ్వరూ కాదనరని తెలిసి కూడా ప్రజా ప్రతినిధులనడిగి తెలుసుకొన్నాడు.

దశరథుడు గాని, రాముడు గాని ఇతరుల అభిప్రాయాలను విన్న తరువాతనే, ఆకళింపు చేసుకొన్న తర్వాతనే నిర్ణయానికి వచ్చేవారు. విధాన నిర్ణయాలలో మంత్రుల సలహాలను పాటించేవారు. ఆ మంత్రులు కూడా ధర్మనిష్ఠులై యుండేవారు. జ్ఞాన, శీల, వయోవృద్ధులై యుండేవారు. రఘువంశ రాజులందరూ అంతే.

అంతేకాదు, ప్రజలేమను కొంటున్నారో అని తెలిసికొనేవాడు రాముడు. ప్రజలు నిందిస్తే సీతను పరిత్యాగం చేసాడు కదా! ఈనాటి ప్రజలు మొత్తం, వేలెత్తి చూపినా పాలకులలో కదలిక కన్పిస్తోందా? రాజును, రాణిని వేలెత్తి చూపే స్వేచ్ఛ ఆనాడుంది. అది అసలైన ప్రజాస్వామ్యం కాదా?

ఉత్తరకాండలో ఒక కుక్క వచ్చి న్యాయం చేయమని అడగడం తెలిసిందే. మనునీతి చోళుని కాలంలో తిరువారూర్ అనే రాజధానికి తన బాధను చెప్పుకోవడానికి ఒక ఆవు వచ్చి గంటను గణగణా మ్రోగించిన కథను విన్నాం. ఇట్లా ప్రజలు తమ గోడును వినిపించుకోవడం ఉండేది. అన్ని సందర్భాలలోనూ రాజునకు ప్రజలు తందానతాన అనలేదు.

ఈనాటి ప్రజలకు అమితమైన స్వేచ్ఛనిస్తున్నారు. ఇదీ ప్రమాదకరమే. ప్రజాస్వామ్యం అంటే అందరి సంక్షేమాన్ని కోరేది, ఎట్టి వివక్షతను ఎవరిపట్ల చూపెట్టనిది మాత్రమే. నిరక్షరాస్యుల, అవినీతి పరుల అభిప్రాయాలను సేకరించడం కాదు. ప్రజల అందరి అభిప్రాయాలను కాదు. నీతిమంతులైన ప్రజాప్రతినిధుల అభిప్రాయాన్ని పరిగణనలోకి తీసుకొని రావాలి.

మనం ఎన్నుకొనే సభ్యులకు అన్ని అర్హతలు లేవు. *(డబ్బు పెట్టి ఓట్లు కొనడం, మద్యం సరఫరా, అక్రమ మార్గాలు, బెదిరింపులు, రాజ్యాంగం అంటే కనీస అవగాహన లేకపోవడం వంటి లక్షణాలున్న వారినే ఎన్నుకొంటున్నాం కదా)* రామరాజ్యం కావాలని అంటున్నాం. త్రేతాయుగం నాటిదెలా కుదురుతుందని కొందరు ప్రశిస్తారు. అంతవరకూ ఎందుకు? వేయి సంవత్సరాలనాటి చోళుల పంచాయితీ ఎన్నికల విధానం గమనించారు కదా! అట్టి పాలనను చరిత్రకారులే ప్రశంసించారు కదా! మాకు వ్రాయబడని రాజ్యాంగం ఉందని, కొన్ని వందల సంవత్సరాల నాటినుండి మనదేశంలో ప్రజాస్వామ్యం ఉందని గొప్పలు చెప్పుకొనే పాశ్చాత్యులకు, మాకు వేయి సంవత్సరాల వెనుకనే వ్రాయబడిన రాజ్యాంగం ఉందని చూపించలేమా? ఇది తమిళనాడు ఘనత.

అట్టి ఆనాటి శాసనాలలోని విషయాలు ఈనాటి వారికి స్ఫూర్తిని ప్రసాదించాలని ఆ రామచంద్రమూర్తిని ప్రార్థిద్దాం.

# రాజ్యం - మతం

## ధర్మచక్రం - ఈశ్వర కృపకు గుర్తు

విదేశీ పాలననుండి విముక్తులమైన మనం, అనాదిగా వచ్చే సంస్కృతి వర్ధిల్లాలని, ఆధ్యాత్మిక మార్గంలో నడిపించాలని పరమేశ్వరుని ప్రార్థిద్దాం. అతని కృప వల్లనే స్వాతంత్ర్యాన్ని నిజమైన స్వాతంత్ర్యంగా తీర్చి దిద్దుకోగలం. శాశ్వత సుఖశాంతులతో వర్ధిల్లగలం.

మన జెండాలో ధర్మచక్రం ఉంది. అది పరమేశ్వరుని ధర్మ స్వరూపం. జెండా తయారు చేసిన వారెట్లా ఊహించనీయండి, మనం మాత్రం భగవానునకు మహోన్నత స్థానం ఇచ్చినట్లు ఈ చక్రం స్ఫురింపచేస్తోందని భావిద్దాం. అందరి జీవితాలు ఆ భగవానునితో ముడివడి యున్నాయి. అతని రక్షణ అన్నివేళలా కావాలి. అందువల్లనే జెండాలో చక్రం మనచే పెట్టేటట్లు చేసాడని భావిద్దాం.

(దీనిని బౌద్ధ చక్రంగానే నాయకులు భావించారు.)

## నిజమైన మత రహిత రాజ్యం

ఏ మతంవైపు మొగ్గు చూపించకుండా మతరహిత స్థితిని పాటించాలని పాలకులు నిర్ణయించారు.

కాని ఆ విధానం బాగాలేదు. మతం అంటే సుతరామూ పట్టించుకోకుండా

ఉండకూడదు. ఏదో ఒక మతాన్ని ప్రోత్సహించకుండా అన్ని మతాలను ప్రోత్సహించినపుడే అది నిజమైన మతరహిత విధానమౌతుంది. అప్పుడే ప్రజలలో ద్వేషభావాలు మటుమాయమౌతాయి. కేవలం మత రహితం కాకూడదు. సర్వమతాలను ప్రోత్సహించాలి.

## ప్రజల మనస్సులను ఉత్తేజితం చేయడంలో రాజ్య బాధ్యత

ప్రజలకు ఆరోగ్య పరిరక్షణ, ఉత్తమ జీవితం గడపడానికి తగిన విద్య, వ్యవసాయం, ఆర్థిక పరిస్థితులును ప్రోత్సహించుట, భద్రత మొదలైనవి ఎన్నో పనులు రాజ్యాన్ని నడిపే వారి భుజస్కంధాలపై ఉన్నాయి. శారీరక ఆరోగ్యాన్ని సమకూర్చడం కంటె మానసికారోగ్యాన్ని కల్గించాలి. మానసికంగా ఉన్నతిలేని జాతి, జాతి కాదు. దేశం, దేశం కాదు. అట్టిదానిని మతం కల్పించగలదు. అట్టి మతాన్ని పోషించడంలో రాజ్యాంగానికి బాధ్యత ఉంది. కాదంటే ఎలా?

ఆర్థికాభివృద్ధిని కల్గిస్తున్నామని అంటున్నారు. అయితే దీనివల్ల శాశ్వత సుఖం, లాభం చేకూరదు. ఈ అభివృద్ధి తాత్కాలికం. ఈ అభివృద్ధిలో పోటీ మనస్తత్వం దాగియుంది. శాంతి లేదు. ఆధునిక పరిశోధనల వల్ల అనేక సాధనాలను ఉత్పత్తి చేస్తున్నారు. విలాస జీవనం గడపడానికి దోహదం చేస్తున్నారు. వీటితో ప్రజలు తృప్తి పడుతున్నారా? ఇంకా నూత్న సాధనాలకై అన్వేషిస్తున్నారు. పరిపూర్ణం కాని దానిని పరిపూర్ణమైనట్లు తీసికొని రావాలి. తాత్కాలిక సుఖాలకు బదులు శాశ్వత సుఖాలకై మార్గాలనన్వేషించాలి. ఇవి ఎట్లా లభిస్తాయి? సరియైన ప్రవర్తన, భగవత్ భక్తి, ఆధ్యాత్మిక భావ పరంపరలు శాశ్వత సుఖ ప్రాప్తికి హేతువులూ, సాధనాలౌతాయి. ఈ మూడే త్రిఫలాలు. అవే బలాన్నిస్తాయి. కనుక భౌతికాభివృద్ధిని సాధించడంలో మానసికోన్నతిని కల్గించే వాటిని విస్మరించకూడదు.

## మతం విషయంలో రాజ్యానికి పరిమితులు

మత విశ్వాసాన్ని ప్రభుత్వం దోహదం చేయాలే గాని, మత విషయాలలో జోక్యం చేసుకోకూడదు. అంత బాధ్యతను రాజ్యం స్వీకరించకూడదు. అంతమాత్రంచే విస్మరించడమూ పనికిరాదు. అంటీముట్టనట్లుండకూడదు. అంటే పరంపరగా వచ్చే మత సంప్రదాయం జోలికి పోకూడదన్నమాట.

మతరహిత పాలనయే ముఖ్యమని, మతంతో ఎట్టి సంబంధమూ లేదని భావిస్తూ పాలించడం దానికి భిన్నమైనది. ఇట్టి రెండవ పద్ధతిని ప్రభుత్వం అనుసరించినా పరోక్షంగా మత నియమాలలో కలుగ జేసుకొంటే, దానిని మాత్రం మన ఉపేక్షించకూడదు. మరొక్క విషయం. సాంఘిక విధానాలలో కొన్ని చట్టాలను చేసినా అవి ఒక మతానికి విరుద్ధంగా ఉన్నట్లైతే ఆ చట్టాలను అన్ని మతాలవారికి అన్వయించేటట్లు చట్టాలు చేయనీయండి. ప్రజా స్వామ్యంలో అందరికీ ఒక నీతి ఉండాలని అంటున్నారు కదా! కాని ఒక మత విశ్వాసాలలోనే తలదూర్చి మిగిలిన మతాల జోలికి పోకపోవడం గౌరవింపదగిందా?

ప్రభుత్వం, ఏ రకమైన చట్టాలు చేసినా పాండిత్యం, అనుభవం, శీలం కలవారిని గుర్తించి వారి మాటలను పరిగణనలోకి తీసుకొని చట్టాలు చేయడం శ్రేయస్కరం. కనుక ప్రతి రంగంలోను ప్రముఖులకు స్థానం దక్కాలి.

మొత్తం ప్రపంచంలో ఆర్థికాభివృద్ధి, భద్రతలపై దృష్టిని సారిస్తున్నాయి. మతం, వారి పరిధిలోకి రాదు. మత విషయంలో పాండిత్యంతోనూ పనిలేదు. మత సమ్మతంగా వారి నడవడిక లేకపోయినా పట్టించుకోరు.

## 145. మత ప్రతినిధులకు ప్రత్యేక ప్రతిపత్తి

కనుక స్వేచ్ఛ, స్వయం ప్రతిపత్తిగల వివిధ మత ప్రతినిధుల సంస్థను ఏర్పాటు చేయాలి. అట్టి సంస్థలో ప్రభుత్వం, ఏమాత్రం జోక్యం

చేసుకోకూడదు. వారి సలహాలను బట్టి ప్రభుత్వం, చట్టాలు చేయగలగాలి.

అన్ని మతాలు, భగవత్ భక్తి, ప్రేమ, సత్యం, ఋజుత్వం, సేవ, వినయం మొదలైనవాటిని ప్రోత్సహిస్తాయి. ఒక మతంలోనే పరస్పరం కొట్లాడుకొనే ప్రజలలో, ఈ సద్భావాల వ్యాప్తికి ఆ పెద్దలు కృషి చేయాలి. భిన్నమతాల వారు కలిసి జీవించాలన్నా, మానవోన్నతిని సాధించాలన్నా పై సంస్థలకు ఆర్థిక సహకారము ప్రభుత్వం అందించాలి. ద్వేషాలతో కూడిన సమాజం వల్ల ఏం లాభం కల్గుతుంది?

ఎవరీ సంఘ సభ్యులు? ఆయా మత నియమాలను క్షుణ్ణంగా చదివినవారు, అనుష్ఠించేవారు, ఉండాలి. వారితోబాటు ప్రపంచ వ్యవహారాలలో ఆరితేరినవారు, ప్రజలతో సన్నిహిత సంబంధం కలవారు కూడా సభ్యులుగా ఉండాలి. అట్టి సంస్థలే ప్రభుత్వానికి మార్గదర్శకంగా ఉండగలవు.

## మత నాయకులు రాజకీయాలలో తలదూర్చకూడదు

రాజకీయాలలో మత నాయకులు జోక్యం చేసుకోకూడదు. ప్రాపంచిక విషయాలను పరిష్కరించడంలో అనుభవం, బుద్ధి సంపద ఉన్న కొన్ని లోటుపాట్లుండక తప్పదు. ప్రజలలో ధార్మిక ప్రవర్తనను పెంపొందించడం కోసమే మత నాయకులు తమ బుద్ధిని ఉపయోగించడం మంచిది. రాజకీయాలంటేనే కీర్తి, అధికారంతో కూడి యుండడం వల్ల ధార్మికులైన వారు దీనిలో ఇమడలేరు. కనుక రాజకీయాల రొచ్చులో దిగబడడం మంచిది కాదు.

మత సంబంధ విషయాలను ప్రోత్సహించినపుడు ప్రభుత్వాన్ని ప్రశం సించడం గాని, లేదా అనవసరంగా జోక్యం చేసుకొంటే విమర్శించడంలో గాని మత నాయకులు ముందుకు రావాలేగాని, మిగిలిన రాజకీయాలలో

ప్రేలు పెట్టడం మంచిది కాదు. రాజకీయాలకు, మతాన్ని ముడిపెట్టడం పవిత్ర వాతావరణాన్ని కలుషితం చేయడమే అవుతుంది. పైవారు మత క్రియా కలాపాలకు పరిమితమవడం ప్రజలకు శ్రేయస్కరం.

## మతాన్ని ప్రోత్సహిస్తే ప్రభుత్వం పొందే లాభం

ప్రభుత్వం, అన్ని మతాలను ప్రోత్సహించడం వల్ల ప్రజలున్నతులౌతారు. తద్వారా ప్రభుత్వమూ లాభపడుతుంది. శాంతి, భద్రతలకై కొన్ని వందల కోట్లను ప్రభుత్వం ఖర్చు పెడుతోంది కదా! అందు కొంత భాగం మతానికి వెచ్చిస్తే మంచిది. పూజా మందిరాలకు, ధార్మిక కార్యక్రమాలకు కొంత వెచ్చించడం వల్ల , ఉన్నత వ్యక్తులను పోత్సహించడం వల్ల, తద్వారా మత నాయకుల ధర్మ ప్రబోధాల వల్ల సహజంగానే ప్రజలలో నేరప్రవృత్తి తగ్గుతుంది. ప్రజల భౌతిక సంపద కూడా వృద్ధియైన కొలదీ చిన్నచిన్న నేరాల సంఖ్య కూడా తగ్గుతుంది.

కనుక సెక్యులిరిజం అంటే మతరహిత వ్యవస్థ అని చెప్పడం కంటె అన్ని మతాలను తగు విధంగా ప్రోత్సహించడం వల్ల సంఘం బాగుపడు తుంది. ఆధునిక నాగరికతవల్ల, విప్లవ భావాలవల్ల, తిరుగుబాటుల వల్ల నేటి వాతావరణం కలుషితమైంది. దీనికి విరుగుడు, ఆధ్యాత్మిక భావాలను వెదజల్లటమే.

## ప్రభుత్వ ప్రోత్సాహం - హిందూ, ఇతర మతాలకు

అన్ని మతాలకు ప్రభుత్వం ప్రోత్సాహమీయాలని ఆర్థిక సహకారం అందించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నా.

మన దేశంలో రెండు మతాలు, ప్రభుత్వ ప్రోత్సాహం లేకుండా మనగలుగుతున్నాయని మీకు తెలుసు. అవి మిగతా మతస్థులను తమ

మతంలోకి మార్చడానికి అన్ని ప్రయత్నాలు చేస్తున్నాయని, వృద్ధి పొందుతున్నాయని మీకు తెలుసు.

అయితే జనసంఖ్యలో ఎక్కువగా నున్న హిందువుల పరిస్థితి దయనీయంగా ఉంది. మసీదులు, చర్చిలు కట్టడానికి డబ్బులీయండని ఇతరమతాలవారు ప్రకటన లీయకుండా వాటినిర్మాణం, పునరుద్ధరణ సాగుతున్నాయి. కాని హిందువులు చిన్న గుడి కట్టుకోవాలన్నా, పునరుద్ధ రించుకోవాలన్నా నానా తంటాలు పడవలసి వస్తోంది. వీరికి పైవారి మాదిరిగా విదేశాలనుండి డబ్బు రాదు.

## మానవ సహకారం, ఆర్థిక సహకారం లేని హిందూ సంస్థలు

ఇన్నాళ్ళూ హిందూమతం ఎట్లా మనగలిగింది? అనుష్ఠానం వల్లనే. 2500 ఏండ్ల వెనుక ఇట్టి అనుష్ఠానం సన్నగిల్లడం వల్లనే హిందూమత సిద్ధాంతాలనే గ్రహించి బౌద్ధమతం పుట్టింది. ఇది, సంస్థలకు ప్రాబల్యాన్నిచ్చింది. బుద్ధునికే కాదు, సంఘానికీ శరణు జొచ్చాలని ప్రవచించింది. ఆ బౌద్ధ సంఘాలు, మతంలో తర్ఫీదు నీయడానికే పనికి వచ్చాయి. ఒక కొత్త మతం పుట్టిందంటే పాత మతంలోని వ్యక్తులందు చేరడం వల్లనే కదా! ఇట్టి పరిస్థితిలో ఆది శంకరులవతరించి సంస్థల గొప్పదనాన్ని గుర్తించి మఠాలను స్థాపించారు. వారిననుసరించి హిందూమతంలోని వివిధ శాఖలవారూ మఠాలను స్థాపించారు. ఇన్ని ఉన్నా వీటికి తగినంత మానవ సహకారం గాని, ఆర్థిక సంబంధమైన వనరులు గాని లేవు. కోట్లాది హిందువులను రక్షించలేక పోతున్నాం. డబ్బుకంటె అనుష్ఠానానికే అనగా ఆచరణకే పూర్వులు ప్రాధాన్యమిచ్చారు. మితిమీరిన డబ్బువల్ల ఆధ్యాత్మిక వాతావరణానికే హాని యని గ్రహించి వనరులను సేకరించడంలో పూర్వులు విశేష ప్రయత్నం చేయలేదు.

## రాజుల పోషణ

చాలాకాలం నుండి ఆధ్యాత్మిక భావాలు కలిగిన రాజులచే మతం పోషింపబడింది. దేవాలయ ఆరాధన ప్రజలను రక్షించింది. వాటిని రక్షించడ,ం పునరుద్ధరణవల్ల మతం రక్షింపబడింది. ఈ విషయంలో మఠాలవంతు తక్కువే అని చెప్పాలి.

ఆ రాజులు గతించారు. విదేశీ పాలనవల్ల ప్రభుత్వం నుండి సహకారమూ పోయింది. తెల్లదొరల పాలనలో వారి జీవన విధానానికి మనవారు ఆకర్షింపబడి మన సంస్కృతిని విస్మరిస్తున్నారు.

## స్వాతంత్ర్యం ఉద్యమమూ విఫలమగుట

మన స్వాతంత్ర్య ఉద్యమనాయకుడు, విదేశీ పాలననుండే కాక, వారి జీవన విధానం నుండి దూరంగా ఉండాలని, స్వదేశీ ఉద్యమం చేసినా ఇతనిని అనుసరించిన నాయకులు స్వీయసంస్కృతిని రక్షించుకోవడంలో తగినంత శ్రద్ధను చూపలేదు. వీరందరి దృష్టి ముందుగా విదేశీక బంధ హస్తాలనుండి దూరం కావాలనే. అందువల్ల ప్రజలలో స్వీయ సంస్కృతి పరిరక్షణలో స్తబ్ధత వహించారు. విస్మరించారు కూడా.

హిందువులలోనే ఇట్టి పరిస్థితి. మహమ్మదీయులు, తమ మత సంప్రదాయాలను, ఆచారాలను మానుకోలేదు. పాశ్చాత్య విధానానికి పరుగులు తీయలేదు. ఇక క్రైస్తవులు, పరిపాలకుల మతాన్ని అనుసరించారు కావున అసలు సమస్యే పుట్టదు. హిందూమతమే, విదేశీ పాలన వల్ల విలవిలలాడింది.

స్వాతంత్ర్యోద్యమంలో కొన్ని హిందూ సమాజాలు సమాజ ఉద్ధరణకు ప్రయత్నించినా, ఉద్యమం వీటికి స్ఫూర్తినందించ లేకపోయింది.

ఇట్టి పరిస్థితిని పక్షపాతం లేకుండా ఇతర మతాలు అర్థం చేసుకొంటే, ప్రభుత్వం తగు విధంగా అన్ని మతాలను ప్రోత్సహించాలని, దెబ్బతిన్న హిందూమతాన్ని ప్రోత్సహించాలని, ఆర్థిక సహకారం అందించుటకు అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

## అన్ని మతాలవారు సోదరులుగా

ప్రభుత్వం కంటె ప్రజలలో మత సంరక్షణకు పూనుకోవాలనే తపన ఉండాలి. ఒక్కొక్క మతంవారు, తమ తమ న్యాయమైన హక్కులను ఇతర మతస్థుల ముందు ప్రేమతో ప్రతిపాదించి ఇతర మతస్థుల గౌరవాదరణలను ముందు నోచుకోవాలి. ఎందుకంటే అందరూ ఈ భూమిలో కలిసియుండాలి కదా! మత సంఘర్షణవల్ల ఎవరికీ లాభమూ కలుగదు. ఇట్లా సమస్యలను కొంతవరకు పరిష్కరించుకోవచ్చు. ఈ విషయంలో ముందుగా హిందువులు చొరవ తీసుకోవాలి. సాధారణంగా తక్కువ సంఖ్యలో నున్నవారు ఎక్కువ సంఖ్యలో ఉన్నవారికి లోబడవలసి వస్తుంది. కాని ఇక్కడ ఎక్కువగా నున్నవారే అల్ప సంఖ్యాకులకు తల ఒగ్గవలసి వస్తోంది.

## ఈ దేశంలో చిత్రమైన పరిస్థితి

ఈ దేశంలో చాలాకాలం నుండి అధిక సంఖ్యాకులు సాత్వికులని విదేశీయులే అన్నారు. స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్న హిందూ నాయకులు అల్పసంఖ్యాకుల పట్ల చాలా ఉదారభావాన్ని ప్రకటించారు. వారిని బుజ్జగించారు. దీనివల్ల అల్పసంఖ్యాకులు తామొక ప్రత్యేక జాతిగా, మతంగా భావించి దేశాన్ని రెండు ముక్కలుగా చీల్చేటంత వరకూ నిద్రపోలేదు. ఇట్టి పరిస్థితిలో తమ బాధలను చెప్పుకోవడానికి అధిక సంఖ్యాకులు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేయవలసి వచ్చింది. హక్కులకు పోరాడవలసి వచ్చింది. అధిక సంఖ్యాకులుగా నున్న హిందువులు ఇతరుల నడగవలసిన పరిస్థితి ఏమిటని

అడుగవచ్చు. అయినా గత చరిత్రను ప్రక్కనబెట్టి అందరూ కలిసి యుండాలి కనుక తాము సంఖ్యలో ఎక్కువగా వున్నామనే భావనను ప్రక్కనబెట్టి ఇతరులతో సంప్రదించడమే మేలు. ప్రభుత్వం ఆర్థిక సహకారం అన్ని మతాలకు అందిస్తే హిందూమత పరిస్థితిని గమనించి దీనికి ఎక్కువగా ఆర్థికంగా, ఆదుకోవడం సబబని ఇతర మతాలవారిని మనం ఒప్పించగలగాలి.

అంతమాత్రంచే మిగతా మతాలకు ప్రభుత్వం సాయం చేయకూడదని అనడం లేదు.

## ప్రభుత్వం పాత్ర

ఆయా మతస్థులు ప్రచారం చేసుకోవడానికి, మత సాహిత్యాన్ని ముద్రించుకోవడానికి, ఆరాధనా స్థలాలను నిర్మించుకోవడానికి, పునరుద్ధరించుకోవడానికి ప్రోత్సహం ప్రభుత్వం అందించాలి

తగినంత ఖర్చు పెట్టాలని అనడంచే ప్రజల పాత్ర ఎంతో ఉందని అర్థం చేసుకోవాలి. ప్రభుత్వమే అంతా భరిస్తే ప్రజలలో తమ తమ మతాలపట్ల భక్తిభావం సన్నగిల్లుతుంది. ప్రజలలో నైతిక భావాలు వృద్ధి పొందడం కోసం ప్రభుత్వమూ, ప్రజలూ తగు విధంగా అన్నివిధాల అయా మత సంస్థలను ప్రోత్సహించాలి.

## మతంలో స్వేచ్ఛ - మతం మార్పిడి

మతస్వేచ్ఛను మన రాజ్యాంగం ప్రసాదించింది. అంటే ఎవరి మతాన్ని వారు స్వేచ్ఛగా స్వతంత్రంగా అనుసరించవచ్చు. తాత తండ్రులనుండి వచ్చిన సంప్రదాయాలను, మతాన్ని అందరూ పాటిస్తారు కదా!

అయితే ఒకడు మరొక మతాన్ని ప్రేమించవచ్చు. ఇక కొందరు ఏ మతాన్నీ

అనుసరించని వారుంటారు. అంటే ఎవడే మతాన్ని అనుసరించినా ఇంకొక మతాన్ని స్వీకరించినా మతం లేకపోయినా మనుగడ సాగించవచ్చనే అర్థం వస్తోంది.

ఒక మతంలో ఉంటూ తల్లివంటి ఆ మతాన్ని విడిచిపెట్టడం పాపమని శాస్త్రాలంటున్నాయి. పరిస్థితులకు అనుగుణంగా ఇట్లా మారడాన్ని నావంటివారు అడ్డుకొని తీరాలి. నేడు శాస్త్ర నియమాలను ప్రభుత్వం పాటించాలని ఒత్తిడి తీసుకొని రాలేము. కనుక ఎవరికి వారు తమకు నచ్చిన మతాన్ని స్వీకరించవచ్చనే అభిప్రాయానికి మేము తలవంచవలసి వస్తోంది.

పౌరులకు మతస్వేచ్ఛ నిచ్చినపుడు మత నాయకులు, అనుయాయులు తమ కిష్టమైన ప్రచారం చేసుకోవడానికి స్వేచ్ఛనచ్చినట్లే కదా! ఇతరులకు ఇబ్బంది లేని రీతిలో ప్రచారం సాగించవచ్చు.

## ప్రచారంలో మంచి - చెడూ

ఎవడైనా తన మతాన్ని వీడి మరొక మతాన్ని స్వీకరించినపుడు ఈ ప్రచారం మతం మార్పిడికి, దారి తీస్తుంది. ఎవడైనా మనసు మార్చుకొని శ్రద్ధా విశ్వాస పూర్వకంగా అన్యమతాన్ని అలవలంబించడం వేరు. ప్రచారంలో తమ తమ సిద్ధాంతాలను వెల్లబుచ్చుతూ ఉంటారు కదా! ఇవీ తప్పుడు మార్గాల ద్వారా మతాన్ని మార్చడం మాటేమిటి?

## తప్పుడు మార్గాలను శిక్షించవలసిందే

మతంతో సంబంధం లేని పద్ధతులను మత ప్రచారంలో వాడి తమ మతాలలో కలుపుకోవడమే చర్చనీయాంశం. మీ మతంలో ఫలానా తప్పులున్నాయి. మా మతంలో లేవు, మీరు మాలో చేరితే ఫలానా సౌకర్యాలు

లభిస్తాయనే ప్రచారం మాత్రం ముమ్మరంగా సాగుతోంది.

అన్యమత ప్రచారకులిట్లా వాదించవచ్చు. మత స్వేచ్ఛను ప్రభుత్వం ప్రసాదించింది కనుక మేము ప్రచారం చేసుకొని ఇతరులను మా మతంలోకి కలుపుకోవడం మా ధర్మం. మా ధర్మాన్ని మీరు ఊడబెరికితే అది రాజ్యాంగ విరుద్ధం కాదా? అని వాదిస్తారు. ఇది హేతుబద్ధం కాదు.

ఎందుకంటే ఒక మాటు చరిత్ర చూడండి. గతకాలంలో ఇతర రాజ్యాలపై దండయాత్ర చేసి తన రాజ్యాన్ని విస్తరింపచేసుకోవడం ఉంది. ఇది అనాదిగా అన్ని దేశాలలోనూ ఉంది.

కాని ఈనాడు పరిస్థితి మారింది. ఇతరుల రాజ్యాన్ని కబళించడం నేరంగా పరిగణింపబడుతోంది. ఇది ఒక శుభ పరిణామం. అయితే గతంలో రెండు ప్రపంచ యుద్ధాలు జరిగినా, ఒక దేశానికి మరొక దేశానికి ప్రచ్ఛన్నయుద్ధం (Cold war) జరుగుతూ ఉన్నా ఇతరులు రాజ్యాన్ని కబళించడం తప్పని అందరూ అంగీకరిస్తున్నారు కదా! ప్రపంచ దేశాలపై దండయాత్ర సాగించిన హిట్లర్‌ని అందరూ నిందిస్తున్నారు కదా! పాత పద్ధతిని సమర్థిస్తున్నారా? అట్లాగే మతాలను మార్చడం, అందర్నీ తమ మతంలోకి తీసుకురావడం నేరంగా ఎందుకు భావించరు? శారీరకంగా ఆక్రమించడం కంటె ఈ మానసిక ఆక్రమణ ఇంకా ఘోరమైనది.

మత సిద్ధాంతాలలో వారికది భాగం కావచ్చు. మత ప్రవక్తకుల అనుభూతులననుసరించి ఇతరులు కూడా అట్టి అనుభూతులను పంచుకోవాలనే భావంతో క్రొత్త మతంలోకి ప్రజలను ఆహ్వానించి యుండవచ్చు.

అయినా తమ మతమే గొప్పదని, నమ్మనివారు నరకానికి పోతారని ప్రచారం చేయడాన్ని సమర్థించలేం. పరమేశ్వర సృష్టిలో ఎంతో వైవిధ్యం ఉంది. అట్లాగే మతాచారాలలోను ఈ వైవిధ్యం ఉండడం సహజం.

సత్యాన్ని చేరుకోవడానికి అనేక మార్గాలున్నాయనే సత్యాన్ని వేదం అందించింది. ఈ సనాతన ధర్మంలో అనేక మార్గాలున్నాయి. తాత్త్వికమైన, నైతికమైన పునాదులున్నాయి ఈ మతానికి. అనాదినుండి ఒక సంస్కృతి ఉంది. ఇట్టివారిని తమ మతాలలో కలుపుకోవడానికి ప్రయత్నించడం సబబు కాదు. ఇతర మతాలలో ఉన్న కొందరు మేధావులు కూడా మనమతాన్ని వేనోళ్ళ కీర్తించారు. దీనిని కేవల మత ప్రచారకులు గ్రహించకపోవచ్చు. అయినా ఇట్లా మార్చడాన్ని తమ పవిత్రకర్తవ్యంగా భావించడం శోచనీయం.

తప్పులెంచడం అంటూ జరిగితే దేనినైనా తప్పు పట్టవచ్చు. ప్రతిమత జీవిత విధానంలోనూ తప్పులు దొర్లకమానవు. ఇతర మతాలలో తప్పు లెంచుతూ ప్రచారం చేయడం వల్ల ద్వేషాగ్నిని రగుల్కొల్పుతున్నామని వారు భావించడం లేదు. ఇతర మతస్థులు తమకంటె హీనులని, భావ దరిద్రులనే భావం వారిలో నాటుకుపోయి ఆ ద్వేషం ఇంకా ప్రబలమయ్యే అవకాశం ఉంది. ఇట్లా పరమాత్మనుండి దూరంగా తొలగిపోతున్నాం. అనాది నుండి వచ్చే ఈ సంప్రదాయం, మతం, కొన్ని కోట్ల మందికి ఊరటను ప్రసాదించింది. ఎన్నో తాకిడులను తట్టుకొని మనగలిగింది. ఏవైనా కొన్ని లోపాలు ప్రవేశించి యుండవచ్చు. అలా అయినా దీనిని సమూలంగా పెకలించాలని, అన్యమతాలతో ప్రజలను ప్రభావితులను చేయాలనే ధోరణి ప్రశంసింపదగింది కాదు.

ఏ మతంలేని దేశ ద్రిమ్మరులనో, ఆటవికులనో తమ మతంలోకి కలుపుకొన్నారని అందాం. అయితే ఆ ఆటవికులలోనూ ఏదో ఒక మత పద్ధతి అనాదిగా ఉండనే ఉంది. మనం చేసే అన్యాయాలు, అక్రమాలు వారిలో లేవు. అయినా వారిని అనాగరికులనే ముద్రవేసి వారి సంప్ర దాయాలను మార్చి ఆ ప్రాంతాలను ఆక్రమించడం జరుగుతోంది. (వారి మతం మార్చి వారికి ఈ దేశం నుండి విడిపోవాలనే భావనను కల్గిస్తున్నారు. ఉదా: ఈనాటి నాగాలాండ్) అవే పద్ధతులును నాగరిక హిందువులును

మార్చడంలో ఎందుకు ప్రవేశపెడుతున్నారు? ఈ పద్ధతిని మతస్వేచ్ఛయని యంటున్నామా? ఇది దుర్వినియోగం చేయబడడం లేదా?

ప్రభుత్వం, ఆస్తి హక్కును ప్రసాదించింది. అర్థం ఏమిటి? తన ఆస్తిని కాపాడుకొనే స్వేచ్ఛ యుంది కాని ఇతరుల ఆస్తిని కాజేయాలని కాదు కదా! అట్లాగే మత స్వేచ్ఛను అర్థం చేసుకోవాలి. తన మతాన్ని తాను ఆచరించాలని ఇతరులను తనవైపునకు త్రిప్పడమని కాదు కదా! ఇట్లా చేస్తే ఇతరుల మత సంబంధమైన హక్కులను హరించడమే కదా! ఏ వ్యక్తియైనా తనకు తాను మారడం వేరు.

ఆపైన ఇతరులను తన మతంలోకి మార్చడం హిందూ మతంలో లేదు. మతాలను మార్చేవారు ఒకర్ని ఒకరు కొట్టుకొని మార్చుకోవడం వేరు. సాత్వికంగా బ్రతికే ఈ జాతిని మార్చడమేమిటి?

కనుక మతస్వేచ్ఛలోని దుర్వినియోగాన్ని ప్రభుత్వం అరికట్టాలి. సంఘంలో శాంతి భద్రతలను కలిగించే బాధ్యత ప్రభుత్వంపై ఉంది.

తమ మతాలను విశదీకరించడం వేరు. ఇతరులను కేవలం మార్చడానికే ప్రచారం చేయడం వేరు. అనేక ప్రలోభాలకు గురిచేస్తున్నారు. ఇది నిందింపదగింది.

## మతం మార్పిడి - పునరాగమనం

ఐచ్ఛికంగా ఇతర దేశాల మేధావులు కొందరు హిందూమత పద్ధతులను స్వీకరించడం చూస్తున్నాం. హిందువులు పూర్వకాలంలో బౌద్ధులను జైనులను తమలో కలుపుకోలేదా అని ప్రశ్నించవచ్చు. మా సమాధానం వినండి. వాళ్ళు సహజంగానే హిందువులై యుండి బౌద్ధ జైనాలను స్వీకరించారు. అయినా వారిని తిరిగి హిందూ మతంలోకి హిందూనాయకులు మార్చలేదు. ఇకనుండి బౌద్ధాది మతాలలో ప్రవేశించకుండా హిందూమత నాయకులు అడ్డుకొన్నారు.

అలెగ్జాండర్ కాలం నుండి విదేశీయులు మనదేశంలో ప్రవేశించినా వారి నెవ్వరిని హిందూ మతంలోకి మార్చలేదు. వ్యాపారం సంబంధాల వల్ల కొందరిక్కడ ఉండిపోయారు. ఇక క్రైస్తవులు, మహమ్మదీయులు దేశంలో చొరబడి బలవంతంగా ఇక్కడివారిని మార్చినా ముందుగా వచ్చిన క్రైస్తవుల్ని, మహమ్మదీయుల్ని హిందూమతంలోకి మనవాళ్ళు మార్చలేదు. క్రైస్తవులుగా మహమ్మదీయులుగా మారినవారినీ మార్చలేదు. హిందువులు మూకుమ్మడిగా మారడాన్ని మాత్రమే అడ్డుకొన్నారు.

ఆపైన ఇతర మతస్థులు తమ ప్రార్థనా మందిరాలను కట్టుకొంటామంటే ఇక్కడి హిందూ రాజులు తగు స్వేచ్ఛనిచ్చారు. వారికి దానధర్మాలు చేసిన ఉదారులూ ఉన్నారు. ఎప్పుడూ ఇతరమతాలపై దండెత్తకుండా ఆత్మరక్షణకై పాటుబడ్డారు.

ఈనాడు ఇతర మతాలలో మారిన హిందువులను తిరిగి హిందూ మతంలోకి తీసుకొని రావడం జరుగుతోంది. (ఆర్య సమాజం మొదలైనవి) ఈ దేశంలో పుట్టి బౌద్ధులుగా, జైనులుగా మారినవారిని తిరిగి హిందువులుగా మార్చడం పూర్వం ఉన్నా, ఇప్పుడు విదేశాలలో పుట్టిన మతాలలో హిందువులు మారితే మరల హిందూమతంలోకి తీసుకొని రావడం జరుగుతోంది. కాలగర్భంలో బౌద్ధం ఈ దేశంలో అంతరించిపోయింది. (ఈ మాట అంబేద్కర్ హిందువులను బౌద్ధులుగా మార్చడానికి ముందన్నారు)

హిందూమతానికి సోదరిగానే జైనమతం ఉంది. ఆ జైనులీనాడు హిందువులను మార్చడంలేదు.

కొన్ని తరాల వెనుక మనవారు ఇతర విదేశీ మతాలలోకి మారినా వారినీ మనవారు మార్చడం లేదు. ఇటీవల ఇతర మతాలలోకి మారితే వారినే తిరిగి రండని పునరాగమన కార్యక్రమాన్ని కొందరు చేస్తున్నారు.

## అక్రమ మార్గాలలో మతం మార్పిడి

మిగతా మతాలవారు, మతానికి సంబంధం లేని వాటిని ఉపయోగిస్తూ మన మతాన్ని మారుస్తున్నారు. ఏ సంఘంలోనైనా చాలామంది ప్రజలు సాధారణ జీవనం గడుపుతూ విషయ పరిజ్ఞానం లేకుండా ఉంటారు. అట్టివారు హిందూ మతంలో అసంఖ్యాకంగా ఉన్నారు. ఇట్టి వారిని మతం మారుస్తున్నారు.

ఇట్టివి రెండు పద్ధతులలో జరుగుతున్నాయి. బలవంతంగా మార్చడం ఒకటి. ప్రభుత్వం ఒక మతానికి చెందినదై జులుమును ప్రదర్శిస్తూ తమ మతం కాని వారిపై పన్నులు వసూలు చేయడం వంటిది. (ఇట్టిది మహమ్మదీయ పాలనలో జరిగింది) మరొక పద్ధతిలో విద్య ద్వారా, వైద్య సదుపాయం ద్వారా సాంఘిక సేవాకార్యక్రమాల ద్వారా మతాన్ని మార్చడం. ఇట్లా చేయడం వల్ల ప్రజలు, ఆ మత బోధకులకు ఋణపడి యున్నామని భావించి వారి మతంలో చేరిపోతున్నారు. ఇక ప్రత్యక్షంగా డబ్బులిచ్చి లోబరుచుకోవడం నీచాతినీచం.

ఈ రెండు పద్ధతులూ గర్హింపదగినవే. ఇట్లా చేస్తున్నారేమిటని ఎవరైనా అంటే, హిందువులూ ఆస్పత్రులు, విద్యాలయాలూ స్థాపించి మతం మార్పిడిని అడ్డుకోవచ్చు కదా అని ప్రశ్నిస్తారు.

ఇట్లా సలహా చెప్పేవారు కొన్నింటిని విస్మరిస్తున్నారు. పై సంస్థలను విదేశీ మతాలవారు కొన్ని వేల కోట్లను ఖర్చుపెట్టి మహానగరాలలో నిర్మించారు. వారి పోటీకి తట్టుకోవాలంటే మనకూ అంత ధనముండాలి కదా! అందులో వందోవంతైనా సోదర హిందువులనుండి ప్రోగు చేయగలమా? మనం సేకరించేది బహు స్వల్పం.

డబ్బును ఎరజూపి కలుపుకొంటున్నారు కదా! దీనినెట్లా అరకట్టగలం?

ఎన్నికలలో తప్పుడు మార్గాలను అనుసరించినట్లు చేయగలమా? ఈ సలహా ఉచితం కాదు. అర్థరహితం. అక్రమ మార్గాలను అడ్డుకోవాలిగాని మనం కూడా అక్రమ మార్గాలను అనుసరించకూడదు.

ఒక మౌలిక సమస్యను అర్థం చేసుకోండి. వారు స్థాపించిన విద్యా సంస్థలలోనే విద్యను సంపాదిస్తున్నాడు. ఆస్పత్రిలో చేరి రోగాన్ని పోగొట్టుకుంటున్నాడు. అనాథ శరణాలయంలోచేరి ఆశ్రయాన్ని పొందు చున్నాడు నిజమే. ఇట్టి సందర్భాలలో మతం యొక్క అవసరమేముంది? పైవాటికి మతం కోసం వెళ్ళాలా? వీటిని ఎరజూపి మతాన్ని మార్చడం నేరంగా వారు భావించరా? సంఘసేవ లక్ష్యం, సంఘసేవయే. కనుక వారి ఉద్దేశాలను గమనించి అట్టి లక్ష్యంతో మనమూ ఆ పనులు చేయకూడదు.

సంఘసేవ నిమిత్తం వాటిని స్థాపించండి. వీటివల్లనే మతం రక్షింప బడుతుందనే భావం రానీయకండి. ఇతరులతో ఈ విషయంలో పోటీపడన సరం లేదు. (ఆత్మోన్నతికై సంఘసేవ ఉండాలి)

**మతం విషయంలో** స్వేచ్ఛ అంటే తనకిష్టమైన మతాన్ని అనుసరించడం **వల్ల అతని మనస్సునకు** ఉన్నతి కల్గుతుంది. అంతేనేకాని ఇతరులను తన **మతంలోకి తీసుకొని** రావడానికి ఉపయోగిపడితే ఎలా. అక్రమ మార్గాలు త్రొక్కి, రాజ్యాంగం ఇచ్చిన మత స్వేచ్ఛను దుర్వినియోగపరిస్తే అది నేరమే.

ఇతరులను ఆదుకోవడం నేరమా అని వారడగువచ్చు. ఆ పేరుతో, ఆ ముసుగులో ఇతర మతస్థులను మార్చడం, దోచుకోవడం, వ్యభిచారం వంటి నేరాలతో సమానమే. (ఒకవిధంగా మార్చబడినవారు ఇంతకుముందున్న మత సంస్కృతులపై ద్వేషభావాన్ని ప్రదర్శిస్తున్నారు. దేశం నుండి విడిపోవాలని ఉద్యమాలు చేస్తున్నారు)

## మతం మార్పిడి ఉన్నంత వరకూ తిరిగి చేర్చుకోవడమూ సాగవలసిందే

ఏవో చట్టాలు చేసినంత మాత్రంచే నేరాలను ఎవ్వరూ అరికట్టలేరు. ఏ దేశమైనా అంతే. కొన్ని క్లిష్టపరిస్థితులలో మతం మార్చుకొన్నా తిరిగి పుట్టుకతో వచ్చిన మతానికి మారుతామంటే దానినొక నేరంగా భావింపరాదు. పీఠ బాధ్యత నాపై ఉంది కనుక ప్రభుత్వం, మతం మారడాన్ని అరికట్టాలని చెప్పే ధర్మం నాకుంది.

ఇట్లా అంటున్నానంటే మత స్వేచ్ఛను అడ్డుకొంటున్నానని భావించకండి. అక్రమపద్ధతులను అరికట్టాలనే తపనతో చెబుతున్నా.

## మతం, ఆధ్యాత్మికతలే ఈ దేశాన్ని ఉన్నత స్థితిలో ఉంచాయి

ఇదే విషయాన్ని వివేకానందులు ప్రవచించగా అనిబిసెంటు వంటి పాశ్చాత్య నారీమణులు సమర్థించారు. ఇది మరిచిపోతే సంఘం, ఏ రంగంలో ముందున్నా శవానికి అలంకరించడమౌతుంది. భౌతికమైన వాంఛలు వెఱ్ఱి తలలు వేయకూడదని సనాతన ధర్మం చెప్పింది. అందుకోసమే మత కార్యకలాపాలు, వేదాంతం భౌతిక ప్రపంచాన్ని అదుపులో ఉంచగలిగాయి. ఏ పని చేసినా అది ఆత్మోన్నతికే దారి తీయాలన్నారు. ఇట్టి భావ పరంపర నుండే ఎందరో మహానుభావులవతరించారు. అపారమైన వేదాంత సత్యాల నందించారు. అందుకే ఇతరులు కూడా ఈ దేశాన్ని కీర్తిస్తారు. మానసిక తృప్తికోసం ఎందరో పాశ్చాత్యమేధావులిక్కడకు వస్తున్నారు. వారి ఆధ్యాత్మిక దాహాన్ని మనదేశం తీరుస్తోంది. కాని మనం మన పద్ధతులకు మంగలం పాడి ఇతర దేశాలను అనుకరిస్తున్నాం.

## వేయి సంవత్సరాల చరిత్ర చెప్పే పాఠం

వేయి సంవత్సరాలనుండి ఈ దేశం ఇతరులచే ఆక్రమింపబడింది. ప్రధానంగా ఉత్తర దేశ ప్రజలు పరదేశీయులపాలనలో అనేక కష్టాలనెదుర్కొన్నారు. అందువల్ల ఆధ్యాత్మికత సన్నగిల్లింది. ఇతరుల కట్టుబాట్లను ఆచార సంప్రదాయాలను పాటించవలసి వచ్చింది. అయినా తమ ప్రత్యేకతను కాపాడుకొంటూనే ఉన్నారు. ఇక తెల్లదొరల పాలనలో పరిస్థితి ఇంకా విషమించింది.

## విదేశీయుల పన్నాగాలు - రెండు విప్లవాలు

పరోక్షంగా ఈ సంస్కృతిపై విదేశీయులు దాడిచేసారు. వారి మానసపుత్రులుగా మనలను మార్చివేసారు. వారి భౌతిక జీవనమే మన జీవన విధానం కంటె మిన్నయనే భావం కలిగించారు. ఇక విప్లవాలు వచ్చాయి.

శాస్త్రీయ పరిశోధనలతో కొత్తవాటిని కనుగొన్నారు. పారిశ్రామిక విప్లవం పేరుతో తక్కువ కాలంలో ఎక్కువ ఉత్పత్తి చేసి మన కుటీర పరిశ్రమలను దెబ్బతీసారు. అది వారి జీవన విధానికి బాగుండవచ్చు. ముడిసరుకులను ఇతర దేశాలనుండి గ్రహించి యంత్రాల సాయంతో అధికోత్పత్తి చేసి ఇతర దేశాలకు ఎగుమతి చేసి అధిక లాభాలను గడించారు. సాదాసీదాగా గడిపే మన జీవన విధానాన్ని దెబ్బకొట్టింది. భౌతిక వాంఛలను తీర్చుకోవడానికి మన చేత పరుగులు పెట్టించింది. వారి విద్యావిధానాన్ని అవలంబించడం వల్ల ఈ దేశంలో పుట్టిన విద్యల పట్ల నిర్లక్ష్యం చూపించాం. మనం సైన్సు విషయంలో వెనుకబడి యుండడం వల్ల వారి పరిశోధనల పట్ల ఆకర్షితులమయ్యాం.

దానికి తోడు ఫ్రెంచి విప్లవం వచ్చింది. సేచ్ఛ, సౌభ్రాతత్వం, సమత్వం అనే త్రిసూత్రాలనందించింది. స్వేచ్ఛ మిగతా వాటితో ఉన్నా, మిగతా వాటిని త్రోసిరాజని కేవలం స్వేచ్ఛకే పట్టం గట్టి ధర్మానికి దూరమయ్యాం. ఇక దేవుడు లేడు, వినయ విధేయతలు సున్న. సంస్కృతి, విశ్వాసాలపై ఆచరణ తగ్గింది.

సాదాసీదా జీవనానికి, ఉన్నతమైన వ్యక్తిత్వానికి మళ్లీ మళ్లగలమా? లేక పాశ్చాత్య సంస్కృతిలో మునిగిపోవడమా? మనకు స్వాతంత్ర్యం వచ్చినా మనని నిజంగా స్వతంత్రులమయ్యామా? గుడ్డిగా అనుసరించడాన్ని గమనించారా? భారతీయ ఆత్మను విస్మరిస్తున్నామని బాధపడుతున్నారా? ఏ దశలో ఉన్నాం? ఆలోచించండి.

## గాంధీ సిద్ధాంతాన్ని విస్మరించాం

ఒక మహా నాయకునిపై విశ్వాసాన్ని ఉంచలేకపోయాం. స్వదేశీ ఉద్యమాన్ని నడిపిన గాంధీని విస్మరించాం. అతని అనుయాయులు కొద్దిమందే నేడున్నారు. అతనికి భిన్నంగా ప్రవర్తించిన వారి సంఖ్య అధికమైంది.

అతడందించిన స్వాతంత్ర్యాన్ని నియంత్రణలేని స్వేచ్ఛగా భావించాం. మనకు ప్రత్యేక సంస్కృతి ఉందని నెత్తి నోరు కొట్టుకున్నా ఒంట బట్టించుకోవడం లేదు. అతని అనుయాయులు నిజమైన మతరహిత వ్యవస్థను అర్థం చేసుకోలేదు. కేవలం మతరహితంగానే పాలించాలన్నారు. అన్ని మతాలకు ప్రోత్సాహం, మతం మార్పిడి లేకపోవుట, పాశ్చాత్య పద్ధతులను గ్రుడ్డిగా అనుసరించకుండా ఉండుట మొదలైనవి ఆచరణలో పెట్టదగిన అంశాలు.

## దేశమతం

ఈ దేశంలో అనాదినుండి ఒక మతాన్ని అనేకులు నమ్ముకొని యున్నారు. రాజులు దానిని పోషించారు. ఇతర మతాలపట్ల సహనమూ చూపించారు. ఆధునిక నాగరికతలో ముందంజ వేసిన ఇంగ్లీషు వారు కూడా God save the King అని గానం చేయడం తెలిసిందే. అనగా భగవంతుడు రాజును రక్షించుగాక. అంతేకాదు, రాజు విశ్వాస రక్షకుడుగా కావాలని వారు కోరుకొనేవారు. క్రైస్తవ దేశమని వారు తమ దేశాన్ని చెప్పుకోవడంలో సిగ్గుపడటం లేదు. వారి చర్చి కూడా వారి లోక్‌సభ ఒద్దికలోనే ఉంటుంది. దీనిని గమనించాలి.

ఇట్లా వారుండగా అన్నీ అనుకరించిన మనం అధిక సంఖ్యాకులై హిందువులున్నా మన దేశాన్ని హిందూ దేశంగా ఎందుకు పరిగణించలేక పోతున్నాం? ఏ మతం అనాదిగా ఉందో, ఏది ఇతర మతాలకు ఆదర్శ ప్రాయంగా ఉందో, ఏది మత సహనాన్ని బోధించిందో ఏది మతం మార్పిడులను ప్రోత్సహించదో అట్టి హిందూ మతాన్ని రాష్ట్రమతంగా (దేశమతంగా) ఎందుకు పరిగణించరు? అంత మాత్రంచే ఇతర మతాలకు హాని లేదు కదా!

రెండు మతాలవారు కొట్టుకొని రెండుగా ఈ దేశం విభజింపబడింది కదా! భారత్‌లో అధిక సంఖ్యాకులు ఇప్పటికీ హిందువులే కదా!

## విద్యాబోధనలో మతానికి స్థానం

ఆధునిక విజ్ఞానానికే పెద్ద పీట వేసి మతాన్ని ప్రక్కన పెట్టింది తెల్లదొరల ప్రభుత్వం. ఈ పద్ధతిని కొనసాగించడం వల్ల హిందువులే నష్టపోయారు. నైతిక బోధన పేరుతో ఒక గంటను కేటాయించేవారు. (అదీ నేడు కనిపించడం లేదు). ప్రాచీన సంస్కృతి యొక్క గొప్పదనాన్ని వివరించే అవకాశమే నేటి

విద్యావిధానంలో లేదు. అపారమైన వాఙ్మయ సంపద గురించి నేటి విద్యార్థులకు ఏమీ తెలియడం లేదు. అన్ని మతాల విద్యార్థులకు ముఖ్యమైన మత సూత్రాలను తెలిసేటట్లు నేటి విద్యావిధానం తప్పక కలిగియుండాలి. ఇట్టి దానిని ప్రవేశపెట్టాలి.

## ఆధ్యాత్మిక స్వాతంత్ర్యానికై పోరాటం

స్వతంత్ర భారతదేశం దీనికి అంగీకరిస్తుందా? రాజ్యాంగం ఒప్పుకొంటుందా? ఏ మతాన్ని పట్టించుకోలేకపోవడమే సెక్యులరిజమ్ అని అర్థం ఒంటబట్టిన నాయకులు దీనిని పట్టించుకొంటారా?

రాజకీయ స్వాతంత్ర్యం కోసం ఎందరో త్యాగాలు చేసారు. కాని నేడు సాంస్కృతిక పునరుజ్జీవనం కోసం త్యాగం చేసేవారు కావాలి. సంఘంలోని మేధావులు దీనికై నడుం కట్టాలి. సాంస్కృతికంగా ఎదిగినపుడు మాత్రమే స్వాతంత్ర్య ఫలాలు దక్కుతాయి.

అధిక సంఖ్యాకులే కాదు, అల్ప సంఖ్యాకులు కూడా ఈ దేశాన్ని ప్రేమించునట్లు అధిక సంఖ్యాకులు ప్రయత్నం చేయాలి. మీరందరూ భారతీయులే, భారతీయ ఆత్మను గుర్తించండని అధిక సంఖ్యాకులు, అల్ప సంఖ్యాకులతో ప్రేమతో చెప్పాలి. ఇది ద్వేష భావంతో సాగకూడదు. మాజాతి, మా మతం, మా సంప్రదాయం, మా భాష వేరు అంటూ నినదించడం వల్ల దేశం ముక్కలు కాలేదా? ఈనాటి తరంలో అట్టి వేర్పాటు ధోరణులకు స్వస్తి పలికేటట్లుగా సుహృద్భావ వాతావరణాన్ని తీసుకొని రావాలి.

## జాతీయ పతాకంలో ధర్మచక్రం

మత నాయకులు భౌతికాభివృద్ధికే మ్రొగ్గు చూపినా వారందరూ నిస్స్వార్థంగా, పవిత్రమైన మనస్సులతో త్యాగాలు చేసారు. ధర్మచక్రాన్ని

జాతీయ పతాకంలో ఉంచారు. అది మధ్యలో ఉంది.

ఈ చక్రాన్ని ఆ నాయకులు, ఈనాడు దేశంలో లేని బౌద్ధ చక్రంగా భావించారు. అది సారనాథ్ స్తంభం పైన ఉన్న ధర్మచక్రం. అశోక చక్రవర్తికి సంబంధించింది. అతనికి ఉన్న పేరు, దేవానాంప్రియుడు. అనగా దేవతలకు ఇష్టుడు. అట్టి చక్రాన్ని ఉంచడమూ దేశానికి గర్వకారణమే. అయితే ధర్మము భగవత్ సంబంధం కాకపోతే సంపూర్ణ ఫలాన్ని ప్రసాదించలేదు. ఈ ధర్మ చక్రాన్ని నడిపేవాడు భగవంతుడని, ధార్మికంగా నడిచేవారిని పోషిస్తాడని, అధార్మికంగా నడిచేవాడరిని శిక్షిస్తాడని ప్రజలు నమ్ముతారు. ఇట్లా భగవంతునిపై ప్రేమ, భయాలు రెండూ కల్గుతాయి. చక్రంలో దాగిన ఈ సత్యాన్ని మరిచిపోకుండా కేవలం మంచి నడవడిక ఉంటే చాలని బోధించకూడదు. చివరకు ఆ బౌద్ధ సంఘాలు దీనిని విస్మరించడం వల్లనే. ఈ దేశంలో ఆ బౌద్ధం క్షీణించింది. తనను పూజించండని బుద్ధుడనలేదు. కాని ఆ బుద్ధునికి విగ్రహాలు పెట్టి మంత్ర తంత్రాలతో తరువాత పూజలు నిర్వహించారు. ఇక ప్రత్యక్షంగా, పరోక్షంగా హిందూ దేవీ దేవతలను ప్రవేశపెట్టారు. దేవుడు లేని మతాన్ని అశోకుడు ప్రవచించాడని నేటి సంఘసంస్కర్తలు భావించారు. కాని అశోకుడే దేవతలకు ప్రియుడని తానే చెప్పాడు కదా! దీనిని కూడా విస్మరించి దీనిని కేవలం మతంతో సంబంధం లేని ధర్మచక్రంగానే నాటివారు భావించారు. ధర్మచక్ర ప్రవర్తనాన్ని పాళీభాషలో ధమ్మచక్క పరివర్తినం అంటారు. ఆ మాటకు అర్థం ఏమిటి? అన్నింటికి ధర్మమే మూలమని, మత సంబంధమైన సూత్రాలను నల్దిక్కులకు వ్యాపింపచేయడమని అర్థం. పోనిండు, ఆ మాటనైనా గుర్తుచేసే చక్రాన్నైనా ఉంచినందుకు సంతోషం.

సత్యమేవ జయతే అనే ఉపనిషత్ సూక్తినుంచినందులకు సంతోషం. ఇది సనాతన ధర్మానికి చెందింది. ఇది హిందూ సూక్తియైనా ఈ నైతిక

సూత్రాన్ని అన్నిమతాలవారు పాటిస్తారు కదా! ధర్మచక్రం, పెక్కు ముఖాలున్న సింహం బొమ్మ, దాని క్రింద పై సూక్తి ఉండడం సంతోషింపదగిందే.

## ఇది ధర్మచక్రమా? కర్మాగారంలోని చక్రమా?

చక్రాన్ని ఎన్నుకోవడంలో ఉద్దేశం ఏమిటి? ఇది కర్మాగారం లోని చక్రం కాదు. నూలు నడిచే చక్రానికి ప్రాధాన్యం ఇచ్చారు గాంధీజీ. కుటీర పరిశ్రమలు దెబ్బతీయకూడదని, చిన్న చిన్న పరికరాలతో ఉత్పత్తిని పెంచాలని, అధిక సంఖ్యాకులకు పనులు దొరకాలని భావించారు. కాంగ్రెసు పతాకంలో నూలు వడికే పని ముట్టు ఉండేది. కాని ఈ చక్రాన్ని కర్మాగారంలోని చక్రంగా భావించి అధికోత్పత్తులకు గుర్తుగా భావించే కాంగ్రెసు నాయకులూ ఉన్నారు.

## గీతలో ధర్మచక్రం

మనం భగవంతుణ్ణి విస్మరించినా అతడు మనలను విస్మరించలేదు. దానిని గీతా ధర్మచక్రంగా భావిద్దాం. కొన్నివేల సంవత్సరాల వెనుక కృష్ణుని చేతిలో సుదర్శన చక్రం ఉంది. ఏవం ప్రవర్తితం చక్రం అని గీతలోని మాట. చక్రం ఇట్లా తిరుగతోందని, అది కార్యకారణాలను సూచిస్తోందని, ఆ ధర్మానికి మూలం పరమాత్మయని అది ఆరు గొలుసులతో ఉందని సందేశమిచ్చాడు.

## ధర్మచక్రం - త్యాగమే సారం

ఈ చక్రం ఎట్లా తిరుగుతోంది? ఈ గొలుసు కట్టులో విశేషమేమిటి? త్యాగం వల్లనే జగత్తు సాగుతోంది. ఆ త్యాగాన్ని యజ్ఞపదంతో సూచించారు. యజ్ఞం అగ్నిపై ఆధారపడింది. తనలో వేసిన వాటిని దేవతలకు అందించువాడు అగ్ని. దేవతలు తృప్తులై మానవుల సుఖజీవనానికి హేతువైన వర్షాన్ని కురిపిస్తున్నారు. పాశ్చాత్యులు యజ్ఞాన్ని త్యాగంగానే భావిస్తారు.

అనగా ఉన్నదానిని పంచి మిగిలిన దానిని సేవించడమే ఉత్తమ లక్ష్యంగా భావించారు. దానినీ దేవతలిచ్చిన ప్రసాదంగా భావించాలి. ఈశావాస్య ఉపనిషత్తులో తాను అనుభవించడం వల్ల కాదని, త్యాగం వల్లనే అమృతత్వం లభిస్తుందని, అర్పించిన దానినుండి అనుభవించాలని చెప్పబడింది కదా! అర్పించేదాంట్లో అన్నానికే ప్రాధాన్యం. అన్నం వలనే జీవనం కదా! కారణ కార్యప్రవాహంలో ముందన్నం చెప్పబడింది.

అన్నం ఎట్లా వస్తుంది? వర్షంవల్ల. వర్షం వల్ల ఆహారమని గీత. వర్షానికి హేతువేమిటి? ఈశ్వరాజ్ఞను పాటించే దేవతా శక్తులు. కనుక యజ్ఞం నుండి వర్షమని గొలుసుకట్టులో మూడవదానిని చెప్పాడు.

యజ్ఞం దేనివల్ల సాగుతోంది? మంత్రాలతో కూడిన కర్మవల్ల. కనుక కర్మనుండి యజ్ఞం వల్ల అనేది నాల్గవది.

ఈ కర్మలకు బలం దేనినుండి? మంత్రాల వల్ల. అనగా వేదం వల్ల. కనుక వేదం నుండి కర్మలవల్ల అనేది ఐదవది.

వేదాలకు మూలమేది! అవి అనాదులు. అవి పరమాత్మ యొక్క నిశ్వాసం మాదిరిగా విడదీయలేనివి. పరమాత్మనుండి వేదాల వల్ల అనేది ఆరవది. ఇట్లా కార్యకారణ సంబంధాన్ని వివరించింది గీత.

ఇట్లా ఒక్కొక్క దానిని త్యాగం చేయడం వల్ల, స్వార్థరహిత భావన వల్ల ఈ ధర్మచక్రం సాగుతోందని చెప్పాడు.

యజ్ఞాలు వేదం యొక్కబాహ్య స్వరూపం. దీనిని మూడవ గొలుసుగా చెప్పాడు. కనుకే ధార్మిక క్రియలను చేయాలని చెప్పాడు.

తన కొరకే తాను తింటే పాపమనీ చెప్పింది. కనుక ధర్మానికి విరుద్ధం కాని క్రియలను చేస్తూ సుఖశాంతులతో ప్రజలందరూ వర్ధిల్లాలని మనకు లభించిన స్వాతంత్ర్య లక్ష్యం నెరవేరేటట్లు పరమేశ్వరుడు అనుగ్రహం చూపించుగాక.

## భగవానునకు కృతజ్ఞత

స్వాతంత్ర్యం ఎంతో కష్టంమీద, ఈశ్వర కృపచే సాధించగలిగాం. దేశానికి స్వాతంత్ర్యం వచ్చినా ఎవరికి వారు స్వతంత్రులయ్యారా? మనలను మనం అర్థం చేసుకొన్నామా? మన ఇంద్రియాలు, మన మనస్సులు అదుపులో ఉన్నాయా? బాధలనుండి దూరమయ్యామా? శాంతి సౌఖ్యాలతో ఉంటున్నామా?

మనస్సును నియమించినపుడే అనంత సుఖం లభిస్తుంది. బాహ్యమైన వాటికి పరుగులెత్తం. అదే నిజమైన స్వతంత్రత.

ప్రతిరోజు కొంతసేపైనా అందరూ కొంత సమయాన్ని కేటాయించి మనస్సును స్తిమిత పరచడానికి ప్రయత్నించండి. ధ్యానం చేయండి. దానివల్ల మనస్సు నిర్మలమౌతుంది. అపుడు కామక్రోధాలను అదుపులో పెట్టవచ్చు. క్రమక్రమంగా ఆత్మజ్ఞానం పట్టుబడుతుంది. అట్టి జ్ఞానం కలిగియుండమే నిజమైన స్వతంత్రత.

దాన దయాది ఆత్మగుణాలున్నపుడు ఇతరుల కష్టసుఖాలు తనవని భావించగలిగినపుడు దేశం, సుఖశాంతులతో విరాజిల్లుతుంది. ఇతర దేశాలకు ఆదర్శప్రాయమౌతుంది.

# యువకులకు హితోపదేశం

## ఉపదేశం

*(విద్యార్థులనుద్దేశించి స్వామివారిట్లా ప్రసంగించారు)*

మీ ఇంట్లో మీ తల్లిదండ్రులు మీ ఇంటిని నడుపుతున్నారు. అట్లాగే జగత్తనే కుటుంబానికి తల్లి దండ్రులు పార్వతీ పరమేశ్వరులు. మీ కుటుంబం, జగత్కుటుంబంలో మధ్యలో పాఠశాలయనే కుటుంబం ఉంది. తోటి విద్యార్థులే సోదరులు. ఈ కుటుంబానికి పెద్ద అధ్యాపకుడు. తల్లిదండ్రులపట్ల చూపే గౌరవాన్ని ఇతని పట్ల చూపాలి.

పాఠశాలలో చదివేటపుడు చదవడమే మీ ధర్మము. దానిపై ఏకాగ్రత ఉండాలి. మిగతా విషయాలలో జోక్యం చేసుకోరాదు. ఎన్నో మంచి పనులున్నా చదువు పూర్తియైన తరువాత వాటికై పూనుకోవాలి. నాకు బలం, బుద్ధిశక్తి యుందని అన్నిటిని చక్కపెట్టగలనని దుమకకూడదు. జగత్కల్యాణం కోసం ప్రయత్నిస్తానని పెద్ద పెద్ద మాటలనకండి.

ఏవో కొన్ని వస్తువులను భుజాలపై మోసుకొని ఒకోచోట నుండి చేరవేయవలసిన వృత్తిలో ఒకడున్నాడనుకోండి. కాలికి ఏదో గ్రుచ్చుకొంటే మోయగలడా? రోగం కుదరిన తరువాతనే మోయగలడు.

దేశానికి మంచి చేయడం ఒక భారాన్ని మోయడమే. దానికి తగ్గ శారీరక మానసిక బలం ఉన్నపుడే సాధ్యం. చిన్నవయస్సులో అంతంత బరువులు మోయగలరా?

మనకు కామక్రోధాలనే రోగాలుండనే ఉన్నాయి. ఇవన్నీ గత జన్మల కర్మల పాపాలు. ప్రతి కర్మ ఫలం పేరుకుని బరువుగానే వుంటుంది. శరీరమనే భారమే గత జన్మ కర్మవల్ల వచ్చినది. వీటిని తొలగించడం విద్యవల్లనే. అందుకే చిన్నపుడు విద్యాభ్యాసం చేయాలి. అజ్ఞానమనే రోగానికి మందు విద్యయే. దానితో మనలో ఉన్న చెడు లక్షణాలు తొలగిపోతాయి. చదువొక్కటే సరిపోదు. దానితో వినయ విధేయతులుండాలి. వినయముంటే దుర్గుణాలు తమంతట తామే తొలగిపోతాయి. జ్ఞానం వృద్ధి పొందుతుంది.

వినయం లేకపోతే దురహంకారం ప్రబలుతుంది. భగవానుడు అట్టివారిపై కనికరించడు. అతని కృప లేకపోతే ఏ వ్యక్తీ రాణించడు.

వైద్యుడు మందులొక్కటే ఈయడు. పథ్యాన్ని కూడా చెబుతాడు. అట్లాగే వినయమనే పథ్యాన్ని పాటించాలి. విద్య మందువంటిదే.

శారీరక శుభ్రతకు ప్రాధాన్యం ఈయాలి. రోజుకు రెండుసార్లు స్నానం ఉత్తమం. చన్నీటి స్నానానికి శరీరం అలవాటు పడితే కొన్ని రోగాలు దరిచేరవు. తరువాత శుభ్రమైన వస్త్రాలను ధరించండి. మీ బట్టలను మీరే ఉతికితే దీనివల్ల తగిన వ్యాయామమూ కల్గుతుంది. ఖర్చు తగ్గుతుంది.

## శుభ్రమైన మనస్సు

శరీరం, బట్టలకంటె మనస్సు శుభ్రంగా ఉండాలి. దానిపై దుమ్ము చేరింది. ఏమిటీ దుమ్ము? మనం చేసిన తప్పులే. ఎక్కడైనా, ఎవరికైనా పొరపాట్లు వస్తాయి. ఇవి పెద్దలకే తప్పవు. తెలిసో తెలియకో చేస్తూ ఉంటాం అట్టి సమయాలలో పరమేశ్వరుడుని ప్రార్థించండి.

## అబద్ధాలు - భయం

నీవు తప్పు చేస్తే ఎట్లా భావిస్తావు? ఏదో మురికి అంటుకొన్నట్లు భావిస్తావు కదా! ఈ మురికి ఇతరులకు కనబడకుండా ప్రయత్నం చేస్తావు. ఒంటిమీద ఉన్న మురికిని తొలగించకపోతే చర్మరోగాలు వస్తాయి. మనస్సుకు అంటిన మాలిన్యాన్ని కడగకుండా అబద్ధాలు చెప్పి కప్పిపుచ్చితే అది మానసిక రోగానికి దారి తీస్తుంది. ఇది ఎక్కువ ప్రమాదకరం.

తప్పులను కప్పి పుచ్చుతున్నాం. ఎందుకని? ఇతరులు మనలను మంచివారనుకోవాలని. ఏదో భయపడుతున్నాం. అబద్ధం చెప్పడం అనే రోగమే ఇంత పని చేస్తోంది.

పెద్దలను గౌకరవించవలసిందే. కాని భయంతో కాదు. భయమే మనస్సును పాడు చేస్తుంది. తప్పు చేసినట్లు చెప్పగలిగితే వారే క్షమిస్తారు. ఒకవేళ వారు దండించినా అదీ మనకు మేలు చేస్తుంది. ధైర్యంతో తప్పును ఒప్పుకోవాలి. సత్యం చెప్పడం, సబ్బుతో తోమడం వంటిది.

## ఈర్ష్య

ఆటపాటలలో, చదువులో కొందరు విద్యార్థులు రాణిస్తూ ఉంటే మిగిలినవారికి ఈర్ష్య కలుగుతుంది. అది అనేకమైన కొట్లాటలకు దారితీస్తుంది.

ఒక్క చదువు విషయంలోనే స్పర్ధ ఉండాలి. అది కూడా ఈర్ష్యకు దారి తీయకూడదు. అట్లాగే ఆటలలో.

ఆటలు శారీరక దార్ఢ్యానికి దారి తీసినా చదువునకు భంగం రాని రీతిలోనే సాగాలి. మనం ఏనాడూ ఈర్ష్యకు తావీయకుండా స్నేహభావంతోనే ఉండాలి.

రకరకాల కారణాలవల్ల ఇతరులు ఉన్నతిలో ఉన్నా వారితో స్నేహమే

కొనసాగించాలి. ఎవరి పట్లా చులకనభావమూ పనికిరాదు. తప్పులు కనబడినా ప్రేమతో చూపించగలగాలి. మనిషి లేనపుడు అతని లోపాలను ఇతరులకు వెల్లడించడం పిరికితనాన్ని సూచిస్తుంది. పైవాడు అన్నీ గమనిస్తున్నాడనే భావన కల్గియుండాలి.

సబ్బువంటి వాటితో శరీరాన్ని ఎట్లా తోముతున్నామో, సత్యం, ధైర్యం, ఇచ్చి పుచ్చుకోవడం వంటి వాటివల్ల అబద్ధాలు, ఈర్ష్య మొదలైనవాటిని కడుగుతున్నామన్న మాట. ఇక భగవత్ ప్రార్థన, గంగాస్నానం వంటిది.

## భగవానుని కరుణ

భూమి కంటె సూర్యుడు పెద్దగా ఉన్నాడు. అంతకంటె నక్షత్రాల పెద్దవి. వీటన్నిటిని సృజించిన పరమాత్ముడు ఇంకా పెద్దవాడు కదా! అట్టివాని భజించాలి.

అతడొక పద్ధతి లేకుండా వీటన్నిటిని సృష్టించాడా? గ్రహనక్షత్ర గమనానికి అతడే కారకుడు. కాలంలో ఋతువు లేర్పడడానికీ అతడే కారకుడు. అతడు అన్నింటిలో ఒక క్రమపద్ధతిని ప్రవేశపెట్టాడు. అట్టి క్రమశిక్షణ మనజీవితంలోనూ ఉండాలి.

అతణ్ణి ప్రేమస్వరూపునిగా, ధర్మస్వరూపునిగా భావిస్తే అవి మనలో ప్రేమను పెంచుతూ అతని పట్ల ప్రేమ, కృతజ్ఞత చూపిస్తే మన మనస్సులోని మురికి పోతుంది.

నాకు మంచి మార్గాన్ని చూపు అని ప్రార్థించాలి. లేత మనస్సులు అట్లా ప్రార్థిస్తే తప్పక కరుణ చూపిస్తాడు. తల్లిదండ్రులు మనపట్ల చూపే ప్రేమకూ అతడు కారకుడే. తల్లిదండ్రుల రూపేణ ప్రేమను ప్రకటిస్తున్నాడు. కనుక తల్లిదండ్రులను భగవత్ స్వరూపులుగా భావించాలి.

అవ్వై అనే కవయిత్రి మనకు తెలిసిన మొదటి దేవుడు తల్లి దండ్రులే

అంది. తరువాత ఆలయంలోని భగవానుని పూజించుమంది. కనుక భగవానుని తల్లిగా, తండ్రిగా భావించాలి.

భగవానునకు రూపం లేదు కదా! ఎట్లా పూజించడం? తల్లిదండ్రుల రూపంలోనే. అందువల్ల ఆలయంలోని మూర్తిని తల్లిదండ్రులుగా పూజించాలన్నమాట.

## మనో మాలిన్యం పోవాలంటే

మనలో ప్రేమ, శాంతి ఉంటే మన బుద్ధి నిర్మలంగా ఉంటుంది. అవి బాగుంటే చదివిన పాఠాలు ఒంటబడతాయి. ఎన్ని మార్కులు వచ్చినా మంచి పేరు సంపాదించకపోతే జీవితం వ్యర్థం కదా!

ప్రస్తుతం మనం అందరం చెట్టు నీడలో కూర్చుని ఉన్నాం కదా! ఒక విత్తనం చెట్టై మనకందరకూ నీడనిస్తోంది. అట్లాగే మీరూ పెద్ద వృక్షమై ఎందరికో ఉపయోగపడేట్లుగా ఉండాలి.

ఇతరులకు సాయపడినప్పుడే మన జీవితాలు సార్థకమౌతాయి. ఎంతో సంపాదించి మన కోసమే ఖర్చు పెడితే భగవానుడు సంతోషించడు. నీవు తినబోయేది ఇతరులకిచ్చినపుడు అవతలివానిలో ఎంతో తృప్తిని చూడవచ్చు.

పెద్ద గాలి వీస్తే ఒక స్తంభాన్ని పట్టుకొంటాం కదా! అట్లాగే చెడ్డభావాలు మనలో వచ్చినపుడు భగవంతుని వైపు మనస్సును మళ్ళించాలి.

ఒక పిల్లవాడు నిరంతరం హరహర అంటూ ఉండేవాడు. అతని పేరు జ్ఞానసంబంధర్. ఎల్లప్పుడూ తీర్థాటన చేస్తూ ఇదే నామాన్ని ఉచ్చరిస్తూ ఉండడం వల్ల ఇతణ్ణి అందరూ హరహర అని పిలిచేవారు. అందువల్ల వీరందరిలోనూ చెడ్డభావాలు దూరమయ్యాయి. మీరందరూ హరహరమహా దేవ అని కీర్తించండి.

ఆనాటి గురుకుల వ్యవస్థ లేకపోయినా భక్తి వినయ సంపద ఉన్నా నేటి

కలుషిత వాతావరణంలో భావావేశాలను అదుపులో ఉంచవచ్చు. సినిమాలు, రాజకీయాలు, వార్తాపత్రికలు, క్రీడలు మొదలైనవి ఎన్నో పిల్లలను లాగివేస్తున్నాయి.

కనుక కొంతసేపు ధ్యానం, ప్రతిరోజూ దేవాలయ దర్శనం, మంచి పుస్తకాలను చదవడం మొదలైన వాటితో ప్రధానమైన చదువు సాగాలి. పూర్తిగా భగవత్ ధ్యానానికే కేటాయిస్తే చదువు దెబ్బతింటుంది. అసలు చింతించక పోయినా మనస్సు చలించిపోతుంది కదా!

నీతి కథలు, మహాత్ముల చరిత్రలు, సంస్కృతికి సంబంధించిన విషయాలను తెలుసుకోవడం కోసం వివిధ సంఘాలను ఏర్పాటు చేసుకోవాలి. పెద్దలు వీటిని నడపాలి.

పరిపక్వత లేని మీ మనస్సులను రాజకీయాలు చెడగొడుతున్నాయి. వీటికి దూరంగా ఉండండి. చదువు పూర్తియైన తరువాత ధార్మికంగా రాజకీయాలుంటే అందు ప్రవేశించవచ్చు. ముందే కాదు.

ముందు జ్ఞాన సంపద, ధార్మిక సంపద, దైవానుగ్రహం. వీటితో మనస్సు నిండినపుడు జాతి సక్రమంగా నడుస్తుంది. పైవాటిని సంపాదించిన తరువాతనే జాతీయ సమస్యలను పరిష్కరించగలం.

విద్యార్థులను తమ ఉద్యమాలలోనికి రండని రాజకీయనాయకులు విసిరే వలలో మాత్రం చిక్కుకోకూడదు.

విద్యావిషయకమైనవి, ప్రపంచ జ్ఞానాన్ని కలిగించే చిన్న చిన్న సినీమాలను (Documentaries) పిల్లలకు చూపించవచ్చుగాని, కామ ప్రవృత్తిని రెచ్చగొట్టేవాటిని చూపించ కూడదు.

సంగీతం, నృత్యం నాటకం వంటి వాటిని కొంతసేపు చూపించవచ్చు.

నేటి యువకులు మత్తుమందులకు అలవాటు పడుతున్నారు. ఇది అన్నివిధాల హానిని కల్గిస్తాయి. వీటికి దూరంగా ఉండండి.

ఇక వార్తాపత్రికలు, మాస, వార పత్రికలు ఇవీ ప్రజలను రెచ్చగొడు తున్నాయి. పత్రికలవల్ల ఎంతో సంస్కృతీ ప్రచారం జరగవచ్చు. పై పత్రికలలో మంచి, చెడు రెండూ ఉన్నాయి. వివేకంతో వాటిని వింగడించండి.

క్రీడలుండవలసిందే. శరీర వ్యాయామానికి మానసిక ఉల్లాసానికి ఇవి వుండవలసిందే. వీటివల్ల కొంత క్రమశిక్షణ, నల్గురితో కలిసియుండడం మొదలైన లాభాలున్నాయి. ఇవి కూడా కాలానికి మించి యుండకూడదు.

ఎందుకింత చెబుతున్నానంటే క్రీడలను దూరదర్శన్‌లో చూడడం, గచ్ఛత్ వ్యాఖ్యానాలను రేడియో ద్వారా వినడం, క్రీడల వార్తల పట్ల అమితాసక్తి ఇట్లా గంటల కొద్దీ కాలాన్ని వృథా చేస్తున్నారు.

ఇతరుల బోధలవల్ల మార్పు రావడం కంటె తమంత తామే నిగ్రహవంతులై యుండడం గొప్పది. మీరు తలుచుకొంటే ఎన్నో ఘనకార్యాలు చేయగలరు. పాతతరం వారికంటె క్రొత్తతరం వారిలో ఉత్సాహం, ధైర్యం, సాహసం హెచ్చు. వీటిని సరియైన మార్గంలో పెట్టించాలని ఆంజనేయుణ్ణి ప్రార్థిస్తున్నా.

విద్యార్థులను మహోన్నత వ్యక్తులుగా తీర్చిదిద్దే సంఘాలుండాలి. వినయ, విధేయతలు పెంపొందాలి.

వినయంతో ఉన్నతులం కావచ్చు. కాలి క్రిందనున్న దుమ్ము సుడిగాలి వచ్చినపుడు ఉవ్వెత్తుగా లేస్తోంది. నెత్తినెక్కుతోంది. అట్లాగే ఒకనాడు ఉన్నతదశ ప్రాప్తిస్తుంది.

మంచి చెడుల కలబోతతో అనాదినుండి ఈ ప్రపంచం నిండియుంది. అయితే చెడు ఉండగా భగవానుడు ఎందులకు ఉపేక్షించాడని సందేహం. ఈ ప్రాపంచిక జీవితం నిత్య సత్యం కాదని, మంచి చెడులకు అతీతంగా ఉండాలని చెప్పడానికే. పరమ సత్యాన్ని చేరడానికే.

ఇది మిశ్రమలోకం. మంచి, చెడులతో ఉండేది. అసురలోకం అంతా

చెడే. భూలోకం మాత్రం మిశ్రంగా సృష్టింపబడింది. అన్ని యుగాలలోనూ ఇంతే. పాళ్ళ భేదం మాత్రమే. కలిలో చెడు ఎక్కువగా ఉంటుంది. అంతమాత్రంచే మంచి అంతా తుడుచుపెట్టుకొనిపోదు. అట్లా అయితే మిశ్రమపదానికి అర్థమే ఉండదు. కేవలం అసుర లోకం అయ్యేది. కలిదోష నివారణలను శాస్త్రాలు చెప్పాయి. ఉన్న మంచి తగ్గకుండా ఉంటే చాలు చెడును పూర్తిగా చెరిపివేయలేం.

ముఖ్యంగా యువకుల నుద్దేశించి మాట్లాడాను. సంఘం అంతా సంస్కరింపబడుతుందనే ఆశతోనూ కాదు. పాత్రకు పట్టిన మురికి తొలగించడం మన కర్తవ్యం. ఇది పెద్దలపై యువకులపై ఉంది.

# సంఘం

## స్వరాజ్యం

ఈ రోజుల్లో స్వదేశి, స్వరాజ్యం అంటూ ఉంటారు. అయినా వేషధారణలో, దృక్పథంలో, ఆచరణలో తెల్లదొరలనే అనుకరిస్తున్నాం. మనకు భిన్నమైనవి ఎప్పుడు ఆచరిస్తున్నామో మనమూ మనదేశంలోనే విదేశీయులముగా ఉన్నాం. స్వరాజ్యం కావాలని గట్టిగా భావిస్తే మన దేశపు ఆచారాలను సంప్రదాయాలను పాటించవలసిందే. ప్రాచీన పద్ధతులలోనున్న మంచిని స్వీకరించవలసిందే. మన ధర్మాలు, ఆధ్యాత్మిక సంపత్తిని గౌరవించాలి. విదేశీయులు తమ పద్ధతులను బలవంతంగా రుద్దకపోయినా వారి ఆచార వ్యవహారాలకు బానిసలమై పోతున్నాం. విదేశీ కబంధ హస్తాలనుండి మన రాజ్యాన్ని తిరిగి మనం పొందవచ్చు. అంతటితో పని ముగిసిందా! భావదాస్యం పోవాలి.

మన శాసనసభలను స్వేచ్ఛా స్వాతంత్రాలతో నిర్వహిస్తున్నామనే మాట నిజమైతే పూర్వకాలంలో ధర్మరాజ్యం ఎట్లా ఉందని యోచించి అందుగల మంచిని స్వీకరించాలి. పాతవాటినే పట్టుకొని వ్రేళ్ళాడడం ఎందుకని మీరు ప్రశ్నించవచ్చు. ప్రపంచంలో అనేక సంస్కృతులు, నాగరికతలు కాలగర్భంలో కలిసిపోయినా అనాదిగా ఈ భారతీయ సంస్కృతి చెక్కు చెదరకుండా ఉందని చూడండి. ఇట్లా ఉండడానికి ఏ పునాదులు, ఏ మూలాలు దాగియున్నాయో గమనించండి.

శాసనాలను చేసేటపుడు తెల్లదొరలనే అనుకరించాం. ప్రతిదీ, గ్రుడ్డిగా అనుకరిస్తే మనకు స్వాతంత్ర్యం వచ్చి ఏం సాధించినట్లు? మామూలు విషయాలలో ఆధ్యాత్మిక సూత్రాలు మన జీవన విధానంలో దాగియున్నాయి. మూలతత్త్వాలను గమనించగలిగితే పూర్వ వైభవాన్ని పొందగలం. క్రమశిక్షణ, మంచి నడవడి, ధార్మికమైన బుద్ధికలవారిని పరిపాలకులుగా మనం నియమించగలగాలి.

ఇతర రాజ్యాలు మనలను అనుకరించేటట్లుగా మనం తీర్చి దిద్దబడాలి. అనేక ప్రాచీన గ్రంథాలు మనకు లభ్యమౌతున్నాయి. అందుకే కొన్ని విషయాలను మీకందించగలగుతున్నా. పూర్వ గ్రంథాలను చదివి నేటి కాలానికి అనుగుణమైన వాటిని స్వీకరించండి. ధార్మికులను శాసనసభలకు పంపేటట్లు చేయండి .అపుడు పరమేశ్వరానుగ్రహం లభిస్తుంది.

## ధర్మం - ప్రేమ - ప్రభుత్వం

**రాజాధర్మస్య కారణం** అనే సూక్తి ఉంది. అనగా ధర్మానికి మూలం రాజు.

ధర్మం అంటే ఏమిటి? మనం మానవులుగా పుట్టాం కనుక కనీస అవసరాలైన కూడు, గుడ్డ, నీడ కావాలి కదా! వీటికై మనం ప్రయత్నం చేస్తాం. ఇట్లా తనను తాను మాత్రమే పోషించుకుని తృప్తి పడడమే కాకుండా ఇతరుల పట్ల కూడా కొన్ని బాధ్యతలున్నాయి. తన భార్య, బిడ్డలతో బాటు చుట్టుపట్ల ఉన్న సంఘంతో, దేశంతో సంబంధం కలిగి యున్నాడు. అయితే తనకిష్టం వచ్చినట్లు ప్రవర్తించకుండా ఇతరులకు హాని చేయకుండా, అమితమైన కామక్రోధాదులను ప్రదర్శించకుండా మెలగగలిగినపుడు శాంతి లభిస్తుంది. ఏ వృత్తి చూసినా తానుద్ధరింపబడడమే కాకుండా ఇతరుల ఉన్నతికి యథాశక్తి పాటుపడాలి. భౌతికమైన ఉన్నతితో బాటు ఆధ్యాత్మిక ఉన్నతికి బాట వేయాలి.

ఒక పనికి, మరొక పనికి సంఘర్షణ లేకుండా, సమస్త మానవ కల్యాణానికి దోహద పడేరీతిలో జీవనశైలి యుండాలి. ఇందు ప్రభుత్వ బాధ్యత కూడా తప్పనిసరి. ప్రజలలో క్రమశిక్షణను, ఆధ్యాత్మికోన్నతిని తీసికొని రావలసిన బాధ్యత ఉంది కనుక "రాజా ధర్మస్య కారణం" అన్నారు.

ప్రభుత్వానికి, విడివిడి వ్యక్తులకు అనేక క్రియాకలాపాలున్నా అన్నిటికీ మూలం ప్రేమయేమని గుర్తించాలి. ఒక పనిచేస్తే ఒక ఫలం వస్తుంది. కాని ఈ ఫలం తనకే దక్కకుండా మొత్తం సంఘానికి దక్కే రీతిలో ప్రజల ప్రభుత్వం యొక్క తీరుతెన్నులుండాలి. అఖండ ప్రేమయే పునాది.

కొన్ని తప్పని పరిస్థితులలో యుద్ధాలు చేయవలసి వస్తుంది. యుద్ధం చేస్తున్నా, శిక్షించవలసి వచ్చినా ద్వేషభావంతో కాకుండా విధ్యుక్తధర్మంగా భావిస్తూ చివరికది ప్రేమ మూలకంగా ఉండాలి. *(చీనావారు, మనదేశంపై దండయాత్ర చేసినపుడు స్వామి వారు ఇట్లా మాట్లాడడాన్ని చెవులార విన్నాను)*

ప్రేమ వేరు, బుద్ధుడు, గాంధీ చెప్పిన అహింస వేరు. ప్రేమ ఉన్నపుడు దేశ సౌభాగ్యం కోసం విశేష ప్రణాళికలుంటాయి. మొత్తం శ్రేయస్సు కోసం దాని నడ్డుకొనేవారిని శిక్షించవలసి వస్తుంది. అటువంటప్పుడు తీవ్రదండన విధించవలసి వస్తుంది. అవతలివాడు శిక్షింపబడినా ద్వేషభావంతో మనం పూనుకోకూడదు. అరెరె, రావణాసురుడు చెడిపోతున్నాడని శుచిస్మితయై రావణునకు సీతమ్మ హితోపదేశం చేయలేదా? ఒకనివల్ల సంఘం అంతా నాశనం కాకూడదని మాత్రమే శిక్షిస్తున్నాం అనే భావన అడుగడుగునా ఉండాలి. అతడు తిరిగి చెడ్డపనులు చేయకుండా ఉండడం కోసమే శిక్ష. మహోత్తమమైన దశలో కామక్రోధాలను జయించగలిగితే జగత్కల్యాణము జరుగుతుంది. ఇది మహాత్ములకే చెల్లింది. కనుక ప్రేమ పునాదిగా సాగితే అనేక సమస్యలు తమంతట తామే కనుమరుగౌతాయి. ఏదో ధర్మబోధ చేస్తున్నానని తేలికగా తీసుకోవద్దు. ఇది ఋషులు, మునుల సందేశం. అనాదిగా ఈ దేశంలో ఉంది.

## నేరాన్ని తగ్గించుట

*(పది సంవత్సరాల వెనుక లోక్‌సభ సభ్యులను అందరినీ హతమార్చడానికి తెగబడిన పాకిస్తాన్ ముష్కర్లకు, ముంబాయిలో ఎందరినో బలిగొన్నవారికీ, ఒకనాటి దేశనాయకుణ్ణి చంపినవారికీ ఉరిశిక్ష ఇంతవరకు పడకపోవడం మనకు తెలిసిందే. ఇట్టి పరిస్థితిలో మన స్వామివారి మాటలను పాలకులు వింటారా? – అనువాదకుడు)*

ప్రభుత్వం ఎందుకు? బలవంతులు, బలహీనులను దోచుకోకుండా ఉండడం కోసమే కదా!

ఏం చేయాలి? తీవ్రంగా శిక్షించాలి. శిక్షిస్తుందనే భయం వల్ల చాలామంది తప్పు చేయరు.

క్రూరంగా అవతలి వ్యక్తి ప్రవర్తించినపుడు క్రూరంగానే శిక్షంచాలి. ఇంట్లో దొంగతనం జరిగితే యజమానునకే నష్టం. తీవ్రమైన నేరం చేస్తే దీర్ఘకాలం కారాగారశిక్ష అనుభవించక తప్పదు. తీవ్ర దండన ఉన్నపుడే తీవ్ర నేరాన్ని చేయడానికి జంకుతాడు. మానవ మనస్తత్వాన్ని బట్టి కూడా దీనిని అంగీకరించాలి.

ఇంతకంటె మంచిపద్ధతిని ప్రభుత్వం అనుసరించాలి. ఒకడు నేరం చేసి శిక్షననుభవించడం, తీవ్రదండన ఉంటుందనే భయం, అనేవి అప్రధానమైనవి. అసలు నేర ప్రవృత్తే ప్రజలలో అంకురించకుండా చేయడం మహోత్తమ పద్ధతి.

తీవ్ర నేరాలకు, తీవ్ర దండన పద్ధతిని కౌటిల్యుని అర్థశాస్త్రం నుండి గ్రహించవచ్చు. అట్టి అర్థశాస్త్రమూ ధర్మ శాస్త్రం ముందు మోకరిల్లిందనే మాట మరిచిపోకూడదు.

ధార్మిక వాతావరణాన్ని ఎప్పుడైతే కల్గించామో నేరాల సంఖ్య, నేర ప్రవృత్తి

తగ్గిపోతుంది. ధార్మికులు వృద్ధియైన కొలదీ వారిని ఆదర్శంగా తీసుకొని ప్రజలూ అడుగులు వేస్తారు. యుద్ధాలు, నేరాలూ వాటంతటవే పోతాయి.

దీనిని ప్రభుత్వ అధికారులు ముందుగా ఆచరించి చూపించాలి. వారు తమకోసం తాము పనిచేయడం లేదని, సంఘ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొనే చేస్తున్నామనే భావన ప్రజలలో కలిగించేటట్లు ప్రవర్తించాలి.

నేరరహితమైన వ్యవస్థను తీసుకొని రావడం, కేవలం ప్రభుత్వ బాధ్యతే కాదు. ధార్మికమైన వ్యక్తులు అట్టి వ్యవస్థకు ప్రత్యక్షంగా పరోక్షంగా సహకరించాలి.

రక్షకభట వ్యవస్థలో, న్యాయవ్యవస్థలో నిజాయితీ పరులను ప్రభుత్వం నియమించాలి. (ఉన్నతులైన న్యాయాధీశులే అవినీతి పరులౌతున్నారని పత్రికలలో చదువుతున్నాం కదా! సిగ్గుచేటు)

ధార్మికులై ధర్మ ప్రచారం చేసేవారికి ప్రభుత్వం అన్నివిధాల సహకరించాలి. ధార్మికులనే మాటను గుర్తించండి. ఆచరణవల్లనే ఆదర్శవంతులౌతున్నారు. ఇతరులకు బోధించేశక్తి అప్పుడు వస్తుంది.

న్యాయస్థానాలు వృద్ధి పొందడం అభ్యుదయమా? నేరప్రవృత్తి ఎక్కువైందని తేటతెల్లమౌతోంది కదా! (అట్లాగే కారాగారాలు, ఆస్పత్రులు కూడా). పైవాటిని కాక పూర్వపురాజులు ఆలయాలను దూరదృష్టితో నిర్మించారు. ప్రతి కళ, విద్య, భగవదంకితమై పూర్వం ఉండేది. ప్రాతస్సాయంసమయంలో దైవసన్నిధికి వచ్చి ప్రజలు శాంతిలో ఉండేవారు. ఈనాటి అశాంతి నిన్న మొన్నటివరకూ లేదు. సుఖశాంతులతో వర్ధిల్లునట్లు చరిత్ర చెబుతోంది కదా!

నేరాలను తగ్గించడం కోసం చట్టాలు నేర్పరచడం కంటె నేరప్రవృత్తికి స్వస్తి చెప్పాలని ప్రజలలో భానవ కల్గించినపుడు ఇంకా మేలు కదా! నేరాన్ని ఎట్లా ఎదుర్కొనాలే పథకం చేయడం కంటె ఎట్లా శాంతిని నెలకొల్పాలని దృష్టి పెట్టాలి.

## అసలైన విద్య

మనలో ఎంత శాంతి ఉంటే అంత సుఖాన్ని అనుభవించగలమని అందరకూ తెలుసు. ఏ పని చేసినా దాని లక్ష్యమేమిటి? మానసిక శాంతియే. శాంతి కొరవడితే బాధ బరువెక్కువైతుంది. తమ బాధను పోగొట్టుకోవాలని ఇతరులు అనుకోకుండా కష్టపెట్టేవారుంటారు. ఇది అనేక రకాలలో ఉంటుంది. ఏమిటీ అల్లకల్లోలం? కొన్ని సందర్భాలలో ప్రభుత్వం కలగజేసుకొని చట్టాలద్వారా శాంతిని నెలకొల్పుతుంది. అసలైన శాంతి వారివల్ల సాధ్యమా? మనకు మనమే పరిష్కరించుకోవాలి. ఎట్లా? బాహ్య విషయాల వెంట పరుగెత్తే ఇంద్రియాలను కొంతవరకైనా నియమించగలిగితే శాంతి లభిస్తుంది. బాహ్యమై, అంతరమైన శాంతి కావాలంటే ఉత్తమ విద్య వల్లనే సాధ్యం.

అసలు పూర్వ విద్యాభ్యాసం అంతా మానసిక శాంతి కోసమే. అంత మాత్రంచే నేటి భౌతిక శాస్త్రాలను చదవకూడదని, పరిశోధనలు చేయకూడదని అనడం లేదు. నేటి విద్యావిధానాల వల్ల వచ్చే ఫలాలు అందరికీ చెందితే శాంతి లభిస్తుందనే మాట సత్యమే. ఈ పరిశోధనలు విచ్చలవిడితనానికి, కేవల భోగానుభవానికి దారితీసినా, చెడు నిర్ణయాలు తీసికొన్నా అశాంతియే మిగులుతుంది. భౌతిక శాస్త్రాభివృద్ధి లక్ష్యమే దెబ్బతింటుంది.

మన సిద్ధాంతం ప్రకారం చదువు, ఆత్మోన్నతికే. ఆత్మానుభవానికే! మిగిలిన విద్య ప్రాపంచిక సుఖానుభవానికే. కాని బ్రహ్మ జ్ఞానానికై భౌతిక మార్గాలను ఉపయోగించాలని పూర్వుల హితోపదేశం. తమ తమ విధ్యుక్త ధర్మాలను ఆచరించి భక్తి, తపశ్చర్యల వల్లనే శాంతి కల్గుతుందని పూర్వులన్నారు.

ఆధ్యాత్మిక విద్య పరావిద్యగా; భౌతిక సుఖాలకై ఉద్దేశింపబడినది అపరావిద్యయని వింగడించారు. పరమ సత్యాన్ని చేర్చేది పరా విద్య. అది

అందరికీ సాధ్యం కాదు. అది లోనున్న అజ్ఞానాన్ని తొలగించేది. ధర్మతత్వం మన ఇంద్రియాలకు అందేది కాదు. అది వేదశాస్త్రాలకే తెలుస్తుంది. జ్ఞానం కలగడానికి ప్రత్యక్ష ప్రమాణం, అనుమాన ప్రమాణం యుక్తి అనేవి ఉన్నాయి. వాటికంటె వేదం వల్లనే అలౌకిక విషయాలు తెలుస్తాయని అన్నారు. అట్లాగే శంకరులు నిర్ణయించారు. అయితే నేడు బహుళవ్యాప్తిలో ఉన్న ఖగోళశాస్త్రం, రాజనీతి, ఆర్థిక శాస్త్రం, చరిత్ర, భౌతికమైన సైన్సు, పరిశోధనలూ కూడా కావలసివే.

పాశ్చాత్య విద్యను, ఆధ్యాత్మికవిద్యను కలపడంలో జాగరూకత వహించాలి. మనశ్శుద్ధి మంచి నడవడి మొదలైనవే విద్యా ఫలములగా ముందుగా గుర్తించాలి. కేవల ఇంద్రియ తృప్తికోసం, కేవలం సుఖ సాధనలే లక్ష్యంగా సాగే విద్యకు అధిక ప్రాధాన్యం ఈయకూడదు. వారందించిన ఆధునిక విద్యతో బాటు వారి సంప్రదాయాలను, నాగరికతను వేషధారణను, ఆహార పద్ధతులను గ్రుడ్డిగా అనుకరిస్తే మన అనాది ధార్మిక సాంస్కృతిక వ్యవస్థ దెబ్బతిని ఈ భారత భూమిని పుణ్యభూమిగా చెప్పుకోలేకపోతాం.

భక్తి, దానం, సదాచారం మొదలైవానికి ప్రాధాన్యం ఈయకుండా కేవలం పాశ్చాత్య విద్యనభ్యసిస్తున్నాం. అందువల్ల అనేక కష్టనష్టాలకు గురి కావలసి వస్తోంది. పరలోక సౌఖ్యం మాట దేవుడెరుగు. కనుక భక్తి జ్ఞానాలు సంస్కృతీ సంప్రదాయల పట్ల అవగాహనను పిల్లలో కల్గించాలి.

## విద్యావ్యవస్థలో లోపాలు

వినయమే విద్య యొక్క ప్రాథమిక ఫలం. పూర్వకాలంలో విద్యార్థిని వినేయుడనే వారు. వినయాన్ని పెంపొందించని విద్య, విద్యయే కాదు, తనను తాను నియమించుకొనుటను ముందు నేర్పాలి. మనం, చదువు రానివారని ఈసడించే ఆటవిక జనులలో చాలా తక్కువ పాళ్ళలో చెడు

ఉంది. వారున్నచోట న్యాయస్థానాలు, రక్షకభట వ్యవస్థ లేవు. నేరాల సంఖ్య, బహుస్వల్పం. ఎంతెంతగా కళాశాలలు, విద్యాలయాలు ప్రబలుతున్నాయో అంతంతగా న్యాయసమస్యలు, నేరప్రవృత్తి, మోసం, దొంగతనాలు వృద్ధి పొందుతున్నాయి.

మునుపటి కంటె విద్యావంతులెక్కువగా ఉన్నారనుట సత్యమే. కళాశాలలు సరిపోక రెండు పూటలా తరగతులను నిర్వహిస్తున్నారు. అయినా వినయ సంపద వృద్ధి పొందిందా? కళాశాలలో రక్షకభటుల రావలసిన పరిస్థితి ఎందుకు వస్తోంది?

మనదేశంలో స్త్రీలు సహజంగా వినయ స్వభావం కలవారు. విద్యవల్ల వారికి ఇంకా ఎక్కువగా వినయ సంపద రావాలి. రాసి ఎక్కువైంది, వాసి తగ్గింది.

ఎట్లా విద్యావిధానం ఉండాలో చెప్పే పుస్తకాలు కావలసినన్ని యున్నాయి. అందొక మాట, చిన్నపుడే చదవండని. Learn when you are young. అంటే బ్రహ్మచర్యాశ్రమంలోనే ఉండి చదవండని. గురువు దగ్గరకు వెళ్లి చదవాలన్నారు పూర్వులు. భిక్షమెత్తి గురువునకు విద్యార్థి అందించేవాడు. భిక్షమెత్తినపుడు తనంతట తానే వినయమబ్బేది. అహంకారం తగ్గేది. గురువు దగ్గర ఉండడం వల్ల వాత్సల్య భావానికి నోచుకునేవాడు. గౌరవం చూపించేవాడు.

గురువు తిన్ననైన నడివడితో ఉండి ఆదర్శప్రాయంగా ఉండేవాడు. పరస్పరం భక్తి వాత్సల్యాలు తొణికిసలాడేవి.

ఈనాడది లేదు. నీవు నాకు ప్రశ్నపత్రం ముందుగా ఇస్తావా ఈయవా అని బెదిరిస్తున్నాడు విద్యార్థి.

ఇంతకు ముందు చెప్పిన పాఠాలనే ఇప్పుడు చెబుతున్నారు. కాని పద్ధతి మారింది. ఇది ఎట్లా ఉందంటే మందు అదే అయినా పథ్యం మీద దృష్టి పెట్టడం లేదు. గురుభక్తి లేకపోవడమే పథ్యం పాటించకపోవటం

రాట్నం వడకండి, దంపుడు బియ్యం తినండని గాంధీగారు నెత్తీనోరూ కొట్టుకొన్నా పాటించేవారున్నారా? ఒకరిద్దరు వారి మాటలను ఆచరణలో పెట్టినా కేవలం విడంబనంగా మారాయి. అయితే ప్రాచీన గురుకుల పద్ధతిని తు.చ. తప్పక పాటించాలని నేను చెప్పడం లేదు. అయినా అది పూర్తిగా కనుమరుగు కాకూడదు. పురావస్తు ప్రదర్శన శాలలో పాతవస్తువులను భద్రపరచి కొత్త తరాలవారికి చూపించునట్టు కొన్ని చోట్లలోనైనా ఇట్టి పద్ధతిని ప్రవేశపెట్టి చూడవలసినదిగా కోరుతున్నా.

నేను గురుకుల పద్ధతిలో చదివానని కొంతమందైనా అనగలిగేటట్లు ఏర్పాటు చేయడి. ఈ మందును అక్కడక్కడ వాడి చూడండి.

## జీవితపు విలువ

ప్రజల జీవన ప్రమాణం పెంచాలని ప్రభుత్వం అనేక పథకాలను ప్రవేశపెట్టింది. అయినా బీదతనం వృద్ధి పొందుతూనే ఉంది. పూర్వం ప్రజలలో ఉన్న సంతృప్తి కనబడడం లేదు ఒక జత బట్టలున్నవాడికి రెండు జతల బట్టలున్నాయనే ప్రచారం బాగాలేదు. ఇట్టి జీవన ప్రమాణం సాకుతో అత్యాశలు పెరిగిపోతున్నాయి.

కనీస అవసరాలు అందరికీ ఉండవలసిందే. ఆత్మగౌరవానికి భంగం లేనిరీతిలో అవసరాలుండవలసిందే. దీనికై ప్రణాళికలను సిద్ధం చేయవలసిందే.

ధనవంతుడు తన పటాటోపాన్ని ప్రదర్శించకుండా ఒక గుడిసెలో నున్నవాడు ఎట్లా జీవిస్తున్నాడో అట్లా నిరాడంబరంగా జీవించగలిగితే పరస్పర ఈర్ష్యా ద్వేషాలుండవు. ధనవంతులకు సహజంగా సౌఖ్యాలున్నా వాటిని ఇంకా ఎక్కువగా కోరకుండా, ప్రదర్శించకుండా ఉంటే సమాజం తీరు బాగానే ఉంటుంది.

ఈ విలాస జీవనం నిజంగా అపరిగ్రహ ధర్మానికి విరుద్ధం. పరిగ్రహం అంటే ఇంకొకరి వస్తువులను ఆశించడమే కదా! ఈ నియమాన్ని తు.చ. తప్పకుండా పాటిస్తే మనకు కావలసిన దానికంటె ఎక్కువ కోరం. అదే అపరిగ్రహం. మరి డబ్బుంది కదా అని అడుగుతారేమో! ఆ డబ్బును లేని కుటుంబాలకు కొంత దానం చేయగలిగితే అందరూ సుఖవంతులై యుంటారు కదా! అదే పుణ్యం, ధర్మం. దానివల్ల ఈశ్వరానుగ్రహమూ కల్గుతుంది. బంధరాహిత్యమూ ప్రాప్తిస్తుంది.

ఈ సూత్రాన్ని గమనించకుండా ఖరీదైన బట్టలు నగలతో ఉంటే లేనివారూ వీరిని అనుకరించి వీరికి డబ్బు లేకపోతే అక్రమ మార్గాలు తొక్కడం వల్ల అస్తవ్యస్త స్థితి ఏర్పడుతోంది. 50, 100 సంవత్సరాల వెనుక కాఫీ, టీలు త్రాగే అలవాటు లేదు. డబ్బున్నవారు కూడా గుడిసెలలో జీవించేవారు. చెవులకు తాటంకాలు అనగా తాటాకులతో కూడిన ఆభరణాలను పెట్టుకొనేవారు. ధనవంతుల డబ్బుతో నాలుగైదు కుటుంబాలు హాయిగా బ్రతకవచ్చు.

రేడియో, ఫ్యాన్ వంటివి ఒకనాటి విలాసాలు. అవి నేడు తప్పనిసరై కూర్చున్నాయి. అంటే కోరికలు పెరిగినకొలదీ అదే శాతంలో శాంతి తగ్గుతుంది. ఏది నిజమైన జీవితపు విలువ? మంచినడవడిక కలిగి భక్తి భావం ఉన్నపుడే జీవితానికి యోగ్యత కల్గుతుంది. ఆర్థికంగా ఎదుగుదలనే కొలబద్ధగా నేడు భావిస్తున్నారు. దానివల్లనే అనేకానర్థాలు వస్తున్నాయి.

నేను చెప్పింది ప్రభుత్వం వినదని తెలుసు. అయితే నేను భావించినది చెప్పడం, నా బాధ్యత. జీవన ప్రమాణాన్ని వృద్ధి చేసామని కేరింతలు కొట్టడం కాదు. జీవితపు విలువలను ఎందరు పాటిస్తున్నారో ఆలోచించండి.

## సాదాసీదా జీవనం

కనీస అవసరాలను మించి ఏదో ప్రజలకు ఒరగపెట్టనవసరం లేదు. మనమనుకొన్న జీవన ప్రమాణం పెరిగిన పాశ్చాత్యులు, విలాసవంతంగా బ్రతికినవారు తృప్తిలేక మన యోగం, వేదాంతం, ధ్యానం పట్ల మ్రొగ్గు చూపుతున్నారు. ఇది గమనించారా? ఏమిటి తక్కువని మన దేశానికి వారు వస్తున్నారు? అయినా వారి జీవనాన్ని అనుకరిస్తున్నాం. ఇది దురదృష్టం.

ఎంత విలాస జీవనం గడిపినా అది వారి జీవితంలో విలువలను చూపిస్తోందా? తృప్తిగా నున్నవాడే హాయిగా జీవిస్తున్నాడు కదా!

బాహ్యవస్తువులపై తృప్తి, ఆధార పడదు. వస్తువులను ప్రోగుచేసిన కొలదీ ఇంకా ప్రోగు చేయాలనే కాంక్ష, ఉండనే ఉంటుంది. ఇక వాటికై పోటీ మనస్తత్వం, దెబ్బలాటలు మొదలవుతాయి. అది కావాలి, ఇది కావాలని మనస్సు దొలిచే కొలదీ మానసికంగా మనం లేమినే అనుభిస్తున్నాం. కోటీశ్వరునికి కూడా ఈ లేమి పట్టుకొంది.

ఎక్కువ ధనవంతులున్నా దేశంలో త్రాగుడు, వ్యభిచారం, హత్యలు, దోపిడీలు ఎందుకు ప్రబలుతున్నాయి? ఇది మరీ ప్రబలంగా పాశ్చాత్య దేశాలలో ఉంది. వారిని మనం అనుకరిస్తున్నాం. కోరికలను పెంచుకొని డబ్బు నెట్లా సంపాదించాలనే తపనతో జీవితాలను గడుపుతున్నాం.

సాంఘిక జీవనంలో పరస్పర సహకారం కనబడడం లేదు. ఫలితం నిరుత్సాహం. శత్రుత్వం అంకురిస్తోంది.

కనుక సాదాసీదా జీవనం గడపడం వల్ల వారికి, సంఘానికి మేలు చేసినవారౌతారు.

ఆనాటి రాజులు వేద సంరక్షకులకు దానధర్మాలు చేస్తామని ముందుకు వచ్చినా అందరూ ఎగబడే వారు కాదు. వాడుకలో నున్న పదాలను బట్టి

ఆనాటి వారెట్లా జీవించారో తెలుస్తుంది. పూర్వం కుండలతో వంటలుండేవి. తరువాత ఇత్తడి పాత్రలు వచ్చాయి. అయినా ఇత్తడి కుండలనే వ్యవహారంలో ఉంది. చెవులకు తాటాకు లనే పెట్టుకునేవారు. ఆ తాటంకాలు నేడు వజ్రాలతో పొదిగినా వజ్రతాటంకాలనే వ్యవహారం. వస్తువులో వాడే పదార్థం మారినా పూర్వ వస్తునామమే ఉంది. అంటే పూర్వం మట్టిపాత్రలు, తాటాకు చెవి కమ్మ ఉండేవని తెలుస్తోంది కదా! రాజులకు, మంత్రులకు మాత్రమే పెద్ద పెద్ద భవనాలుండేవి. అది వారి గొప్పదనాన్ని సూచిస్తాయి. ప్రాచీన కళల విద్యల ప్రాభవాన్ని సూచిస్తాయి. పెద్ద పెద్ద వర్తకులకూ పెద్ద భవనాలుండేవి. జాతికి మార్గదర్శకంగా ఉండే బ్రాహ్మణుడు, పూరిగుడిసెలోనే ఉండేవాడు. జీవనపు విలువలను పాటించేవాడు. రాజభవనం కంటె ఆలయం పెద్దదిగా ఉండేది. అందుత్సవాలు జరిగేటపుడు ఊరివారందరూ పెళ్ళి జరుపుకొన్నట్లే భావించేవారు. నేటి పెద్ద పెద్ద విందులు, టీ పార్టీలు ఆనాడు లేవు. ఒకరింట్లో వివాహమైతే వీరూ వారనే భేదభావం లేకుండా తమ తమ ఇళ్ళల్లో జరుగుతున్నట్లే ప్రజలందరూ భావించేవారు. ఈనాడట్టి సహకారం ఉందా? తలో ఒక చేయి వేసేవారు. రానురాను వేద విద్యలకు స్వస్తి చెప్పి పట్టణాలకు ఎగబడ్డాడు బ్రాహ్మణుడు.

గాంధీగారు బ్రతికి ఉన్నంత కాలం సాధారణ జీవితం గడపండనే మాట వినబడేది. ఈనాడా మాట వినబడడం లేదు. చంద్రమౌళీశ్వరుడు ప్రజలకు సద్బుద్ధిని ప్రసాదించుగాక

## లెక్కపెట్టాలి

డబ్బు విషయంలో ప్రతి పైసను లెక్క బెడతాం. జాగరూకతతో ఉంటాం. కొన్న వస్తువునకు అదనంగా ఒక్క పైస చెల్లించం. ఎన్ని వస్తువులను కొంటున్నామో లెక్కపెట్టం. సాధరణంగా జీవితానికి కొన్ని సరిపోతాయి. ఇట్టి జీవితానికి ఉరుకులు పరుగులు పెట్టి విదేశాలకు వెళ్ళి అమితంగా

సంపాదించనవసరం లేదు. అదనంగా సంపాదనకు ఖర్చు పెట్టే కాలాన్ని భగవత్ చింతనకు, పరోపకారానికై ఖర్చు పెట్టగలిగితే జీవితం సార్థక మౌతుంది. కాలం రెండు విధాలుగా వృథా అవుతోంది. డబ్బు సంపాదనకు, అనవసర విషయాలకు ఖర్చు పెడుతున్నాం. తీరని కోరికలను తీర్చుకోవడానికి ఆరాట పడుతున్నాం.

అనవసర వస్తువులకై బేరాలాడటం, ఒక్క పైస అదనంగా చెల్లించకుండా ఉండడం, లెక్కపెట్టడం కాదు.

డబ్బును ఖర్చు పెట్టేటపుడే కాదు, సంభాషణ లోనూ మితంగా ఉండాలి. ఎంత, ఎక్కడ, ఎవరితో, అని గమనించగలగాలి. అట్లా ఉంటే మనకూ, మన పొరుగువారికీ క్షేమం. వాగుడుతనం కంటె మితసంభాషణవల్ల వాక్కులో పదును, వికాసమూ ఉంటుంది. వస్తువును దిమ్మరించగలం, దానిని ఏరడం తేలికా? అనే నానుడి ఉంది. దేనిని రక్షించుకోలేకపోయినా నాలుకను మాత్రం రక్షించుకోవాలని తిరువళ్లువార్ అంటాడు. లోకం అంతా సంభాషణ మయంగా ఉంటోంది. పత్రికల హడావిడి అంతా ఇంతా కాదు. ఏమైనా ప్రజోపయోగకరమైన పనులేమైనా జరిగాయా అంటే వక్తల మాటలే మిగులుతున్నాయి. క్రియశూన్యం. పెడబొబ్బలతో రాజకీయ నాయకుల ఉపన్యాసాలు సాగుతున్నాయి.

కనుక ఏదైనా ఆచితూచి వ్యవహరించగలగాలి. ఒక సెకనులో లక్ష వ్యవహారాలపై మనస్సు పరుగెడుతోంది. విచ్చలవిడిగా భావాలకు అడ్డుకట్ట వేయగలమా? ఈ విశృంఖల భావాలను అదుపులో ఉంచగలగాలి. ఒక్కదానినే ఆలోచించుట, వస్తువుపై కాకుండా వస్తువే అగుట - ఇట్టి పరిస్థితి పట్టుబడేది కాదు. సాధ్యమైనంతవరకూ సద్భావనలతోనే ఉండాలి. మనస్సు చెల్లాచెదురైన కొలదీ మనశ్శక్తి క్షీణిస్తుంది. దానికి అడ్డుకట్ట వేసి సద్భావనలవైపు మళ్లించగలిగితే అది సమర్థవంతంగా పనిచేస్తుంది. కనుక కొన్నింటిపై మనస్సును లగింపచేసే లెక్క గలిగి యుండాలి.

మామూలు జీవితంలో డబ్బు అక్కర్లేదంటే సాగదు. డబ్బులేని జీవితం వృథాయని తిరువళ్లువర్ అంతటివాడే అన్నాడు. అయినా అనవసరంగా గడించడం, బ్యాకులలో దాచడం దుఃఖకారణం. కనీస అవసరాలకై ఖర్చుపెట్టి దానధర్మాలకై వినియోగించినపుడు సార్థకత. అన్ని ఖర్చులలోనూ ఆ ఖర్చే సరియైన ఆదాయం. అది పారమార్థిక ఆదాయం. బీదవారు కూడా తగినంత ఈయాలి. తగినంత ధనవంతులు కాకపోయినా దాతృత్వ బుద్ధికల వారెందరో ఉన్నారు.

విలాసాలకై ఖర్చు పెట్టినవాడే ఋణగ్రస్తుడు. ఇది మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. బీదవారు అట్టివారు కాదు. అందరి కంటె గొప్పవాడిననే భావనను విదలగలిగితే ఖర్చు పెట్టనవసరమూ ఉండదు, ఋణగ్రస్తుడు కానవసరం లేదు. తనంతట తాను ఎంతవరకూ దానం చేయగలుగుతున్నానని ప్రశ్నించుకొని దానబుద్ధి కలిగియుంటే సంఘానికి ఋణపడి యుండదు.

ఇంత మనకుంది. ఇంకా కావాలా అని ధనవంతులు ప్రశ్నించుకోవాలి. ఏ విలాసాలు లేకుండా పూర్వులు గడపలేదా? సంఘానికి ఏం చేస్తున్నాం అని ప్రశ్నించుకోగలిగితే వృథా ఖర్చులనుండి దూరంగా ఉండవచ్చు. దానం ఇచ్చేటపుడు లెక్కపెట్టకూడదు. నదీతీరంలో త్రవ్విన కొలదీ నీరు, ఊరుతూనే ఉంటుంది. అట్లాగే పైవారిని మహాలక్ష్మి కరుణిస్తుంది.

వృథాగా నీటినీ ఖర్చుపెట్టకూడదని పెద్దలంటారు. (అట్లా అయితే డబ్బుండదని సామెత) ఊరకే వస్తుందని భావనతో నీటిని వృథా చేస్తే ఆ వృథా లక్షణము, మిగతా వాటికీ ప్రాకుతుంది. పొదుపుగా ఉండడం లోభి లక్షణమని భావించకండి. అవసరాలకు కూడా ఖర్చు పెట్టకుండా ప్రతిపైసను లెక్కించడం లోభి యొక్క లక్షణం. పొదుపుగానున్న వానికే డబ్బు విలువ తెలుస్తుంది. అట్టివాడు ధారాళంగా దానం చేయగలడు కూడా. సాంక్రమిక

రోగాలు బాగా వ్యాపించునట్లుగా వాగుడుతనం వల్ల కూడ అనర్థాలున్నాయి. నీతి కథలలో చెప్పినట్లు నిశ్శబ్దంగా ఉంటే చాడీలుండవు. తక్కువగా మాట్లాడితే తగాదాలుండవు. ఆంగ్లంలో కూడా Silence is Gold, Speech is Silver అనే సామెత ఉంది. ఇట్టి మౌనస్థితి, ఆధ్యాత్మిక ప్రగతికి దోహదం చేస్తుంది. జ్ఞానం ముంగిట నిశ్శబ్దం ఉండాలన్నారు. పూర్తి నిశ్శబ్దం పాటించలేకపోయినా సంభాషణ నిడివిని తగ్గించగలిగితే అదే పదివేలు. వార్తలు, ప్రతి వార్తలు, ఖండన మండనాలతో వార్తాపత్రికలు నింపబడి యుంటాయి. దీనివల్ల ఏం సాధించినట్లు? మనమూ మన అభిప్రాయాలను ఎవ్వరూ అడుగకపోయినా వెల్లడిస్తూ ఉంటాం. ఇట్లా మన శక్తి వృథా అవుతోందని గమనించారా? మితంగా మాట్లాడడమే కాదు, అది హితంగానూ ఉండాలి. ఆత్మోన్నతిని తీసుకొని వచ్చే మాటలను మాట్లాడండి. సాధ్యం కాకపోవచ్చు. కనుక మాటల కొలత ఉండాలి. లేకపోతే వృథా వాగ్వివాదాలలో తలదూర్చవలసి వస్తుంది. జాగరూకత సుమా!

ఇట్లా మాటలు, పనులు, భావాలలో పొదుపును పాటించాలి. అపుడన్నిటిపై నియంత్రణ ఏర్పడుతుంది. ఆలోచించే మనస్సు, పనులు చేసే శరీరం, మాట్లాడే నోరు, అపుడదుపులో ఉంటాయి. అపుడిహపర సౌఖ్యం.

యోగం అంటే నియమించుట. చెల్లాచెదురు కాకుండా చేసేది. సాంఖ్యము అనగా జ్ఞానమూ యోగమూ ఒక్కటే అని గీతలో అన్నాడు. సాంఖ్య చర్చల కిది వేదిక కాదు. సంఖ్యను బట్టి సాంఖ్యం వచ్చింది. అనగా లెక్క బెట్టుట. అనగా తత్త్వాలను లెక్కపెట్టుట. జనసంఖ్య అని అంటాం. లెక్కబెట్టే తత్వం ఉంటే మనస్సు ఏకాగ్రమై ప్రశాంత స్థితి వస్తుంది. అది పరిపక్వత చెందితే అదే యోగంగా మారుతుంది.

ఇట్లా లెక్కబెట్టగలవారే నిజమైన జ్ఞానులని తిరుమందిరంలో తిరుమూలర్

అన్నాడు. ఏది సత్యం, ఏది అసత్యం అని లెక్కబెట్టగలిగితే ఏది గ్రహింపదగిందో, ఏది కాదో తెలుస్తుంది కదా! ఏది నిత్యం ఏది అనిత్యం అనే వివేచన లేనివానికి లెక్కింపనివానికి పరమసత్యం చిక్కదు.

## మంచి గుణాలకై ప్రయత్నించండి

నేను అనేక ప్రాంతాలలో ఉండవలసి వస్తుంది. వంటిల్లు ఇరుకుగా ఉండడం అందలి పొగ పూజామందిరం వరకూ రావడం వల్ల ఇబ్బందిగా ఉంటుంది. పొగరాని ప్రదేశమేమిటా అని చూస్తే అది వంటిల్లే అనిపించింది. నిప్పు దగ్గర పెద్దగా పొగ ఉండదు కదా! అక్కడే పూజామందిరాన్ని ఉంచేవాణ్ణి.

నిప్పున్నచోట పొగ తక్కువగా ఉండడం, అది అన్నిచోట్ల వ్యాపించడం గమనించారా? సాధారణంగా అనుష్ఠానానికి గ్రామాలే అనుకూలమని, నగరాలకు సాధ్యమైనంత దూరంగా ఉండడం నాకు అలవాటు. నగరాలలో అనాచారం ప్రబలిపోయింది. నగర ప్రజలూ ఒత్తిడి చేస్తే వెళ్ళక తప్పడం లేదు. నేననుకొన్నంత కంగాళీగా నగరాలు లేవు. వైదికానుష్ఠానం గ్రామాలలో కంటే నగరాలలోనే ఎక్కువగా నున్నట్లు గమనించాను. ఇక్కడ ఎట్లా ఉందంటే వంటింట్లో ఎక్కువ పొగ లేనట్లుగా ఉంది.

గ్రామ వాతావరణమే నిజంగా బాగుండాలి. కర్మానుష్ఠానానికి అదే సరియైన చోటు. వృథా కాలక్షేపాలతో బొత్తిగా శాస్త్రవాసన లేకుండా గ్రామ ప్రజలు జీవితాలను గడుపుతున్నట్లు గమనించాను. నగర ప్రజలు కార్యాలయాలకు వెళ్ళడం, సంఘసేవ మొదలైనవి ఎన్నో చేస్తూ వుంటారు. అందువల్ల మతానుష్ఠానానికి తక్కువ అవకాశం ఉంటుందని మొదట భావించాను. కాని వారిలోనే అమితశ్రద్ధ కన్పించింది. పూజలు, భజనలు, దేవాలయ దర్శనం, పురాణ శ్రవణం వంటి వాటిని ఆచరిస్తున్నారు. తృప్తి కలిగింది.

మన ధర్మాలను మనం ఆచరించినపుడే మనకు తృప్తి. డబ్బు సంపాదన కోసం సాధారణంగా నగరాలకు వలస పోతున్నారు. వెట్టి సంపాదనకై దృష్టి పెట్టకండి. ఇంకా డబ్బు కావాలని పూజలు చేయడం కూడా హర్షింపదగింది కాదు. ఇతరులు మనలను భక్తులనుకొంటారని పూజలు చేయకూడదు. ప్రధానంగా అహంకారాన్ని పెంచి పోషించకూడదు. అప్పుడే మన వృత్తులకు మన సంపాదనకు న్యాయం చేసిన వాళ్ళమౌతాము. తద్వారా దేశ సౌభాగ్యమూ సిద్ధిస్తుంది.

నాగరికత పేరుతో ఎన్నో మంచి పనులను విసర్జిస్తున్నాం. దీనికంతటికీ డబ్బుమీద విపరీత వ్యామోహమే కారణం. ఈ విషయంపై దృష్టి సారించండి.

## కట్నాల సమస్య

అందరికీ ఏవో సమస్యలు. కొంతసేపైనా బాధలనుండి విముక్తులు కావాలని మా దగ్గరకు వస్తూ ఉంటారు. కేవలం వినోదం కోసం వస్తే నిష్ప్రయోజనం. మీరు బాగుపడాలని కొన్ని చెబుతూ ఉంటే చేయడం, చేయకపోవడం మీ ఇష్టం. జగద్గురు పీఠాన్ని అలంకరించాను కనుక చెప్పడం నా విధి. మీ నుండి ధనాన్ని స్వీకరిస్తున్నాను కదా! చెప్పకపోతే నాది తప్పు.

ఎందుకీ ఉపోద్ఘాతం అంటే ఒక విషయం చూసి బాధపడ్డాను. ఎందరో అవివాహితలైన స్త్రీలు వచ్చి వివాహాలు కాలేదని బాధపడుతున్నాం అన్నారు.

వయస్సు దాటినా ఎందుకు కావడం లేదు? శారదా చట్టం గురించి నేను తప్పు బట్టడం లేదు. 14 సంవత్సరాలలో వున్న పిల్లలకు మాత్రమే వివాహాన్ని నిషేధించింది. *(ఈనాటి ప్రభుత్వం ఆ వయస్సును పొడిగించింది)* అయినా పాతిక సంవత్సరాలు వచ్చిన పిల్లకు ఎందుకు వివాహం కావడం లేదు? ఎంత నిర్లక్ష్యంగా ఉన్నామో ఆలోచించండి.

వివాహమంటే ఎంతో ఖర్చు. కట్నాల వేధింపు. దీనికి తల్లిదండ్రులు తల్లడిల్లిపోతున్నారు.

ఇంతటితో ఆగలేదు. ఆడపిల్లల్ని పెద్ద పెద్ద చదువుల్ని చదివించి వాళ్ళు ఉద్యోగాలు చేస్తే చూసి సంతోషిస్తున్నారు. పూర్వకాలంలో ఈ పద్ధతులే లేవు. పెళ్ళికాని పిల్లలను చూసి తల్లిదండ్రులు తల్లడిల్లిపోయేవారు. కాని మన నాగరిక ప్రవృత్తి ఏదారికి తీసుకొనిపోతోందో గమనించారా? ఉద్యోగాలు చేస్తూ పురుషులతో చెట్టపట్టాల్ వేసుకోవడం మన నాగరికతక విరుద్ధం కాదా? *(పబ్బుల్లో త్రాగుడు, నృత్యాలు చేస్తున్నట్లు ఇటీవల టీ.వీలలో చూస్తున్నాం)* మీరు వినకపోయినా నా బాధను వ్యక్తీకరించాలి.

దేశం కోసం ఎన్నో త్యాగాలు చేసినవారు, కట్నాలను విదులుకోలేరా?

ఏమిటి దీనికి విరుగుడు? ఆడంబరాలు తగ్గించి మిగిలిన డబ్బుతో బంధువులలో లేనివాళ్ళ పిల్లల పెళ్ళిళ్ళకై కొంత వినియోగించండి. దానివల్ల ఇహమూ, పరమూ ఉంది. సంఘంలో ధర్మాన్ని నిలబెట్టండి.

స్త్రీలే మన ధర్మాన్ని చూపించే కరదీపికలు. వారి సహజ సుందర లక్షణాలు పోకుండా కాపాడండి. వాళ్ళ కన్నీళ్ళవల్ల ధర్మం నిలబడుతుందా? స్త్రీలను రక్షించుకోలేకపోతే వర్ణ సంకరమౌతుందని అర్జునుడు కృష్ణునితో మొరబెట్టుకున్నాడు కదా! సకాలంలో వివాహం జరిగి గృహలక్ష్ములుగా విరజిల్లాలి. కట్నపిశాచానికి దూరంగా ఉండండి. నా ఆశీస్సులతో అని శుభలేఖలు వేస్తున్నారు. కట్నాలు తీసుకొని అట్లా మా పేరును ముద్రించకండి.

## యువకుల ధర్మం

ఇతరుల బాగు కోసమే ఈ శరీరం ఉందని సూక్తినందించారు పూర్వులు. పరోపకారార్థమిదం శరీరం. ఒంట్లో సత్తువ ఉన్నపుడు సంఘసేవకై యువకులు తమ బలాన్ని ఉపయోగించాలి. అట్లా సేవించడం వల్ల శరీర బలమూ పెరుగుతుంది. అంతకంటె శీలసంపదను వృద్ధి చేసుకోవడానికి తప్పక ప్రయత్నించాలి. అట్లా ఉన్నపుడే సేవ చేయగలం.

సంఘసేవ చేయదలచుకొన్నవారు ధర్మ, సత్యాలకు కట్టుబడి యుండాలి. నిర్భయత్వముండాలి. క్రూరంగా ఉండడం వేరు, నిర్భయంగా ఉండడం వేరు. రెంటినీ కలపకూడదు. ఆంజనేయుడే యువకులకు ఆదర్శప్రాయుడు. ఎంత బలవంతుడైనా అతడు శాంత మనస్కుడే. క్రోధం చూపించవలసి వచ్చినపుడు మహావీరుడై శత్రువులపై దండెత్తుతాడు. అతని బుద్ధిబలమూ గొప్పదే. అయినా వినయంతో, భక్తితో కార్యాలను నిర్వహిస్తాడు. క్రూరత్వం లేదు. ఇతరులు దండెత్తినపుడే తన పరాక్రమాన్ని చూపిస్తాడు. బలహీనులను రక్షించడం కోసమే సాహస కృత్యాలను చేస్తాడు. అట్టివాడే శివాజీ మహారాజు. అతడు సమర్ధరామదాస శిష్యరికంలో మెలిగినవాడు. ఆ గురువే ఆంజనేయావతారం.

శరీరబలం ఉంటూ అహింస, నిర్భయత్వంతో, తన కష్టాలను స్మరించకుండా ఇతరులను రక్షించగలిగితే అది గొప్ప సుగుణమే. దీనినే క్షాత్రమని అన్నారు. ఆపదలనుండి రక్షించడమే క్షాత్రగుణం. కనుక ఈ ధర్మాన్ని పాటించవలసిన పని నేడధికంగా ఉంది. ఇతరులను రక్షించడంలో కొందరు క్రూర మార్గాలను ఎంచుకొంటారు. అది సరికాదు. ధర్మానికి హాని కలిగినపుడు జీవితం, శాశ్వతం కాదని ముందంజ వేయగలగాలి. అది సేవాధర్మం.

దురదృష్టవశాత్తు యువకుల బలం దారి తప్పుతోంది. సమ్మెలు, నిరాహార దీక్షలు, దిష్టిబొమ్మలను తగలేయడం, రోడ్డు, రైలు మార్గాలను అడ్డుకోవడం, ఆస్తినష్టం తీసుకొని రావడం మొదలైనవి ఎన్నో చూస్తున్నాం. వారి లక్ష్యం నెరవేరడం కోసం ఈ మార్గాలనెంచుకొంటున్నారు. దానివల్ల బలహీనులు ఎన్నో కష్టాలనెదుర్కొనవలసి వస్తోంది. ఈ బలహీనత ప్రభుత్వాన్ని చుట్టుకొంది. నివారించలేకపోతోంది. క్షాత్రధర్మంలో ఆధ్యాతిక బలం దాగియుంది. ఒక క్రమశిక్షణతో కూడినదది. అందు అన్యాయాన్ని నెదుర్కొనే

లక్షణం ఉంది. ఇట్టి ధర్మంతో ప్రజల సమస్యలను తీర్చగలగాలి. ప్రభుత్వం యొక్క తీరుతెన్ను బాగుపడుతుంది.

## అహింసా యోధులవసరం

అయ్యా! ఆధునిక శాస్త్ర విజ్ఞానం వల్ల ఎంతో సౌఖ్యాన్ని అనుభవిస్తున్నాం. మతంగోల ఎందుకని ప్రశ్నిస్తున్నారు. ఆధునిక సదుపాయాలు ఉండవలసిందే. సుఖం, తృప్తి అనేవి మనస్సునకు సంబంధించినవి. డబ్బేపరమపావనమని, సౌకర్యాలను సమకూర్చుకోవడమే పరమార్థమని భావించేవారికి తృప్తి ఉందా? పూర్వులకున్న ఆత్మ తృప్తి ఈనాడుందా? నిజమైన తృప్తి వస్తువులను పొందడంలో కాదు, కోరికలను తగ్గించినపుడే. అది మతం మాత్రం అందించగలదు. కనుక సైన్సు ఎంత వృద్ధి పొందిందో అంతగా మతాను ష్ఠానమూ వృద్ధి చెందినపుడే ఆత్మతృప్తి కల్గుతుంది.

అగ్రరాజ్యాలైన అమెరికా, రష్యాలలో ఆత్మశాంతి యుందా? స్ఫుత్నిక్‌ని అంతరిక్షంలోకి పంపింది రష్యాదేశం. అది కమ్యూనిస్టు దేశం. అందు మతబోధలుండవు. (నేటి పరిస్థితి వేరు) ఎంత విజ్ఞానాభివృద్ధి యున్నా అక్కడ శాంతిలేదు. వాళ్ళేమి చేసారు? మన భారతాన్ని అనువదించుకొని పిల్లలచే చదివిస్తున్నారు. అమెరికాలోనూ శాంతి లేకపోవడం, మన వేదం, యోగం, ధ్యానం సంకీర్తనాదులను ప్రవేశపెట్టారు. ఎంత వృద్ధి చెందినా మనదేశం వైపుకి తిరిగి చూస్తున్నారు. మనము మనవాటిని నిర్లక్ష్యం చేస్తే ఎలా?

మనదేశంలోనూ నాస్తికత, హేతువాదమూ ప్రబలినా మన సనాతన ధర్మము కనుమరుగు కాలేదు. కనుక దానిని కాపాడుకోవడం మన విధ్యుక్త ధర్మం.

ఏం చేయాలి? నాస్తికులతో దెబ్బలాడి రక్షించాలా? కాదు. యుద్ధాలు

చేసి హిందూ మతం వృద్ధి పొందినట్లు చరిత్రలో లేదు. సంఘసేవ అనే మిషతో మతాలను మనమెన్నడూ మార్చలేదు. ఇతరులు మనలనట్లా మారుస్తున్నారు. ఎన్ని దండయాత్రల ఈ దేశంపై జరిగినా నిజరూపాన్ని ఈ దేశం పోగొట్టుకోలేదు.

అయితే ఎట్లా బ్రతికింది? ఆధ్యాత్మిక సత్యాలుండడం వల్ల బ్రతికిందా? కాదు. సామాన్యులకు వేదాంత విషయలు తెలియవు కదా!

ఏ ప్రచారమూ లేకుండా ఎట్లా బ్రతికింది? మిగతా దేశాలలో పోప్, లామా, కాలిఫ్ వంటి వారున్నట్లు ఈ దేశంలో అట్టివారుండడం వల్ల బ్రతికిందంటారా? లేదు.

ఎన్నో మానభంగాలు, గుళ్ళు గోపురాల విధ్వంసాలు, క్రూర కృత్యాలు ఇతరులు మనపట్ల చూపించినా సనాతన ధర్మం మనగలిగింది. కారణం? మత ప్రచారం చేయడం కంటే మతానుష్ఠానికి పూర్వులు ప్రాధాన్యం ఈయడం వల్ల బ్రతికింది. ప్రతిరంగంలో ఎందరో మహాత్ములు పుట్టి తమ జీవితాల ద్వారా సంఘాన్ని నడిపారు. వారి భక్తి, తత్వజ్ఞానం, ఆచారం వల్లనే. వారిని సామాన్యులు ఆదర్శప్రాయంగా గ్రహించారు. మతంపై సామాన్యులకు రుచి ఏర్పడింది.

ఈనాడు కూడా అట్టివారుంటే నాస్తికత, ఏమీ చేయలేదు. ధర్మరక్షణకై సైనికబలం అక్కర్లేదు. అహింసాయోధులు కావాలి. వేదానుష్ఠాన పరులు కావాలి. సైనికుడు ఎందుకంటున్నానంటే అతడు మరణానికి వెనుకాడడు గనుక: కనుక అట్టివారి స్వధర్మానుష్ఠానానికి జనులాదరిస్తారు. భయపడి కాదు. వారంత ఎత్తునకు మిగిలిన ప్రజలు ఎదగకపోవచ్చు. ప్రయత్నం చేస్తే కోటికొకడున్నా చాలు. పుట్టకబోడు.

తాము తరించి ఇతరులను తరింపచేసేవారు తరతరాలలో పుట్టడం వల్లనే ఈ ధర్మం మిగిలింది. పరమేశ్వరానుగ్రహం ఉంటుంది. నాస్తికతను

వాళ్లు తూలనాడిన కొద్దీ ఆస్తికులలో పట్టుదల పెరుగుతుంది. రాక్షసులు, దేవతల కథలనట్లా ఉంచండి. కలియుగంలో అనేక అవైదిక మతాలు రాగా; శంకరులు, జ్ఞాన సంబంధర్ వంటివారు రాలేదా? ఔరంగజేబు దండయాత్రకు శివాజీ సమాధానం చెప్పలేదా? రాణి అహల్యాబాయి పుట్టలేదా! మన మతం ఎట్లా ఉండబోతోందో అని శంకించనవసరం లేదు. విష్ణు సహస్రనామాలలో స్వామి, భయకృత్ భయాన్ని కల్గించువాడని; భయనాశనం భయాన్ని పోగొట్టేవాడనే అనే నామాలున్నాయి. మనలను సరిచేయడం కోసం ఆయన భయాన్ని కల్గిస్తాడు. మన నడవడికను సరిదిద్దుకొనగలిగితే వెంటనే భయనాశకుడవుతాడు.

కనుక మతస్థులతో, హేతువాదాలతో నాస్తికులతో వాదాలకు పోట్లాటలకు దిగకుండా మన మతాన్ని అనుష్ఠిద్దాం. ఫలానా ఫలానా సంగతులు మన పుస్తకాలలో ఉన్నాయని చెప్పి అవతలివానిని సంతృప్తి పరచాలనే ప్రయత్నం బదులు ఇట్టి అనుష్ఠాన పరులు మాలో నేటికీ ఉన్నారని ఎలుగెత్తి చాటండి. వేదధర్మరక్షకులుగా అహింసా యోధులు కావాలి. సైనికుడు ఒక్క అంగుళం భూమిని శత్రువునకు ధారదత్తం చేస్తాడా? అట్లాగే మన మత రక్షణకు పూనుకోవాలి. ఇది పవిత్ర హృదయంతో సాగాలని మరిచిపోకూడదు. సనాతన ధర్మం జయించుగాక.

## ప్రపంచ బాధలకు నివారణోపాయం

గత శతాబ్దంలో అనేకమైన మార్పులు వచ్చాయి. భౌతికశాస్త్రం, ఆర్థికశాస్త్రం, రాజనీతి, సంఘ క్రియా కలాపాలలో మార్పులు కన్పిస్తున్నాయి. అనేక శతాబ్దాలలో జరిగిన మార్పుల కంటే ఇవి ఎక్కువగా ఉన్నాయి. కాలం గడుస్తున్న కొద్దీ భగవానునకు, ధర్మానికి దూరంగా తొలగిపోతున్నారు. అందువల్ల అనేక కష్టాలకు జనులు లోనైపోతున్నారు. ఆధునిక శాస్త్రం అభివృద్ధి చెందిన కొలదీ ఆందోళనలు, అవిశ్రాంతి పెరిగి పోతున్నాయి. ప్రశాంతంగా నడిచే జీవన విధానంలో అల్లకల్లోల పరిస్థితి ఏర్పడింది. ప్రపంచానికి పెనుముప్పు దాపురించింది.

సరే! రోగాన్ని గుర్తించాం. దీనికి నివారణ ఏమిటి? భగవద్భక్తి, శాంతులే విరుగుళ్ళు. ఇవి పెరిగినకొద్దీ, రక్షక భట వ్యవస్థకు, న్యాయవ్యవస్థకు పని తప్పుతుంది. వీటి అవసరం గత శతాబ్దాలలో ఎక్కువగా లేదు.

కనుక ప్రజలను ఆధ్యాత్మిక మార్గంలోకి మళ్లించే బాధ్యత ప్రభుత్వంపైన ఉంది.

అట్లా జరుగుతోందా? ప్రభుత్వం మతరహితమైన ధోరణిలో ఉండడం వల్ల మతాన్ని గూర్చి పట్టించుకోవడం లేదు. అంటే అన్ని మతాలను ప్రోత్సహించడానికి బదులుగా ఏ మతాన్ని ప్రోత్సహించదు.

అప్పుడప్పుడు రాజకీయనాయకులు నైతిక బోధ గురించి మాట్లాడుతూ ప్రత్యేక సంఘాలను నియమిస్తూ ఉంటారు. నివేదికలను సమర్పిస్తూ ఉంటారు. మిగిలేది శూన్యం. సాంస్కృతిక కార్యక్రమాలపేరుతో కొన్ని ప్రదర్శనలు, సంగీత కచ్చేరీల పేరుతో కొంత తంతు జరుగుతోంది.

ప్రతిచోట ఏవో సంఘాలు, సమావేశాలు జరుగుతున్నాయి. ఒక్కొక్క దానికి ఒక్కొక్క లక్ష్యం. మరల వీటిల్లో అభిప్రాయభేదాలు. ద్వేషం, అసూయ మామూలే. మనకే సంఘం కావాలి? ద్వేషం బదులు ప్రేమను పెంచేది, విప్లవం బదులు శాంతిని కల్గించే పద్ధతులు, సంఘాలు కావాలి. అటువంటివే సంఘంలో భక్తి బీజాలను నాటగలవు. వీటి నైతిక బలం వల్ల మిగతా సంఘాలలోనూ మార్పులు తీసుకొని రావచ్చు.

ఇట్టి సంఘాలు గ్రామగ్రామాన స్థాపించాలి. అందు పని చేసేవారు ఒక నిబద్ధతతో, భక్తితో పనిచేయాలి. అపుడీశ్వరకృప తనంతటఅదే వర్షిస్తుంది. రాజకీయ పక్షాలలో ఒకరకమైన మైత్రిని తీసుకొని రావచ్చు. ఇట్లా మనదేశాన్ని తీర్చి దిద్దగలిగితే అది ప్రపంచానికే ఆదర్శవంతమౌతుంది. లోకాః సమస్తాః సుఖినో భవంతు అనేదే మన లక్ష్యం.

ధనం బాగా చెలామణి కావడం పరస్పర అవిశ్వాసం మొదలైనవాటిని పై సంఘాలవల్ల అరికట్టవచ్చు. ఇట్టి మహోత్తమ ప్రయోజనం కోసం సంఘసేవ చేయాలి.

స్వస్తి

# అనువాదకుని పరిచయం

దేవరకొండ శేషగిరిరావు, గోకులం దగ్గర, అశోక్ నగర్,
వెంకటాద్రి రెసిడెన్సీ. కాకినాడ. సెల్ :- 9959288443

**రచనలు:** కామకోటి స్వామివారి 1. అద్వైత సాధన 2. గురుసంప్రదాయం, 3. అద్వైతం 4. శివసంహిత 5. ఘేరండ సంహిత 6. అనేక రామాయణాలలో సుందరకాండ 7. విజ్ఞానభైరవ తంత్రం 8. శాక్తానందతరంగిణి 9. యోగయాజ్ఞవల్క్య సంహిత

ప్రతులకు : నవోదయా బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాద్

10. దశమహావిద్యలు 11. ఉత్పలదేవుని శివస్తోత్రావళి 12. అప్పయ్య దీక్షిత వరద రాజస్తవం 13. ఆత్మార్పణస్తుతి

ప్రతులకు: ఋషిపీఠం ప్రచురణలు, చిక్కడపల్లి, హైదరాబాద్

14. దినచర్య 15. యక్షప్రశ్నలు 16. ధర్మ సందేహాలు 17. గోరుముద్దలతో 18. వసుభాగుని పంచతంత్రకథలు 19. మంత్రయోగ సంహిత 20. పురాణాలలో రత్న పరీక్ష 21 పండుగలు - ఓషధులు - వైద్యం 22 సుభాషితరత్నాకరం 23. చాణక్య నీతిసూత్రాలు 24. తీర్థ యాత్ర 25. అభినవ గుప్తుని గీతార్థసంగ్రహం

ప్రతులకు: గొల్లపూడి వీరాస్వామి, కోటగుమ్మం, రాజమండ్రి

26. విగ్రహ పరమార్థం 27. శివస్వరోదయం

ప్రతులకు: రోహిణీ పబ్లికేషన్స్, కోటగుమ్మం, రాజమండ్రి

28. ఆనంద రామాయణం

ప్రతులకు: శివకామేశ్వరి గ్రంథమాల, కృష్ణలంక, విజయవాడ

29. మనదేవతలు - గణపతి 30. నటరాజు 31. శివుడు 32. విష్ణువు 33. కుమారస్వామి 34. సూర్యుడు 35. శక్తి 36. బ్రహ్మాది దేవతలు 37. రూపగోస్వామి - పద్యావళి 38. లలితా సహస్రనామాలు 39. కబీర్‌పాటలు పాండురంగవిఠల 40. పార్వతి + లక్ష్మి + సరస్వతి

ప్రతులకు: రామకృష్ణ మఠం, దోమలగూడ, హైదరాబాద్

43. తంత్రపరిచయం 44. కులార్ణవతంత్రం

ప్రతులకు: శ్రీ జె. జగన్నాథ శర్మ, మాచవరం, వయా అంబాజీపేట

45. తంత్రం - వైద్యం 46. పురాణాలు - పర్యావరణం

ప్రతులకు: సాహితీ ప్రచురణలు, సూర్యారావుపేట, విజయవాడ

47. భారతీయ సంస్కారములు 48. శివసహస్రనామములు

ప్రతులకు: తిరుమల తిరుపతి దేవస్థానం, తిరుపతి

49. భారత కథలు- అంతరార్థం 50. భావమయం జగత్ 51. భావాంబర విహారం (ఇవి నేడు లేవు)

**వృత్తి: (విశ్రాంత) ఆంధ్రోపన్యాసక కత్వం**
**ప్రవృత్తి : భారతీయ సంస్కృతికి అర్చకత్వం**

# మా ఇతర ప్రచురణలు

## కంచి పరమాచార్య
## అమృతవాణి

ప్రథమ భాగము

### అద్వైతం

శ్రీ దేవరకొండ శేషగిరిరావు

తృతీయ భాగము

### షట్పదీస్తోత్రము

శ్రీ దేవరకొండ శేషగిరిరావు

చతుర్థ భాగము

### సనాతన ధర్మంలో సంఘసేవ

శ్రీ దేవరకొండ శేషగిరిరావు

ప్రచురణ

**మహా విద్యాపీఠం**

ఎయిర్‌ఫోర్స్ అకాడమీ రోడ్, దుండిగల్, హైదరాబాద్ - 500 043

౩౩౦